# ఇండియన్ కాఫీ ఇండస్ట్రీ

## ఇండియన్ కాఫీకి, పేరు, రుచి, ప్రత్యేకతలు, సారవంతమైన భూమి, వాతావరణము భారతీయ సంస్కృతినుండి లభించినది.

పశ్చిమ కనుమల చల్లని సానువులలో, తూర్పుగా వ్యాపించిన ప్రదేశములో, శ్రేష్టమైన కాఫీకి కావలసిన అనుకూల వాతావరణంలో ఇండియన్ కాఫీ పండించబడుతున్నది.

భారతదేశంలో కాఫీ 80,587 ఎస్టేట్సులో 171535 హెక్టర్ల విస్తీర్ణముగల భూమిలో పండించబడుతోంది. ఇందులో 10 హెక్టర్లకంటే తక్కువ విస్తీర్ణముగల ఎస్టేట్లు 78358 వరకు, 10 హెక్టర్లకు మించిన ఎస్టేట్లు 2229 వరకు వున్నవి. ఈ ఎస్టేట్లలో రోజు 236295 మంది పనివాళ్లు పనిచేస్తూ వుంటారు.

భార॰ కాఫీ పరిశ్రమ అభివృద్ధికి, అభ్యున్నతికి కాఫీ బోర్డు పనిచేస్తున్నది. కేంద్ర కాఫీ పరిశోధనాసంస్థ కర్నాటక రాష్ట్రంలోని, చిక్‌మగళూరుజిల్లా, బల్బనూరుతో నెలకొల్పబడినవి. శాస్త్రీయ పద్ధతిలో కాఫీ ప్లాంటేషనులలో కాఫీ పంటను పండించడానికి రీసర్చి డిపార్టుమెంటు తోడ్పడుచున్నది.

### కాఫీ సాగు చేసే ప్రాంతం

| రాష్ట్రం | అరబికా (హెక్టార్లు) | రోబస్టా (హెక్టార్లు) | మొత్తం (హెక్టార్లు) |
|---|---|---|---|
| కర్నాటక | 68966 | 32710 | 101676 |
| తమిళనాడు | 23501 | 4567 | 28068 |
| కేరళ | 4177 | 36325 | 40502 |
| ఆంధ్రప్రదేశ్ | 1023 | — | 1023 |
| అస్సాం | 174 | — | 174 |
| **ఇతర రాష్ట్రములు** | | | |
| ఒరిస్సా, ప. బెంగాల్ అండమాన్స్, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర (ప్రయోగాత్మక ప్లాంటేషన్లు) | 53 | 39 | 92 |
| | 97894 | 73641 | 171535 |

భారతదేశంలో అత్యుత్తమమైన కాఫీ పంట దిగుబడి లక్ష టన్నులుగా అంచనా.

పండిన కాఫీని ప్రాసెస్‌చేసి, శుద్ధిచేయబడుతుంది. దేశంలో మొత్తం 31 కాఫీ క్యూరింగ్ సంస్థలు పనిచేస్తున్నాయి. దేశంలో శ్రేష్టమైన కాఫీ ఉత్పత్తికి యివి నిరంతరము శ్రమిస్తున్నవి. కాఫీ పండ్లను జాగ్రత్తగా కోయుట. శాస్త్రీయ పద్ధతిలో ప్రాసెస్ చేయుట, క్యూరింగ్ చేయుట, మొదలైనవి ప్రమాణాల ననుసరించి చేయడంద్వారా శ్రేష్టమైన కాఫీ ఉత్పత్తికి దోహదం చేస్తుంది.

1916–77లో కాఫీ ఎగుమతులుద్వారా 151 కోట్ల విలువైన విదేశమారకం మనదేశానికి లభించింది.

ప్రస్తుతం సాగుచేస్తున్న ప్రాంతాలలో హెచ్చు కాఫీ పంటకు, మరియు యితర ప్రాంతాలను కాఫీపంటకు అనువుగా మార్చడానికి, అంతర్జాతీయ మార్కెట్లలో కాఫీకిగల గిరాకిని ఎగుమతులను దృష్టిలో వుంచుకొని కృషి జరుగుతోంది.

# ఆంధ్రపత్రిక

## కాలయుక్తనామ
## సంవత్సరాది సంచిక

[అరువది ఎనిమిదవ సంచిక]

[ 1978 - 79 ]

వ్యవస్థాపకులు : శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[ 1938–1972 ]

సంపాదకుడు : శివలెంక రాధాకృష్ణ

వెల రూ. 3

ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము

**Supplement to Andhra Patrika Issue Dated 8-4-1978**

**Regd. No. H/VJ No. 49**

# కాలయుక్తనామ సంవత్సరాది సంచిక

# విషయానుక్రమణిక

సంచిక 68 సంవత్సరము 1978-79



ముఖచిత్రం వివరములు :

## వృషారూఢ మాహేశ్వరి

సేకరణ : శ్రీ కోడూరి రామమూర్తిగారు.

# స్వవిషయం

కొంతకాలంకిందట భారతదేశంలో కొన్ని వ్యక్తి స్వాతంత్ర్యాలకి పెద్దదెబ్బతగిలింది. దేశం ఇంకా ఆ దెబ్బనుంచి కోలుకుంటోంది. అభిప్రాయ ప్రకటనకి సంబంధించిన వ్యక్తి స్వాతంత్ర్యం వార్తాపత్రికలకి చాలా ముఖ్యం కాబట్టి "స్వవిషయం" లో మరొకసారి దానిని గురించి రాయక తప్పటంలేదు. వ్యక్తి స్వాతంత్ర్యాలు, అందులోనూ వాక్ స్వాతంత్ర్యం ఉన్నప్పుడు దాని విలువని అంచనా వెయ్యటం కష్టంగా ఉంటుంది. ఈ స్వాతంత్ర్యాలన్నీ ఎక్కువగా ఉన్న సమాజాలే ప్రపంచంలో తక్కిన వాటికి మార్గదర్శకంగా ఉంటున్నాయని మాత్రం గుర్తు చేసుకోవచ్చు. ఇతరులకి అభిప్రాయ ప్రకటన స్వేచ్ఛ అక్కరలేదనుకునేవారు సయితం తమకి అది ఉండాలని అంటూ ఉంటారు. నిరంకుశ పరిపాలన కొనసాగే రాజ్యాలలో అధికారంలో ఉన్నవారు ఇతర సమాజాలలో ప్రజాస్వామ్య వ్యవస్థని గురించి ఆందోళన ప్రకటించటం దీనికొక నిదర్శన అనిపిస్తుంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థకి భారతదేశంలో అంత పాత చరిత్రలేదు. ఆ వ్యవస్థకి హాని జరగటం అంత కష్టంకాదని 1975 జూన్‌లో అత్యవసర పరిస్థితి ఎంతో తేలికగా అమలులోకి రావటమే తెలుపుతుంది. ఆంధ్రప్రదేశ్‌లో ఎమర్జెన్సీ విధింపు కఠినంగా జరుగలేదు కనుక ఇక్కడ కాంగ్రెసు పార్టీయే 1977 లోకసభ ఎన్నికలలో గెలువగలిగిందని ఎందరో అనుకున్నారు. 1978 లో మరొకసారి శ్రీమతి గాంధీ పార్టీ గెలవటం కొంత కలవరపాటు కలిగిస్తోంది. కాంగ్రెసు (ఐ) కి సుమారు అరవయి శాతం సీట్లు వచ్చినప్పటికీ నలభయి శాతం వోట్లుకూడా పడలేదు కనుక ఆంధ్రప్రదేశ్‌లో "ఇందిరా ప్రభంజనం" వంటిది వీచలేదనే అనుకోవాలి. అసాధారణమయిన చొరవ, సామర్థ్యం, చురుకుదనం కలవారుగా పేరుపొందిన వ్యక్తి ముఖ్యమంత్రి అయ్యారు. శ్రీమతిగాంధీ ఏ పార్టీలోఉన్నప్పటికీ అందులో ఇతరుల వ్యక్తిత్వానికి అవకాశాలు తక్కువగా ఉంటాయి. కాంగ్రెసు (ఐ)లో వచ్చే పరిణామాల ప్రభావం రాష్ట్రంలో కనిపించక మానదు. నేటికి చరిత్రలో అంశాలుగా మారిపోయిన కొన్ని కారణాలవలన ఆంధ్రప్రదేశ్‌లో ప్రాంతీయ విభేదాలు గమనించదగిన యదార్థాలుగా నిలబడిపోయాయి. డాక్టరు చెన్నారెడ్డి ముఖ్యమంత్రి అవుతూనే అన్ని ప్రాంతాల వారికీ న్యాయం జరుగుతుందని హామీ ఇవ్వవలసిరావటమే దీనికొక నిదర్శనం. అభిప్రాయప్రకటన ప్రజాస్వామ్య వ్యవస్థలో ఒక అతిముఖ్యమయిన అంశం అయితే సత్యం, అహింసలు కూడా అంత ముఖ్యమయినవని గుర్తుచేసుకోవటం నేడు చాలా అవసరం. జాతిపితగా పరిగణింపబడుతున్న గాంధీగారు తమ జీవితాన్ని వీటికే అంకితం చేశారు. అత్యవసర పరిస్థితి కాలంలో సత్యానికి అంత విలువ లేకుండా పోయింది. అందరూ కృషిచేసి దానిని వీలయినంత వరకు పునరుద్ధరించాలి. అసత్యప్రచారం తగ్గిన కొద్దీ అహింసా పద్ధతులు పనిచేసే అవకాశాలు పెరుగుతాయి. కాళయుక్త సంవత్సరంలో దేశాన్ని పీడుస్తున్న సమస్యలెన్నో తీరుతాయని ఆశించాలి.

# అస్తి

## శ్రీ వఝ్ఝల కాళిదాసు

కలలో చూచిన దూరాలకు
ఊహా సముద్ర తీరాలకు
నీ యన్వేషణ వృధా సుమీ
ధ్యేయం బేదో ఎరుంగుమీ

కంటక రహితంబైన పథం
వెంటబోవుటే సుఖ ప్రదం !

అంబర మనంత మహా బిలం
అంబుధి అగాధ రసాతలం
ఆ వంక కనంబడు శూన్యం
ఈ వంక పంకమే శరణ్యం

అడుగడుగునకూ అగు దూరం
కడ తెలియని ఆశా తీరం

ఎక్కడో ఏదో కలదంటూ
ఇక్కడ ఉన్నది లేదంటూ
ఎరగని వానికి కలగంటూ
ఎరిగిన వన్నీ కాదంటూ

ఏలా నాస్తిక సిద్ధాంతం
ఎరుగు వాస్తవతా శుభోదంతం

ఇది నవతా పథాయస్కాంతం
ఇది సమతామత వేదాంతం

ఏమున్నదిందు రాద్ధాంతం !

చీకటి వెలుగుల జీవితమ్ములో
చింతలు, నవ్వులు వే విధమ్ములు
కలిమి లేములకు బ్రతుకు దర్పణం
సుఖదుఃఖాలకు అశ్రు తర్పణం

ప్రతిక్షణంబున్ ప్రతీక్షతోనే
బ్రతుకంతా ఒక పీడకలవలెన్
భావించుటయే పరమావధియా
వాస్తవ జగతికి దూరముగా !

వర్తమానమను వాస్తవ మెరుగక
వగ్గించుటయే పిరికి లక్షణం !
ఉన్నదేదో నిజం అనీ
కన్నదేదో ఛాయమనీ
అందరమూ ఒకేరీతి
ఆనందం పొందాలని

సహకారం సౌజన్యం
సహన గుణం సౌదర్యం
సర్వకాల సర్వలోక
సర్వమతాదేశాలని
చాటించే శాంతిదేవి
సత్యగీతి వినిపిద్దాం

అస్తినాస్తి విచికిత్సకి
ఆస్కారం లేదందాం !

శ్రీ బులుసు వేంకటరమణయ్య

# కురవి రామకవి రచనలు - దశరూపక పద్ధతి

రసానుభూతికి శ్రవ్యకావ్యాలకంటె దృశ్యకావ్యాలే మిక్కిలి అనుకూలమైనవి. దీనిని గ్రహించే సాహిత్యతత్త్వవేత్తలు ''కావ్యేషు నాటకం రమ్యం'' అని నిర్ణయించారు. భరతుని నాట్యశాస్త్రంలో దృశ్యానికే ప్రాధాన్యం ఇవ్వబడింది. తర్వాతి సాహిత్య శాస్త్రవేత్తలైన భామహాదులు ఇతర విషయాలను గురించే ఎక్కువగా చర్చించారు. ధ్వనికారాదులు రసానికి ప్రాధాన్యమిచ్చినా కావ్యాత్మను గురించే అధికంగా వివరించారు. దృశ్యాలను గురించి ప్రత్యేకంగా గ్రంథాలు రచించినవారు భరతుని తర్వాత భావప్రకాశనాన్ని రచించిన శారదాతనయుడు, నాట్యదర్పణం వ్రాసిన రామచంద్ర గుణచంద్రులు, దశరూపకాన్ని కూర్చిన ధనంజయుడు మున్నగువారు కొద్దిమంది మాత్రమే కానవస్తున్నారు.

తెలుగువారిలో సాహిత్యవేత్తలైన విద్వాంసులు తాము వ్రాసిన లక్షణ గ్రంథాలలో దృశ్యాన్ని గురించి కూడా వివరించారు. కావ్యస్వరూపాదుల్లోనూ, ధ్వని నిరూపణలోనూ మమ్మటుని మార్గాన్ని అనుసరించిన విద్యానాథ పండితుడు తన 'ప్రతాపరుద్ర యశోభూషణం' (ప్రతాపరుద్రీయం)లో నాట్య నిరూపణకోసం ప్రత్యేక ప్రకరణాన్నే వ్రాసి, దానికి ఉదాహరణంగా 'ప్రతాపరుద్ర చరిత్ర'కు సంబంధించిన దృశ్యాన్ని ఇచ్చాడు. 'రసార్ణవ సుధాకరాన్ని' రచించిన సింగభూపాలుడు కూడా దృశ్యకావ్యాలను గురించి వివరంగా చెప్పాడు. దశరూపకానికి లఘుటీక వ్రాసిన భట్టనరసింహుడు ఆంధ్రుడని ఊహించుటకు అవకాశం ఉన్నది. ధనంజయుని దశరూపకంలోని విషయాలను సంగ్రహంగా వివరిస్తూ దశరూపక పద్ధతిని వ్రాసిన కురవి రామకవి మహావిద్వాంసుడైన ఆంధ్రుడని స్పష్టంగా తెలుస్తున్నది.

వేంకటాధ్వరి రచించిన విశ్వగుణాదర్శ చంపువునకు వ్యాఖ్యానం వ్రాస్తూ ఈ కురవి రామకవి —

'యచ్చేత శ్చంద్రమౌడే తత పరికలనాత్
భృంగ కీటాయమానం
యేనా కార్యప్ప యాధ్వర్యుదిత కువల యా
నంద టిప్పణ్యమోఘా,
యశ్చంపూ భారతీయాం వ్యతనుత వివృతిం
స్వాద్య గూఢార్థసారాం
వృత్తిత్సో ర్దాశరూపీత్యవహ దిహ ముదం
పద్ధతిర్యాయదీయా.
భ్రాతుః సాహిత్య కళాం
సాంగోపాంగా మధీత్య గోపాలాత్,
విశ్వగుణాదర్శం స
వ్యాఖ్యాతి శ్రీ కురవి రామకవిః'

అని చెప్పుకొని ఉన్నాడు. దీనినిబట్టి రామకవి గొప్ప శివభక్తుడని, తన సోదరుడైన గోపాలపండితునివద్ద సాహిత్య కళను సాంగోపాంగంగా అభ్యసించాడని, విశ్వగుణాదర్శ వ్యాఖ్యను రచించుటకు పూర్వమే అప్పయ దీక్షితులవారి కువలయానందానికీ, అనంతకవి రచించిన చంపూభారతానికీ వ్యాఖ్యలను రచించాడనీ తెలుస్తున్నది. సంస్కృతంలోనే కాకుండా తెలుగులోకూడా ఇతడు రచన సాగించాడు. సుబంధుని వాసవదత్తను రామకవి ఆంధ్రీకరించినట్లు తెలుస్తున్నది.

కువలయానందానికి ఇతడు రచించిన వ్యాఖ్య మకరంధురి. అందులో, అంతకు పూర్వము ఉండిన వైద్యనాథ తత్సత్పండితుని 'చంద్రికావ్యాఖ్య' విమర్శించబడుతూ ఉండినది.

రామకవి వ్రాసిన చంపూ భారతవ్యాఖ్య లాస్య. దీనిని బొంబాయిలోని నిర్ణయసాగర ముద్రణాలయంవారు మూలంతో కూడా చాలాసార్లు ప్రకటించారు. కాని వ్యాఖ్యాతపేరు 'రామచంద్ర బుధేంద్రు'డని ప్రకటింపబడుతూ ఉన్నది. రచయిత రామబుధేంద్రుడు—రామకవి పండితుడుగాని రామచంద్ర పండితుడుకాడు. చంపూ రామాయణ వ్యాఖ్యాత రామచంద్ర బుధేంద్రుడు కాబట్టి దీని వ్యాఖ్యాత కూడా అతడే అయి ఉంటాడని భావించి ఈవిధంగా వారు ప్రకటించి ఉండవచ్చును.

పూర్వం తెలుగు దేశంలోని సంస్థానాల ప్రభువులు తమ ఆస్థానాలలో విద్వత్కవులను ఏర్పరచి, వారిని పోషిస్తూ, వారి వలన ఉత్తమ గ్రంథాలను నిర్మింపజేస్తూ ఉండేవారు. ఈ కురవి రామకవి చిత్తూరు జిల్లాలోని కార్వేటి నగర ప్రభువుల దగ్గర ఆస్థాన పండితుడుగా ఉండేవాడని పరిశోధకులు నిర్ణయించారు.

ఈ దశరూపక పద్ధతిని సంపాదించి, సంస్కరించి, ప్రకటింపించిన ప్రొఫెసర్ టి.వేంకటాచార్య (కనడాలోని టొరంటో విశ్వవిద్యాలయంలో—సంస్కృత విభాగంలోని ప్రొఫెసర్) ఆంగ్లంలో రచించిన పీఠికనుబట్టి పయి విషయాలు తెలుస్తున్నవి.

దశరూపక పద్ధతి ధనంజయుని దశరూపకానికి వ్యాఖ్యానం కాదు. కేవలం దానిని మాత్రం ఆధారం చేసుకుని వ్రాసినదిన్నీకాదు. రామకవి భరతుని నాట్యశాస్త్రాన్నీ, ఇతరుల దృశ్యలక్షణ గ్రంథాలనూ క్షుణ్ణంగా పరిశీలించి, వాటిలోని సారాన్ని గ్రహించి దీనిని రచించినట్లు తెలుస్తున్నది.

రామకవి గ్రంథారంభంలోనే—

'అనవధి కరుణా వారిధి
మానమ్యాత్మని సదాశివం దేవమ్,
వృత్తిత్సుముదే కథయతి
దశరూపక వర్త్మ కురవి రామకవిః.
యద్యపి పూర్వైః కథితం
చైతత్ దశరూపకాదిషు తథాపి,
వృత్తిత్సూనా మస్మిన్
సుగమాయ పరం మమారంభః'

అని యీ విషయాన్ని వివరించాడు. ఇతర గ్రంథాలు జిజ్ఞాసువులకు సులభంగా అర్థంకావు. అందరికీ సులభంగా అర్థమయేటట్లు విషయాలను వివరించుటకే అతడీ గ్రంథరచనకు పూనుకున్నట్లు స్పష్టంగా తెలుస్తున్నది.

గ్రంథం చివర ఈతడు—

'దశోత్తర శతశ్లోకై ర్దశరూపక పద్ధతిః,
దర్శితా సాధు కురవి కులక్షీరాంబుధీందునా,
రామసంఖ్యావతా; కృత్యా ప్రీయతాం శంకరోऽనయా'

అని తాను నూటపది శ్లోకాలలో దశరూపకాల లక్షణాలను గురించి చెప్పినట్లు వ్రాసుకున్నాడు. రామసంఖ్యావంతుడంటే రామపండితుడని అర్థం. సూత్రప్రాయంగా ఉన్న యీ చిన్న గ్రంథం కంఠస్థం చేసి, విషయాలను గుర్తుపెట్టుకొనుటకు ఎంతో అనుకూలంగా ఉంటుంది.

ఇందులో రూపకం అంటే ఏమిటో, ఇతివృత్తం అంటే కథాంశం ఎలా ఉండాలో, రసాలు ఎన్నో, ప్రసిద్ధంగాఉన్న పది రూపకాలు ఏవో తెలుపబడినవి. తర్వాత కైశికి మున్నగునవి వృత్తులని, వాటిని గురించి ఇతరత్ర చూసుకోవాలని చెప్పబడింది. 'తాసామన్యత్ర విస్తరః' అని. అవి రచనకు సంబంధించినవి కాబట్టి ఈ సంగ్రహ గ్రంథంలో వాటిని గురించి వివరించలేదని రచయిత అభిప్రాయం. నాందీ శ్లోకంలో కావ్యార్థ సూచన—అంటే నాటకంలోని కథాంశ సూచన ఉండాలని, నాంద్యంతమునందు సూత్రధార ప్రవేశం, ఋతు వర్ణన ఉండవలెనని చెప్పబడింది. సూత్రధార, నట—రంగముల లక్షణాలూ, ఉత్తమాది నాయక స్వరూపం, ఆముఖాదుల లక్షణం తెలుపబడింది. వేటిని రంగస్థలంపై ప్రదర్శించాలో, వేటిని ప్రదర్శించకుండా కేవలం సూచించాలో జనాంతికం, అపవారితం, ఆకాశభాషితం ఎట్టివో సంగ్రహంగా చెప్పబడింది. సంధుల లక్షణాలు, సంధ్యంగ వివరణ, బీజాదుల లక్షణం ఇయ్యబడింది. ఈవిధంగా అల్పసంఖ్యగల శ్లోకాలలో అధికమైన దృశ్యవిషయం సమగ్రంగా చూపబడింది.

రామకవి చాలావరకు నాట్యశాస్త్రాన్నీ, దశరూపకాన్నీ అనుసరించాడు. భరతుడు ''అష్టౌ నాట్యే రసాః స్మృతాః' అని నాట్యంలో శృంగారాదులయిన ఎనిమిది రసాలనే గ్రహించాడు. శాంతాన్ని చెప్పలేదు. ఇందులోకూడా ఆ విధంగానే శృంగార—వీర—కరుణ—రౌద్ర—హాస్య — భయానక—బీభత్స — అద్భుత రసములు ఎనిమిదిమాత్రం అంగీకరించబడినవి. ధ్వనికారాదులు శాంతరసాన్ని సమర్థించారు. ఇందులో అది విడువబడినది.

రామకవి అక్కడక్కడ దశరూపక శ్లోకాలనూ, శ్లోక భాగాలనూ ఉన్నవి ఉన్నట్లుగానే స్వీకరించాడు. దశరూపకంలో లేని పటాక్షేప ప్రవేశం, ధ్రువ మున్నగు వాటిని చేర్చాడు.

ఇంతవరకూ అజ్ఞాతావస్థలో ఉన్న ఈ గ్రంథాన్ని వెలికి తీసిన ప్రొఫెసర్ వేంకటాచార్యగారి కృషి ప్రశంసనీయం.

తెలుగు కవులలో 'సింహాసన ద్వాత్రింశిక' అనే పద్య ప్రబంధాన్ని రచించిన కొరవి గోపరాజు ప్రసిద్ధుడు. కురవి రామకవి తన సోదరుడు గోపాలుడని చెప్పుకొని ఉన్నాడు. కురవి—కొరవులకు అట్టే వ్యత్యాసం లేదనీ, జనం వాడుకనుబట్టి ఒకేపదం వేర్వేరు పదాలై ఉందునని, గోపరాజే గోపాల పండితుడై ఉండవచ్చుననీ కొందరు భ్రాంతిపడుటకు అవకాశం ఉన్నది. కాని రామకవికి గోపరాజు సోదరుడు కాడని చెప్పవలసి ఉన్నది. గోపరాజు శ్రీకృష్ణదేవరాయల కాలంనాటి వ్యక్తి. అతని నివాసం తెలంగాణా ప్రాంతం.

రామకవి తన 'కువలయానంద వ్యాఖ్య'లో పూర్వవ్యాఖ్యాత అయిన వైద్యనాథ పండితుణ్ణి విమర్శిస్తూవచ్చాడు. ఆ పండితుడు క్రీ. శ. 1683 నాటివాడు. అందువల్ల రామకవి అతనికంటె నవీనుడు కాకతప్పదు. గోపరాజుకూ, రామకవికీ కాలాన్నిబట్టి చాలా వ్యత్యాసం ఉన్నది. సమకాలికులు కాని వీరిద్దరికీ సోదరభావం కుదరదు. ఇంటిపేర్లు, పేర్లుకూడా విభిన్నంగానే ఉన్నవి.

సంస్కృతంలో గొప్ప విద్వాంసులైన ఆంధ్రులలో కురవి రామకవి స్థానం అత్యున్నతమైనది.

# మహాత్మా! మళ్లీ ప్రభవించవా?

## శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

ఎక్కడో ఒక మూలను
  కుక్కిన పేనులా
నక్కి యుండవలసిన స్వార్థం
నడివీధిని నడయాడుతూ
చింతనిప్పులు కక్కుతున్నది.

దేశ సౌభాగ్యం కోసం
దివారాత్రాలు విస్మరించి
పనిచేసే ఫాక్టరీ
ఏదో ఒక కారణంగా
మూగనోము పట్టింది.

మండుతున్న ధరల బజారునుంచి
నిండీ నిండని సంచీతో, సరుకులు
నిండుకున్న యింటికి వచ్చిన
ఎండిపోయిన భర్తను చూచి
కుండెడు నీళ్లు కార్చింది భార్య.

చదువు సందెలు ప్రతిధ్వనిస్తూ
విద్యార్థుల రాకపోకలతో
కలకలలాడుతూ కనిపించే
పవిత్ర విద్యాలయంలో
ప్రభుత సాగిస్తోంది సాలీడు.

ఉద్యోగం లేని కొడుకూ
ఉద్వాహం కాని కూతురూ
కళ్లముందు గోళ్లు గిల్లుకుంటుంటే
చూడలేని తలిదండ్రుల
ఎడదలు ఎడారులైనవి.

దేశాన్ని తీర్చి దిద్దవలసిన
ప్రజాప్రతినిధులూ ప్రముఖులూ
ఆవేశాలకూ ఆశలకూలోనై
ప్రజను మరిచి ప్రవర్తిస్తుంటే
వెర్రి కాపుని, నేనేం చేయగలను ?

సమస్య లేమో శార్దూలములై
శాంతి సౌఖ్యాలను కబళింపజూస్తుంటే
దేశ ప్రగతి వెనుకబడుతుంటే
ఉన్న కాస్త శక్తినీ వినియోగిస్తున్నాను
సమ్మెలకూ, సత్యాగ్రహదీక్షలకూ.

ఓ మహాత్మా !
సత్యాహింసల ప్రతిరూపమా !
మా దేశంలో మళ్లీ ప్రభవించవా ?
మా జబ్బులు నీవు తొలగించవా ?

డా. పురిపండా అప్పలస్వామి

# వందేమాతరం

ఎనభయ్యొక్క సంవత్సరాల కిందటి మాట. 1876 డిసెంబరు 28 తేదీని కలకత్తాలో జరిగిన 'పదకుండో జాతీయ మహాసభ'లో రవీంద్రుడు తన తేనెగొంతుకతో 'వందేమాతరం' పాడి వినిపించాడు. దేశం నాలుగు మూలలనించీ వచ్చిన ప్రతినిధులతో సభ సభంతా ఒక్కమారు పులకించిపోయింది. మహాసభ అధ్యక్షుడు ఫిరోజషా మెహతా. ఆయనకి సంస్కృతంగాని, బెంగాలీకాని రాదు. అయినా 'గీతం' విని పరవశుడయాడు. సురేంద్రనాథ బెనర్జీని అడిగి, అర్థం తెలుసుకుని ఆనందించాడు.

జాతీయ మహాసభలో 'వందేమాతరం' ప్రతిధ్వనించడం అదే మొదటిసారి.

1905లో కర్జన్ దొర సలహామీద బ్రిటిష్ పార్లమెంటు బెంగాలు చీలదీయడానికి సిద్ధపడింది. ప్రజలు తిరుగుబాటు చేశారు. దేశమంతటా 'విప్లవం' చెలరేగింది. విప్లవ సారథులు—అరవింద ఘోషు, బిపిన చంద్రపాల్, రవీంద్రనాథ్ ఠాకూర్, శ్యామసుందర చక్రవర్తి మొదలైనవారు.

అప్పటికి అరవిందుడు యోగి కాలేదు ఆయనా, ఆయన తమ్ముడు బారీంద్రఘోషూ విప్లవకారులు. వారు నడిపిన ఉద్యమం 'వందేమాతర ఉద్యమం'. అదే బెంగాల్ విభజన ఉద్యమం. ఉద్యమం కోసం 'వందేమాతరంసమితి' స్థాపించారు. సమితి పక్షాన 1906 ఆగస్టు 6న 'వందేమాతరం' ఇంగ్లీషు దినపత్రిక ప్రారంభించారు. అరవిందఘోషూ, బిపిన చంద్రపాలూ, శ్యామసుందర చక్రవర్తీ సంపాదకులు, అందులో బ్రిటిష్ వారిమీద నిప్పులు చెరిగినందుకు అరవిందుణ్ణి అరెస్టు చేశారు. దేశంలో 'వందేమాతరం' నిప్పుల తుఫాను రేగింది. అదిగో అప్పుడే రవీంద్రుడు 'అరవిందుడికి నమస్కారం' కవిత రాశాడు.

అదే సంవత్సరం వారణాసిలో కాంగ్రెస్ మహాసభ జరిగింది. సిస్టర్ నివేదిత కోరికమీద, మహాసభ 'వందేమాతరం'తో ఆరంభం కావాలని అధ్యక్షుడు గోపాలకృష్ణ గోఖలే ఆదేశించాడు. సరళాదేవి చౌదరాణి తన కోకిల కంఠంతో 'వందేమాతరం' పాడింది. సభ ఉత్తేజంతో వుర్రూతలూగింది. "మహాసభా ఉన్మాదిని మమవాణి" అంది చౌదరాణి.

అది మొదలు కాంగ్రెస్ మహాసభల ప్రారంభం 'వందేమాతరం'తో జరగడం ఆనవాయితీ అయింది.

'వందేమాతర' గేయం గాంధీమహాత్ముణ్ణీ ఆకర్షించింది. అది స్వతంత్ర భారతదేశానికి 'జాతీయ గీతం' కావాలని రవీంద్రుడికి రాశాడాయన.

1907 ఆగస్టు 18 తేదీని జర్మనీ స్టుట్‌గార్ట్ నగరంలో అంతర్జాతీయ సమాజవాద మహాసభ జరిగింది. దేశదేశాల ప్రతినిధులు తమ తమ జాతీయ పతాకాలతో హాజరయారు ఇండియా నించి శ్రీమతి బికవ్‌జీ కామా, సర్దార్ సింహరాణా వెళ్ళారు. శ్రీమతి కామా తన ఉపన్యాసానికి ముందు 'వందేమాతరం' పాడింది. ఉపన్యాసం చివర 'వందేమాతరం' నినాదంతో మన జాతీయపతాకం ఎగరవేసింది.

అప్పటి మన జెండా మూడు రంగులే అయినా ఇప్పటిలా వుండేది కాదు. మీద ఆకుపచ్చా, నడుమ పసుప్పచ్చా, కింద దట్టమైన ఎరుపూ వుండేవి. నడుమ పసుపుమీద 'వందేమాతరమ్' అని నాగరి అక్షరాలు వుండేవి. మీది పచ్చరంగుమీద ఏడుచుక్కలూ, కింది ఎరుపుమీద సూర్యచంద్రులూ వుండేవి.

ఇండియాలోనూ, ఇంగ్లాండులోనూ 'వందేమాతరం' అంటే తెల్లవాళ్ళకి తేళ్ళూ, జెర్రులూ పాకేవి. అప్పటి లండన్ టైమ్సు పత్రిక 'వందేమాతరం' గేయాన్ని కసిదీరా తిట్టిపోసింది. దాంతో అక్కడి ఇండియా మిత్రులు కొందరు ఎదిరించారు. డా. గ్రియర్సన్ దొర లండన్‌లో ఒక సభలో కంఠమెత్తి 'వందేమాతరం' గానం చేశాడు.

మొదటి ప్రపంచ యుద్ధం తరవాత ఇండియాలో సాయుధ విప్లవం కోసం ప్రబలమైన ప్రయత్నాలు జరిగాయి. ఎంతోమంది వురికంబాలెక్కారు. తుపాకి గుళ్ళకి గురయారు. అండమానుల పాలయ్యారు. యావజ్జీవం ఖైదులో మగ్గారు. కాని విప్లవం చల్లారలేదు. పాలకులు రౌలట్ కమిటీ వేశారు. ఆ కమిటీ రిపోర్టులో ఇండియన్‌ల విప్లవానికి మూలం 'వందేమాతరం' అని రాశారు.

దీనినిబట్టి 'వందేమాతరం' ఎంత శక్తివంతమైన మహామంత్రమో ఊహించవచ్చు.

'వందేమాతరం' రాసిన ప్రసిద్ధ రచయిత, బంకిమ చంద్ర చట్టోపాధ్యాయ (1838–1904).

ఎంతోమంది అనుకుంటున్నట్టు బంకిమబాబు తన 'ఆనందమఠ' నవలకోసం రాసిన గీతంకాదిది. 'ఆనందమఠ' కంటే కొన్నేళ్ళు ముందే బంకిమబాబు రాశాడిది.

ఆనందమఠ 1880లో రాశాడాయన. అప్పటినించి అది 'వంగదర్శన' పత్రికలో వరసగా రెండేళ్ళు అచ్చవుతూ వచ్చింది. పుస్తకంగా దాని తొలి ముద్రణ 1882లో జరిగింది.

'వందేమాతరం'ఆనందమఠ రాయడానికి నాలుగేళ్లముందు—అంటే 1876 లోనే ఇప్పటికి వందేళ్ళక్రితం వంగదర్శనలో వెలువడింది. తరవాత దానిని ఆనందమఠలో చేర్చుకున్నాడు రచయిత.

1870 లోనూ, తరవాతనూ బెంగాలులో సన్యాసుల విప్లవం జరిగింది. బ్రిటిష్ వారిని మూడు చెరువుల నీళ్లు తాగించిన పెద్ద విప్లవమది. శివాజీ మహారాష్ట్ర సేన ద్ధంలో 'హరోహర' అని కేకవేసినట్టే సన్యాసులు విప్లవంలో 'ఓం వందేమాతరం' అని కేక వేసేవారు. అప్పుడు ఢాకాలో వుండిన వొక మహారాష్ట్ర సన్యాసి ఈ కేకకి ప్రవక్త

బంకిమచంద్ర 'వందేమాతర' గేయానికి ఆనాటి సన్యాసుల తిరుగుబాటు కేక ఆధారం.

'వందేమాతరం' వెనక ఇంత విప్లవగాథ వుంది కనకనే అది వింటే తెల్లవాళ్ళ గుండెలు ఝల్లుమనేవి. దానికి నిదర్శనంగా ఇక్కడ 'వందేమాతరం'తో ఆనందమఠ నవల రాగానే అక్కడ ఇంగ్లాండులో లండన్ లిబరల్ పత్రిక దానిని విమర్శించింది.

తన గీతం పదికాలాలపాటు బెంగాలులో నిలబడుతుందన్న నమ్మకం తనకుండినా ఇంతటి ప్రసిద్ధి సంతరించుకుంటుందని కలలుకనుండడు బంకిమచంద్రచట్టోపాధ్యాయ. స్వతంత్ర భారతానికి జాతీయ గీతమవుతుందని అసలే అనుకొనివుండడు. నిజానికి అతడు ధన్యుడు.

అయితే అతడు

''సుజలాం సుఫలాం

మలయజ శీతలాం

సస్య శ్యామలాం...''

అని గానంచేసినప్పుడు వంగదేశాన్నే ఊహించాడు. అందుకని భారతదేశ మంతటికీ వర్తించినట్లు గీతంలో 1938 హరిపుర కాంగ్రెస్‌లో సవరించారు. 'సప్తకోటి' అన్నచోట 'త్రింశత్కోటి' అనీ, 'ద్విసప్త కోటి' అన్న దగ్గిర 'ద్విత్రింశత్కోటి' అనీ మార్చారు. స్వాతంత్ర్యం వచ్చాక మీది రెండుచోట్లా ''కోటి కోటి'' అని మార్చారు.

---

# ఉల్కల ప్రవాహాలు

## శ్రీ రామా చంద్రమౌళి

భూమి గిరగిరా తిరుగుతున్నా నీకు తెలియనట్టే

నీలో ఉల్కల ప్రవాహాలు గర్జిస్తున్నాయని నీకు తెలియదు

వానలో తడుస్తున్న దీపస్తంభాన్ని చూస్తున్నప్పుడల్లా

నువ్వే నాలో కదులుతావు సరస్సులో అలలా—

హృదయంలో ప్రళయాలను యింకెంతకాలం దాచుకుంటావు

విముక్తం చేయి నీ పిడికిల్లోనుంచి నూతన ఋతుచక్రాన్ని

గతాన్ని మోస్తూ చాచి ఉంచిన నీ అరచేయిని విదిలించు

నీ నరాలు జూలు దులుపుకున్న సింహాలై ఆవులిస్తాయి

అమూర్తతనుంచి మొలకెత్తుతున్న పురిటి భావాలను

అగ్నిధారలతో పెంచి సూర్యున్ని నీ సాదుజంతువుగా చేసుకో

కాంతి నీవెంట బొచ్చుకుక్కలా వస్తుంది ప్రవాహమై—

'ఫిలమెంట్' రాలిపోయిన బల్బులు...,

ఎండిపోయిన ఆకులు...,

వీటిని తుఫానులతో తరిమేయక తప్పదు మరోతరం కోసం—

షహనాయి వింటూ ఒట్టి స్వర్గబింబాన్ని నెమరువేసే

మత్తులోనుంచి

పొగగొట్టాలతో రాగాలాపన చేయించడానికి బయలుదేరు

యంత్రాల మందల్లోకి

యీ నేల నీకోసం ఎదురుచూస్తోంది

పక్షి కూనవలె—

వసంతాలను అనుభవించడం కాదు

వసంతాలను సృష్టించడం నేర్చుకో.

# "తేఱు నడపుము!!"

## శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

గీ. నవ వసంతము లోచనోత్సవము సేయు
వేళ చల్లగ వచ్చిన విమల నూత్న
వర్షమా ! నీకు హార్దిక స్వాగతమ్ము
తెలుపుచుంటిని ! కాళయుక్తినమోస్తు !!

గీ. పెనుతుఫానులు—దారుణ భీషణోగ్ర
కర్మములు—ముష్కరాళి విఘాతములును—
నీత్యుపద్రవములు—భూమినెగయకుండ
తేఱునడపుము ! కాళయుక్తినమోస్తు !

గీ. రక్తపాతమ్ము—ద్వేషమ్ము—ప్రాంతభేద
ములును — మౌఢ్యమ్ము—నసమానబుద్ధి—కుజన
నాయకత్వమ్ము - దౌష్ట్యమ్ము—పాయునటుల
తేఱునడపుము—కాళయుక్తినమోస్తు !!

గీ. మొన్న ''పింగళ'' సర్వసంపన్నమైన
దివ్యతీరాంధ్ర భూముల తేల్చెనీట
ఆ నిరాశల మఱపింపు మమృతగతిని
తేఱునడపుము ! కాళయుక్తినమోస్తు !!

గీ. తెలుగుదేశమ్ము పంటలవెలయునటుల
తెలుగు పలుకుల కలకండ మొలుకునటుల
తెలుగు జాతి ప్రదీప్తమై కులుకునటుల
తేఱునడపుము ! కాళయుక్తినమోస్తు !!

గీ. సరస సంగీత సాహిత్య ఝరులు పొంగ—
శాంతియును—దేశభక్తియు జనుల హృదయ
నిష్ఠమై చెంగలించెడు నియతిపూని
తేఱునడపుము ! కాళయుక్తినమోస్తు !!

గీ. ఒక్కక్షణమైన విశ్రాంతి నొందకుండ
మట్టి—బంగారు ముద్దగా మార్చు యోగి
కర్షకుడు—వాని సౌఖ్యమ్ము గాంచి పిదప
తేఱునడపుము ! కాళయుక్తి ! నమోస్తు !!

గీ. పట్టినదియెల్ల బంగారు ఫలము కాగ !
ముట్టినది యెల్ల ముత్యాల మూట కాగ !
పెట్టినదియెల్ల రతనాల పేరు కాగ !
తేఱునడపుము ! కాళయుక్తినమోస్తు !!



శ్రీ కొడవంటి లీలామోహనరావు

# నేటి కవితకు ప్రేరణ

ఆధునిక సాహిత్యానికి ప్రేరణశక్తులు మార్క్స్, ఫ్రాయిడ్. కవిదృష్టి సమాజంయొక్క వాస్తవస్థితిపై మరలడానికి కారణం మార్క్స్. రామణీయకతను ప్రక్కకునెట్టి కవితకు కొత్త నిర్వచనం ఇచ్చుకున్నాడు నేటి కవి. కవిత సమాజానికి ప్రతిబింబం అయినట్లయితే, అదే కవిత అంతరదృష్టిని నెరపింది. కవిత మానవుని అనాగరికతను వేలెత్తి చూపితే, అదే కవిత అతని అహంపై దెబ్బకొట్టింది.

ఫ్రాయిడ్ ప్రభావంచేత ఆధునిక కవిత నైతిక విలువలపై తిరుగుబాటు చేసింది. మార్క్స్ ప్రభావంచేత అదే కవిత సాంఘిక విలువలపై తిరగబడింది. మార్పు జీవనాడిగా, విశ్వకళ్యాణం ధ్యేయంగా, జీవిత కాననంలో నిరంతర అన్వేషణ మార్గదర్శిగా ఆధునిక కవిత కొత్తపుంతలు తొక్కింది.

మార్క్స్, ఫ్రాయిడ్ శక్తుల ప్రభావాన్ని అంచనా కట్టే ముందు మనం ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. సమాజం నిత్యం విపరీత ప్రభావాలకు లోనవుతూనే ఉంది. అది సజీవ అగ్నిపర్వతం. కుత కుత ఉడుకుతూనే ఉంది. మార్పుని వ్యతిరేకిస్తూనే మార్పు చెందుతోంది. భూమి విశ్వానికి కేంద్రం కాదనీ, సూర్యుని చుట్టూ తిరిగే గ్రహాలలో ఒకటనీ చెప్పి కోపెర్నికస్ మనిషి అల్పత్వాన్ని వేలెత్తి చూపాడు. మనిషి పూర్వీకుడు వానరమని చెప్పి మనిషి అహంపై గొడ్డలిపెట్టు పెట్టాడు డార్విన్. మంచి, చెడ్డలు వేర్వేరుగా లేవనీ, ఒకేమనిషి మానవుడూ, దానవుడూ కూడానని నైతిక విలువలపై తిరగబడ్డాడు ఫ్రాయిడ్. ఈ భావాలకు ఆధునిక మానవుడు విపరీతంగా షాక్ అయ్యాడు. ఈవిధంగా సమాజం నిత్యం వత్తిడికి లోనవుతోంది. ఇటువంటి సమాజంలో ఉంటూ,సామాజిక స్పృహలేకుండా నేటికవి ఎట్లా మనగలడు? నేటి కవి మొదట ఆధునిక మానవుడు, తర్వాత కవి. సామాజికస్పృహ అతని ఊపిరి.

సుఖం అరవిందంగా కాక 'ఆరిన కుంపటి విధాన' నేటి కవి చూస్తున్నాడు. దీనికి కారణం అతడు నేటి కాలానికి ప్రతినిధి. కవి 'స్రష్ట' అంటే నేటి కవి ఎద్దేవా చేస్తాడు. ఎంచేతంటే కవి సృష్టించడు. అద్దం పడతాడు. కవి స్రష్ట అంటే — కవివేరూ, ప్రజలు వేరూనా? ఎంతటి అహం? ప్రజలంటే ఎంతటి చిన్న చూపు? నేటి కవి దీనికి తావు ఇవ్వడు. ''కవి ఋషి; కళ కళ కోసమే'' వంటివి పాత చింతకాయ పచ్చడులైనాయి. ఏ కారణంచేత కవి స్రష్టకాడో, ఆ కారణంచేతే అతడిది ''క్రియేటివ్ వర్క్'' కాదు.

కవి జీవితాన్ని ''ఇమిటేట్''చేస్తాడు. ఆ విధంగా సంఘంలోని కుళ్ళును, అసహజత్వాన్ని, అల్పత్వాన్ని బహిర్గతం చేసి పరిహసిస్తాడు. అంతేగాని జీవితాన్ని సృష్టించడు. ఆ విధంగా కవి సంస్కర్త కాని సృష్టికర్త కాదు. సమాజ సంస్కారం చేపట్టిన అనేక మందిలో నేటి కవి ఒకడు.

తూగుటుయ్యాల సవ్వళింపులకు నేటి కవి పరవశించడు. కలకంఠి కలహంస గమనానికి పులకించడు. ప్రేయసి పేరలు కలు, ప్రభువుల వైభోగాలు వానిని ఆకర్షించవు. బడుగు బతుకుల మురికివాడలు నేటి కవితకు విహార స్థలాలు. నేటి కవి దృష్టి చీకటి గుయ్యారాల్లో సగం కప్పిన కుళ్ళు శరీరాల్ని స్పృశిస్తుంది. దగా దౌర్జన్యాల కలవాటుపడ్డ బానిస మనసుల్ని పరామర్శిస్తుంది. చీడపురుగుల గుండెల్ని కెలికి దడ పుట్టిస్తుంది.

ఈ సమాజం నేటి కవితా వస్తువుకు ఒక గని వంటిది. ఈ సమాజంలో ఎంతో కుళ్ళు ఉన్నది. ఎంతో క్రౌర్యం ఉన్నది. ఎంతో దోపిడీ ఉన్నది. ఎందరో దగాపడిన తమ్ముళ్ళున్నారు. ఇవన్నీ నేటి కవిని ఆకర్షించాయి. కర్తవ్యాన్ని బోధించాయి. సామాజిక ప్రయోజనం నేటి కవితకు లక్ష్యం అయింది.

మార్క్స్ ప్రతిపాదించిన ఆర్థిక సమానత్వ సిద్ధాంతం ఆధునిక మానవుడ్ని ఎంతగానో ప్రభావితం చేసింది. గత వ్యవస్థ, సాంప్రదాయం కూలి పోతున్నట్లుగానూ, దాని స్థానే నవసమాజం ఆవిష్కరింపబడుతున్నట్లుగానూ భావించాడు. అందుకనే పురిపండా అప్పలస్వామి —

'తొలినాటి సంద్రాలు
తుహిన గిరి శిఖరాలు
ఇంకిపోతున్నాయిలే
క్రుంగిపోతున్నాయిలే'

అనీ, శ్రీ శ్రీ

'ఏ తల్లీ నిదుడు కురిసిన
హిమ సమూహములు'

అని గానం చేసారు.

నేటి కవి ఏ ప్రతీక వాడినా, ఏమి దృశ్యీకరించినా అది ప్రగతిశీల పరంగా సాగింది. అందుకనే ఆధునిక కవులను వాస్తవిక కవులనవచ్చు. జీవితాని కతీతంగా భావకవులు కవితాగానంచేస్తే, దానికి జవాబుగా ఆధునిక కవి కలం పట్టాడు. ఆకాశంలో మెరిసే నక్షత్రాలను క్రిష్ణశాస్త్రిగారు ఒకరకంగానూ, శ్రీరంగం నారాయణ బాబుగారు ఒక రకంగానూ దర్శించారు :

''నింగి మూలల
నీలి పందిళ్ళు వైచి
వింత చిరుమల్లెతోట
వేయించినాను''

అని క్రిష్ణశాస్త్రిగారు అంటే, నారాయణబాబుగారు —

''నల్లని త్రాచు కోరలు
తెల్లని మశూచి కుండలు
గగనమ్మున చుక్కలు''

అన్నారు. ఈ భావనని సమర్థిస్తూ ఆచార్య రోణంకి అప్పలస్వామి గారు ''జీవితంలో కాఠిన్యమును బయటపెడుతున్నప్పుడు, భీభత్స తను స్ఫురించే పై గీతాలవంటిని రచియింపక తప్పదు'' అని రాసారు. ఏనాడూ 'కవి గాంచని' సమాజంలోని భయంకర నగ్న సత్యాలు, మార్క్సిజం అవగాహన చేసుకున్న నేటి కవి దర్శించ గల్గుతున్నాడు. వీటివల్ల ఉద్రిక్తుడవుతున్నాడు. వాటిని సరిదిద్దే తపనతో ప్రజలకు దగ్గరవుతున్నాడు.

'సైకో ఎనాలిసిస్' ద్వారా ఫ్రాయిడ్ ప్రచారం చేసిన భావాలు మానవుని ఆలోచనా విధానాన్ని పూర్తిగా మార్చివేసాయి. మనిషి నిజంగా స్వతంత్రుడు కాడని, అతడు సుప్త చైతన్యానికి బానిస అని అన్నాడు. జాగ్రదవస్థకు వర్తించే కట్టుబాట్లేవీ, సుప్త చైతన్యానికి వర్తించవు. జాగ్రదవస్థలో మనిషి నమ్మిన పాపం—పుణ్యం, మంచీ—చెడూ సుప్త చైతన్యం అంగీకరించదు. మనిషిని నిజంగా నడిపించేది సుప్తచైతన్యమే. మనిషి అనేక కారణాలచేత తన ఆలోచనలను, కోరికలను అణగద్రొక్కి వేస్తాడు. కాని అవి అంతటితో మాయంకావు. సుప్తభుజంగాల లాగా అతని మనసులో చోటు చేసుకుంటాయి. ఏ చిన్న అవకాశం వచ్చినా అవి ద్విగుణీకృతమైన శక్తితో అతనిపై ప్రభావం చూపిస్తాయి. ఈ భావాలు నేటి కవిని ప్రభావితం చేసాయి. అతడు అంతర్ముఖుడైనాడు. మనస్సుయొక్క అంతరాంతర సీమల్లోకి చొచ్చుకుపోయాడు.

నేటి కవి సర్రియలిస్టు అయినా, సింబలిస్టు అయినా ఫ్రాయిడ్ ప్రభావంచేతనే. ''అర్థాన్ని అధ్వాన్నపు అడివిలో వదలి'' వేయాలన్నాడు సర్రియలిస్టుగా శ్రీ శ్రీ. ''అధివాస్తవిక రచన అంటే మనస్సంచారంలోని అసం లక్ష్యక్రమాన్ని పైకి తేవడం'' అని నిర్వచించాడు శ్రీ శ్రీ. దాని కనుగుణంగా—

హాంగ్‌కాంగ్‌లో
కింగ్‌కాంగ్‌తో
ఒరాంగ్ టాంగ్ ఆడిన
పింగ్ పాంగ్ లాగు

అని గానం చేసాడు. సర్రియలిజం ప్రయోజనం మాట ఎటున్నా, ఒక మేలు మాత్రం జరిగింది. ఛాయామాత్రంగా మిగిలిఉన్న బానిసత్వపు బంధాలు ఫట్ ఫట్‌మని త్రుంచివేయబడ్డాయి. అయితే సాహిత్య ప్రయోజనం తప్పకుండా కావలసిందే. 'కళ కళకోసమే' అనేది మనం అంగీకరించం. సాంప్రదాయ విషవలయంనుండి బయటపడి సర్వస్వతంత్రుడైన వ్యక్తిగా రూపొందే సంధికాలంలోని ఉన్మాద స్థితే సర్రియలిజం.

టెక్నిక్‌ద్వారా ప్రయోజనం సాదిద్దామనే ప్రయత్నమే సింబలిజం. సుప్తచైతన్యం మనసుమీద తెచ్చే వత్తిడివల్ల ఒక్కొక్క వస్తువు మనలో ఒక్కొక్కభావం ప్రేరేపిస్తుంది. ఈ ఆలోచనే ప్రతీకవాదానికి ఆలంబన. ఉపాధ్యాయుడు వివరిస్తాడు. కవి సూచిస్తాడు. ఈ పద్ధతివలన కవి ఆవేదనలో పాఠకునికి భాగముంటుంది. నేటి కవి ఈ 'టెక్నిక్'లో చాలా అద్భుతమైన ఫలితాలు సాధించాడు.

నేటి కవి కూడా సమాజంలోని ఒక మనిషే. సమాజం శరవేగంతో మార్పు చెందుతోంది. దానిని ప్రతిబింబించే కవి, దానితో మార్పు చెందకతప్పదు. తన గొంతుకను వినిపింపజేయని కవిని జనత సహించదు, క్షమించదు. మన గాయాలను ఫోటో తీస్తున్నంతకాలం, మన ఆలోచనలకు రూపకల్పన చేస్తున్నంత కాలం నేటి కవికి మరణంలేదు.

# తాబేలు

## నిఖిల్

కడుపులోకి కాళ్ళు ఇముడ్చుకొని
ఏమీ చేయలేని తనంలో
బతకడమే ఆశయంగా మిగిలింది తాబేలు.

తనలోని తననే
వెతుక్కునే ప్రయత్నంలో
ఎక్కడో తప్పిపోయిన తననే
కలుసుకోవాలనే తపనలో
ఎన్నో మజిలీల ఎగుడు దిగుడులలో
ఎన్నో నిరాశల నిప్పుల నడక.

ఆగిపోయిన జీవితసమరం,
వోడిపోతున్నట్టు
చుట్టు చుట్టుకున్న కాళ్ళు చేతులు.

కాలం దాడి నెదుర్కొంటూ
శరీరాన్నంతా ఆవరించిన డాలు.

ఎంతకాలం కదలకుండా ?
జడత్వమే చచ్చిపోడమైతే
ఆ చావు తర్వాత ఒంటరితనాలు—
ఆరాటాలు—అంతులేని అంచులు.

జీవించే—మరణించే అంచులమధ్య
కాళ్ళు జాడించి
నిర్భయంగా నడవడం
పోరాటాల్లో రాటుదేలడం
నీళ్ళలేనిచోట తాబేలులా జీవించడ
తిరిగి తిరిగి తనలోనుంచి
సమాజ సాగరంలో
కాళ్ళు ఆడించడం.



# ఆంధ్రప్రదేశ్ ఎక్కడుంది ?

ఎక్కడుంది ఆంధ్రప్రదేశ్? వింధ్యకు అటా, యిటా ? అక్కడ పెట్టుబడి మించి రాబడి వస్తుందిట !

అక్కడ నా పరిశ్రమ మూడు పువ్వులూ, ఆరు కాయలుగా విస్తరిస్తుందట !

-అడిగిందే తడవుగా, ఏవేవో పారిశ్రామికాభివృద్ధి సంస్థలు ఆసరాగా వచ్చి, బాసటగా నిలిచాయి. నన్నీ రాష్ట్రంలో పారిశ్రామికవేత్తగా నిలిపాయి

ఇక్కడ గత నాలుగేళ్లలోనూ రమారమి రూ. **90** కోట్ల పెట్టుబడి ధనంతో **72** భారీ, మధ్యతరహా పరిశ్రమలు నెలకొన్నాయి. మరో **300** పరిశ్రమలు ద్వారాలు తెరుచుకొన్నాయి. వీటిలో రూ. **850** కోట్ల అంచనా వ్యయంతో **193** సరి కొత్త పరిశ్రమలు రూపురేఖలు దిద్దుకొని **60** వేలమందికి ఉద్యోగ ఉపాధి కల్పించ నున్నాయి.

స్వయం ఉపాధి కల్పనా రంగంలో యీ రాష్ట్రం గర్వించదగ్గ ఔన్నత్యం గడించింది. సుమారు **8** వేల మంది ఔత్సాహికులు రూ. **19** కోట్ల పెట్టుబడి ధనంతో చిన్న, చిన్న పరిశ్రమలు పెట్టుకొన్నారు ... **33,500** మంది విద్యావంతులైన నిరుద్యోగులకు ఉపాధి కల్పించారు.

ఆంధ్రప్రదేశ్ - పారిశ్రామికాభివృద్ధి సంస్థ, చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధి సంస్థ, ఆర్థిక సహాయకసంస్థ, ప్రాతిపదిక అవసరాల కల్పనా సంస్థ వంటి స్వతంత్ర ప్రతిపత్తి గల సంస్థలెన్నో రాష్ట్ర పారిశ్రామిక ప్రగతికి చేదోడు వాదోడుగా కృషి చేస్తున్నాయి.

-సృజనాత్మక ప్రతిభా వ్యుత్పత్తులున్న ఔత్సాహికులను ... యిదిగో యిక్కడున్నానని వేనోళ్ల పిలుస్తూంది, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం !

డాక్టర్ బి. ఆర్. కె. రావు

# సోషలిస్టు ఆర్థిక ఆలోచనలో మార్పు

యూరోపులోను, ఆసియాలోని కొన్ని దేశాల్లోను సోషలిస్టు పార్టీల విధానాల్లో చెప్పదగినంతగా మార్పు వస్తోంది. సాంప్రదాయకంగా వస్తున్న ఆశయాలను వదులుకుంటున్నవి. విశాల సాంఘిక సంస్కరణోద్యమాలుగా పరిణతి చెందుతున్నవి. ఇటువంటి దేశాల్లో కన్సర్వేటివ్ ప్రభుత్వాలే సాపేక్షిక దృష్టిలో ఉన్నతస్థాయిన ఔద్యోగితను ఏర్పాటుచేసినై. ఈ దేశాల భాగ్యోన్నతి పురోగమనం కూడా హెచ్చుగానే సాగుతోంది. ఈ పరిస్థితుల్లో సోషలిస్టు పార్టీల కార్యక్రమాలు, నినాదాలు ప్రజల్ని ఆకర్షించలేక పోతున్నవి. పట్టణీకరణ, పారిశ్రామికీకరణ సోషలిస్టు విజయానికి సోపానాల నేర్పాటుచేస్తాయనే భావం ఒకటి ఉండేది. కాని ఆరెండు దృగ్గోచరాలు ఉన్నతంగా జరిగినచోట్ల, శ్రామికశ్రేయస్సు దృష్ట్యా వర్గ సంఘాల్లో సంఘటితం చేయబడిన శ్రామికుల్లో సహితము సోషలిస్టుసందేశం అభ్యర్థన పెద్దగా ప్రభావం చూపలేకపోయింది. స్కాండినేవియా దేశాల్లోను, ఇజ్రాయెల్, ఇంగ్లండుల్లోను, యూరోపులోను జరిగిన ఘటనలే ఇందుకు నిదర్శనము. నిషిరో సుచెరో నాయకత్వాన జపాన్‌లో నూతనంగా ఉద్భవించిన సోషల్ డెమొక్రాటిక్ పార్టీ పై చెప్పిన ప్రవృత్తినే సూచిస్తోంది.

సోషలిస్టు మౌలిక భావాల్లో ప్రస్తుతం వచ్చిన మార్పును స్పష్టంగా చూపిస్తున్న ఘటనలు మూడున్నయ్యి.

(1) పశ్చిమ జర్మనీ సోషల్ డెమొక్రాటిక్ పార్టీ సాంప్రదాయకంగా వస్తున్న మార్క్సిస్టు కార్యక్రమాన్ని వదలి పెట్టింది. (2) బ్లాక్‌పూల్‌లో లేబర్ పార్టీ మహాసభలోను, బ్రిటీషు పత్రికల్లోను సోషలిస్టు అవలంభించవలసిన కార్యక్రమంపై జరిగిన చర్చలు (3) హాంబర్గ్‌లో జరిగిన అంతర్జాతీయ సోషలిస్టు సంస్థ ఆరవ మహాసభ చర్చలు.

జర్మన్ సోషల్ డెమొక్రాటిక్‌పార్టీ మార్క్స్, ఏంజెల్సుల ఆశీర్వాదంతో ప్రారంభించబడింది. సనాతన మార్క్సిస్టు పార్టీగా ఎంచబడుతూ ఉండేది. ఇప్పుడా మార్గాన్ని వదిలి నూతన కార్యక్రమాన్ని, సూత్రాలను ఏర్పాటు చేసుకున్నది. ఆ కార్యక్రమం వర్గము, వర్గపోరాటంవంటి మార్క్సిస్టు పదజాలాన్ని వదలివేసింది. ఆర్థిక వ్యవస్థలో ప్రధాన రంగాల్లో ప్రయివేటు ఆర్థిక ఉద్యమం (Enterprise) ఉపయోగకారి కాగలదని చెప్పబడింది. 'సర్వజన స్వామ్యము' (Commonownership), 'ప్రభుత్వ స్వామ్యము'లకు బదులుగా 'ప్రభుత్వ నియంత్రణ' అనే పదం ఉపయోగించబడింది. 'ప్రభుత్వ నియంత్రణ' చాలా సరళమైన విషయం. వీలైనంత వ్యాపారపోటీ, వీలైనంత ప్రణాళికా రచన అనే పదాలు కార్యక్రమ వివరణలో చొప్పించబడినై. ఇదంతాచూస్తే ఒక మతం తన ప్రాతిపదిక గీటీ మౌఢ్యసిద్ధాంతాలను త్యజించినట్లుగా కన్పిస్తోంది.

గెయిట్‌స్కెల్ నాయకత్వాన బ్రిటీషు లేబర్‌పార్టీ అటువంటి బాటనే నడవడానికి పూనుకుంది. అంతకు ముందు బ్రిటీషు లేబర్‌పార్టీ పారిశ్రామిక జాతీయకరణకు అత్యధిక ప్రాధాన్యతనిస్తూ ఉండేది. కాని బ్లాక్‌పూల్‌లో జరిగిన లేబర్‌పార్టీ సమావేశంలో, జాతీయాకరణనుండి సాంఘిక సంక్షేమానికి ప్రాధాన్యత మారాలని గట్టిగా చెప్పబడింది. అయితే పోరాటోన్ముఖులైన సోషలిస్టులు సోషలిజం మొదటి సూత్రాలకు తిరిగి వెళ్లాలని, అనగా జాతీయాకరణకు ప్రాధాన్యత నివ్వాలని చెబుతున్నారు. అయితే లేబర్‌పార్టీలో జాతీయాకరణను బలపర్చే పాతకాలంనాటి, వాగ్యుద్ధంచేసే మనుషులున్నారు. వీరు మేధాశక్తిగల యువనాయకుల మధుర వాక్కుల్ని, అనుభవరాహిత్యతను నమ్మలేకపోతున్నారు. ఇటువంటివారిని పోరాటోన్ముఖులు సమీకరిస్తున్నారు. కాని మరల అధికారికంగా పార్టీ విధానంలో మార్పు రావడానికి కొంతకాలం పడుతుంది.

అంతర్జాతీయ సోషలిస్టు సంస్థ ఆరవ మహాసభలో సోషలిస్టులు ఒక వర్గం కొరకుగాక సర్వజన సంక్షేమం కోసం పాటుబడాలని గట్టిగా చెప్పబడింది. ఈ సమావేశంలో జాతీయాకరణ, సర్వజన సంక్షేమము ఒకటేనని అన్నవారెవరూలేరు. ''ఉత్పత్తి సాధనాలు ఎవరి స్వామ్యంలో ఉన్నవనేది సోషలిస్టులకు ప్రధాన విషయంకాదు; ప్రజలు సమాజంలో ఎలా బ్రతుకుతున్నా రనేది ముఖ్య విషయం'' అని డచ్ సోషలిస్టు నాయకుడు ఊగ్డ అన్నారు.

పై ఘటనలు ఏర్పరచిన భావ విప్లవాన్ని విధంగా వ్రాయవచ్చు: ప్రపంచ ప్రజాస్వామ్యాన్ని నియంతృత్వము, యుద్ధము ప్రమాదానికి గురిచేయడానికి సిద్ధంగా ఉన్నవి. ఈ పరిస్థితుల్లో సోషలిస్టు లక్ష్యాల సాధనకు దేశంలోని ఆర్థిక చట్టం కంటె రాజకీయ చట్టం హెచ్చు ముఖ్యపాత్రను నిర్వహించవలసి వస్తుంది. సోషలిజం మౌఢ్య సూత్రవాదం నుండి ఉదార విధానంలోకి, సరళతలోకి వచ్చింది. సాంప్రదాయకంగా వస్తున్న సోషలిస్టు విశ్వాసాలను దృష్టిలోఉంచుకుని, ఆ విశ్వాసాలను ఆమోదించడానికి గల నాలుగు ముఖ్య కారణాలను దృష్టిలో ఉంచుకుని ఇప్పుడొచ్చిన మార్పును గురించి ఆలోచించవలసియున్నది.

సోషలిస్టు విశ్వాసంలోని ప్రధాన విషయాల్లో ప్రభుత్వ స్వామ్యము లేక ఉత్పత్తి సాధనాల జాతీయాకరణ మొదటి సూత్రము. ఈ విషయాన్ని రెండు విధాల సమంజసమని చెబుతున్నారు. ఒకటి ఆర్థిక కారణము. రెండవది నైతిక లేక రాజకీయ కారణము. జాతీయాకరణవల్ల పెట్టుబడిదారీ విధానంలోవలె ఆర్థిక

విస్తృతి ప్రక్రియ ధారావాహికత, సుత్తాధిపత్యము (ఏకస్వామ్యాధిపత్యాన్ని) పురోగమిస్తాయని భావించబడింది. సోషలిస్టు సమాజంలో పరిశ్రమ లాభానికి గాక ప్రజాసేవ చేయడానికి పనిచేస్తుంది. తత్కారణంగా వ్యాపార చక్రాలు రాకుండా పరిశ్రమలను ధారావాహికంగా నడుపుతూనే ఉండవచ్చు. ఇదే పెట్టుబడిదారీ పరిశ్రమలకు, జాతీయం చేయబడిన సోషలిస్టు పరిశ్రమలకు తేడా.

జాతీయం చేయబడిన పరిశ్రమలు సాంఘికావసర వస్తువుల్నే ఉత్పత్తి చేస్తూ ఉంటయ్యి. అందువల్ల ఉత్పత్తి కార్యక్రమాలను ఆపవలసిన పనిలేదు. కాబట్టి ధారావాహికంగా జరుగుతూ, పెరుగుతూ ఉండే ఆర్థిక కార్యక్రమం నిరుద్యోగాన్ని అంతంచేస్తుందని, ఈవిధంగా జాతీయాకరణ తోడ్పడుతుందని చెప్పవలసి ఉన్నది. నైతిక లేక రాజకీయ సమంజసత కూడా ఇంతే ముఖ్యము. ఆస్తి కూడా ఒకవిధమైన శక్తి. తమమీద ఆధారపడి బ్రదుకుతున్నవారిని ఆస్తిగలవారు బాగా నియంత్రణ చేస్తారు. ఈవిధంగా పారిశ్రామిక స్వాములు చెలాయించే బలవంత నియంత్రణనుండి, జాతీయాకరణ శ్రామికుల్ని విముక్తి చేస్తుందని సోషలిస్టులు విశ్వసించారు.

సోషలిజంలోని రెండవ ప్రముఖ విషయం ప్రణాళికా రచన. ప్రణాళికా రచన ఒక్కటేసహజ, మానవవనరుల దుర్వినియోగాన్ని ఆపుతుందని విశ్వసించబడింది. మొత్తం ఆర్థిక వ్యవస్థ నంతటిని దృష్టిలో పెట్టుకుని ఆలోచించినపుడు, ప్రణాళికా రచన ఒక్కటి మాత్రమే దుబారాను, వ్యాపార పోటీవల్ల ఏర్పడే అనవసరపు ఖర్చులను తొలగించగలదని సోషలిస్టులు వాదించారు. ప్రభుత్వం ప్రజలకు చేసే సేవలను బలపర్చడానికి ఎప్పుడూ శ్రద్ధవహిస్తూ ఉండాలి. ప్రజాసేవ కవసరమైన సహజ వనరుల రక్షణను, విద్యావ్యాప్తిని ప్రణాళికా రచన బలపరుస్తుంది.

మూడవ విషయం. సోషలిజం మానవ సంక్షేమం, సాంఘిక న్యాయాలకు హెచ్చు ప్రాధాన్యతనిస్తుంది. సమాజం ఉత్పత్తి చేసిన వస్తువుల్ని వినియోగిస్తున్నవారందరు సమాజానికి కొంత సేవ చెయ్యవలసిన అవశ్యకత ఉన్నట్లే, శరీరబలం గల్గి, పనిచేయడానికి ఇష్టపడేవారందరికి ఉద్యోగావకాశాన్ని కల్పించాలని సోషలిస్టులు గట్టిగా వాదించారు. మార్కెట్ పరిస్థితులకు అనుగుణ్యంగా ప్రయివేటు పరిశ్రమలు ఈ విషయంలో పనిచెయ్యగలవు. అయితే సమర్థతమీద, శ్రామికుల్ని తగ్గించి పనిచేసే యంత్రాలమీద దృష్టిని బాగా సారించిన ప్రయివేటు పారిశ్రామిక స్వామ్యము సాంకేతిక నవకల్పనలను ప్రవేశపెట్టడంవల్ల మానవులకు, సంఘానికి జరిగే ఖర్చును (నష్టాన్ని) గుర్తించలేకపోతోంది.

అవకాశాల్లో సమానత్వాన్ని ఏర్పర్చడానికిగాను సమాజం వ్యక్తికి అవసరాన్ని, సామర్థ్యాన్నిబట్టి ఆదాయం ఇవ్వాలి. ఉత్పాదక శక్తుల్ని గణనలోకి తీసుకుని, ఉపయోగకరమైన పనిచేసేవారి కనీసాదాయాన్ని నిలకడగా పెంచడము, వారసత్వపరంగా వచ్చిన ఆస్తి ఇచ్చే ఆదాయంమీద బ్రదికేవారి గరిష్ట ఆదాయాన్ని నిలకడగా తగ్గించుకు రావడము జరగాలని సోషలిస్టులు గట్టిగా చెప్పారు.

నాల్గవ విషయం. సోషలిజంలోని మానవతా (కరుణతో కూడిన వాదము) వాదము ముఖ్యమైనది. తన శక్తిసామర్థ్యాలు అనుమతించినంతవరకు వ్యక్తి తన స్వతంత్ర, సమరస, మూర్తిమత్వాన్ని బలపర్చుకునే సమాజాన్ని ఏర్పాటు చెయ్యాలనే కోర్కె ఫలప్రదమయ్యేట్లు కార్యక్రమం నిర్వహించటానికి స్వేచ్ఛావకాశాలు ఉండటమే ఈ మానవతావాదం. వ్యక్తి సృజనాత్మకమైన పనినైనా చేస్తాడు, లేదాతని విశ్రాంతికాలాన్ని సృజనాత్మకంగాను, అర్థవంతంగాను ఉపయోగిస్తాడు. "శ్రామికులకు నిజమైన విలువలేక సంస్కృతి చాలా మంచి చేస్తుందనడంలో గొప్పవిశేషమేమీలేదు" అని చెప్పడానికి సోషలిస్టులు కుతూహలపడుతూ ఉండేవారు.

సోషలిజం పరిపాలనలో ద్రవ్యవిలువలకు వ్యతిరేకంగా తిరుగుబాటు జరుగుతుందని ఆశించబడింది. సంతోషం. లభ్యమైనచోటే జీవితానికి కావలసిన నిజమైన సంపద దొరుకుతుందని చెప్పవచ్చు. మనుష్యులు, అభిప్రాయాలు, కళ, సైన్సు, సంస్కృతి, కొంత మందికి మతము ఇటువంటి సుఖసంతోషాలను, భాగ్యాన్ని ఇవ్వగలవు.

గంభీరమైన ఆ ఆశయాలన్నీ ఇప్పుడేమైనయ్యి? ఆర్థిక వ్యవస్థలో క్రమేపివచ్చిన మార్పులవల్ల అందులోని కొన్ని ఆశయాలు సిద్ధించినై. "బందిపోటుదొరల" పెట్టుబడిదారీ విధానం స్థానంలో మిశ్రమ ఆర్థిక వ్యవస్థ ఏర్పడింది. చట్టప్రకారం చూసినా, యదార్థాలను గమనించినా మిశ్రమ ఆర్థికవ్యవస్థ ఏమాత్రం కూడా స్వేచ్ఛా వ్యాపార వ్యవస్థకాదు.

ఇంతకంటె కొట్టవచ్చినట్లు కన్పించే విషయం మరొకటుంది. ప్రభుత్వస్వామ్యం ఆర్థిక వ్యాధులన్నింటికి సర్వరోగ నివారిణిగా పనిచేయటంలేదు. ప్రయివేటు పరిశ్రమల్లోలాగానే ప్రభుత్వ స్వామ్యంలోఉన్న పరిశ్రమల్లో కూడా శ్రామికుల్ని దోపిడి చేయడానికి, దోపిడి చేస్తున్నారని బాధపడటానికి వీలుంది. ఈ విషయంలో కమ్యూనిస్టు దేశాల్లో జరుగుతున్న దోపిడి భయంకరమైన ఉదాహరణగా ఉన్నది. ప్రజాస్వామిక ప్రక్రియలు లేనిచోట్లకులీనులు మానవులమీద అధిక అధికారాన్ని చెలాయిస్తున్నారు. బ్రదుకనివ్వడము, చంపటము కూడా వీరిచేతుల్లోనే ఉన్నది. ప్రయివేటు స్వామ్యంలోకంటె ఈ పనులు ఘోరంగా జరుగుతున్నవి. అయితే స్వేచ్ఛగల్గిన బలీయమైన శ్రామికసంఘాలు ఈ అధిక అధికారానికి కొంతవరకు 'బ్రేకు'ల్లాగా పనిచేస్తున్నవి.

అంతేగాక సాంప్రదాయకంగా సోషలిస్టులు అవలంభిస్తున్న సాంఘిక సంక్షేమసూత్రాలు, నిరుద్యోగులకు, వృద్ధులకు, రోగులకు, అశక్తులకు సహాయం చేయవలసిన బాధ్యత ప్రభుత్వానికున్నదనే సిద్ధాంతాలీనాడు సోషలిస్టులు కాని వారిచేత అమలు జరుపబడుతున్నవి. విశ్వవ్యాప్తంగా ఈ దృగ్గోచరం [illegible]. 1932లో అమెరికా డెమొక్రాటిక్ పార్టీ జారీచేసిన ఆర్థిక కార్యక్రమం రిపబ్లికన్ పార్టీ కార్యక్రమాన్నే పోలి ఉంది. కాని డెమొక్రాటిక్‌పార్టీ ''న్యూడీల్'' విధానం సాధించిన ఫలితాలు 1932లో అమెరికా సోషలిస్టుపార్టీ జారీచేసిన ప్రణాళికలోని విషయాల్లాగానే ఉన్నవి. అయితే 'న్యూడీల్' విధానంలో జాతీయాకరణ మాత్రంలేదు.

ఇంగ్లండులో టోరీ పార్టీ (కన్సర్వేటివ్ పార్టీ) తాను అధికారంలోకి వచ్చినప్పటి నుండి జాతీయాకరణ చేయడాన్ని వ్యతిరేకించింది. కాని లేబర్‌పార్టీ ప్రవేశపెట్టిన సాంఘిక సేవలను ఆపి వెయ్యలేదు నిజానికొకసారి, కన్సర్వేటివ్ పార్టీ ప్రజల కొరకు లేబర్‌పార్టీ కంటె తాను హెచ్చు గృహాలను నిర్మించానని ప్రగల్భాలాడింది.

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత జీవన ప్రమాణాలు పెరుగుతూ వచ్చినవి. సంపూర్ణ ఔద్యోగిత కూడా దాదాపు ఏర్పడింది. ఆధునిక జీవన సౌకర్యాలను కల్గించే చిన్న యంత్రాలమీద మోజు ప్రబలింది. యుద్ధకాలంలో నడచిన కంట్రోళ్లు సోషలిజం కావాలా, వద్దా అనే అనుమానాన్ని ఏర్పర్చినట్లు, యుద్ధం తర్వాత వచ్చిన పరిస్థితులు సోషలిస్టుల పోరాట స్వభావాన్ని చాలా నెమ్మది పర్చినవి. సోషలిజం మధ్యవయస్కులకు, గౌరవం కోరేవారికి, నైతికమార్గం కోరేవారికి సంబంధించిన ఉద్యమంగా తయారయ్యింది. మంచి ఆశయం కోసంగాక, మంచి కాలంకోసం ఎదురు చూస్తున్న కొంతమంది యువకులకు సోషలిస్టు ఉద్యమం విసుగుదలగా పరిణమించింది!

అన్నిటికంటె సోషలిజంలోని ప్రజాస్వామిక, నైతిక లక్షణాలకు పునఃపుష్టికల్గించే ప్రయత్నాలు ముఖ్యమైనవి. సోషలిజంలోనైనా, పెట్టుబడిదారీ విధానంలోనైనా పెద్ద తరహా పరిశ్రమలు, మూకసంస్కృతి కూడా వ్యక్తి స్వతంత్రాభిమానాన్ని, నమ్మకం కుదిర్చే మంచి శీలాన్నీ, ప్రాముఖ్యతను తరచు నాశనం చేయడానికి పూనుకుంటవి. ఉత్పాదనా వ్యవస్థ ఒక లక్ష్యసాధనకు మార్గము. స్వేచ్ఛ, రక్షణ, ప్రాముఖ్యతగల జీవితానికది సాధన లక్ష్యమనే మౌలిక అభిప్రాయానికి సోషలిస్టులు తిరిగి చేరుకున్నారు.

పెద్ద పరిపాలనా యంత్రంలో ఒక చిన్న శీలగా పనిచేసే వానికి అధికారంలో ఎవరు — ప్రయివేటు యజమాని, ప్రభుత్వ కులీనాధికారి, కార్పొరేషన్ మేనేజరు — కూర్చున్నారనేది అంతగా పట్టింపుగల విషయంకాదు. చట్టరీత్యా స్వామ్యము ఏ రూపాలు ధరించినప్పటికి, తన జీవితము, పని అర్థవంతంగా ఉండాలని అనుకునే మనిషికి, తనకుఅధికారంలో భాగంవస్తుందా, తాను అధికారం గల వారిని ప్రభావితం చేయగలడా అనేదే ముఖ్యము. సహనిర్ణయ **(Codetermination)** విధానాన్నవలంబించడంద్వారా శ్రామికులను మేనేజిమెంటు బోర్డులకు ఎన్నికయ్యేటట్లుచేసి శ్రామికుల ప్రయోజనాలు సాధించబడేటట్లు చూచినట్లయితే అధికారాన్ని ప్రభావితం చేసినట్లు కాగలదని జర్మన్ సోషలిస్టులు నిర్ణయించుకున్నారు.

పై జెప్పిన విషయాన్నంతా చూసిన పిదప సోషలిస్టులు మార్క్సిజాన్ని పూర్తిగా వదలివేసారని చెప్పడానికి వీలుకాకపోయినా, మార్క్సిజానికి కొత్త భాష్యం చెపుతున్నారని కొందరంటున్నారు. కొత్త పదజాలాన్ని ఉపయోగించినప్పటికి, సోషలిస్టులు ఇప్పుడు కూడా వర్గపోరాటాన్ని జరపాలనే అంటున్నారు. ఒక విషయం స్పష్టంగా గోచరిస్తోంది. కమ్యూనిస్టుల కంటె, ప్రజాస్వామిక దృక్పథంగల సోషలిస్టేతర సోదరుల వద్దనే తమ కనుకూలించే విషయాలెక్కువగా ఉన్నట్లు సోషలిస్టులు అభిప్రాయపడుతున్నారు. ప్రమాదం ఏర్పడినప్పుడు మాత్రమే వాక్‌స్వాతంత్ర్యము, ఆందోళన చేసే స్వాతంత్ర్యము, సంఘటనా స్వాతంత్ర్యము, సమ్మెచేసే స్వాతంత్ర్యము బాగా అర్థమవుతాయి. ఇదివరకటికంటె చాలా ప్రాముఖ్యం గలవిగా కన్పించుతాయి.

ఇదంతాచూస్తే సోషలిస్టులు తమ పెద్ద పోరాటాలన్నింటిలో గెలిచారనే చెప్పవచ్చా? అవునని, కాదని గట్టిగా చెప్పడము కష్టము. దారిద్ర్యంగల చోట్లు ఇంకా చాలా ఉన్నవి. ఆస్తుల స్వామ్యానికి చెందిన చట్టబద్ధ స్వరూపాలు ఇంకా మారలేదు. కాని సామాజిక సంక్షేమం విషయంలోను ముఖ్యంగా జీవనప్రమాణాలను పెంచే విషయంలోను, శ్రామికుల జీవితాలను మానవ జీవితాలుగా చేసే విషయంలోను, రాజ్యాంగ యంత్రానికి, పరిశ్రమలకు పెద్ద బాధ్యత ఉన్నదనే విషయాన్ని వారిచేత గుర్తించేటట్లు చేయడంలో విజయం పొందడంద్వారా కొన్ని పెద్ద పోరాటాల్లో సోషలిస్టులు విజయం పొందారనే చెప్పవచ్చు. సోషలిస్టు వ్యతిరేకులు సిద్ధాంత రీత్యా కాకపోయినా ఆచరణలో శ్రేయోరాజ్యాన్ని అంగీకరించారు. అయితే కొన్ని సందర్భాల్లో, సోషలిస్టులు అతి తీవ్ర ఆర్థిక కార్యక్రమాలు అమలు జరపకుండా ఆపేందుకు, సోషలిస్టు వ్యతిరేకులు శ్రేయోరాజ్యాన్ని అంగీకరించారు

పై జెప్పిన విషయం వాస్తవమైతే, సోషలిజానికి ప్రత్యేక ఉద్యమంగాను, ప్రత్యేక స్వతంత్ర రాజకీయ పార్టీగాను మనగల్గే భవిష్యత్తు ఉన్నదా? భవిష్యత్తులో సోషలిస్టు పార్టీలు నిర్వహించ

వలసిన ప్రత్యేక పాత్ర ఉన్నదనే విషయం నిర్వివాదాంశం. అయితే ఎన్నికల్లో గెలవడం విషయంలో ఎంతవరకు విజయ మొస్తుందనేది ఆలోచించాలి. జర్మనీ, ఇంగ్లండ్, పోర్చుగల్‌లలో సోషలిస్టుపార్టీలు కొద్దికాలం క్రిందట గెలిచినాయి. ఫ్రాన్సులో సోషలిస్టు పార్టీయే ప్రధాన రాజకీయ పక్షంగా ఉన్నది. స్కాండినేవియన్ దేశాలలో సోషలిస్టు పక్షాలు మిశ్రమ మంత్రి వర్గాలలో ఉన్నవి. కొన్నిచోట్ల ప్రధాన ప్రతిపక్షాలుగా ఉన్నవి. బర్మా, ఇండోనేషియాల్లో సోషలిస్టులదే పైచేయిగా ఉన్నది. ఇండియాలో అప్రత్యక్షంగా సోషలిస్టులు రాజకీయాలను గొప్పగా ప్రభావితం చేశారు.

ప్రస్తుత పరిస్థితుల్నిబట్టి చూస్తే సోషలిస్టు పార్టీలు సంపూర్ణ పరిష్కార మార్గాలను ఇచ్చే స్థితి కల్పించదు. దేనినో ఒకదానిని మెరుగుపర్చడానికి చిన్న చిన్న పరిష్కారమార్గాలనే ఇవ్వ వలసిన పరిస్థితి ఉన్నట్లు కన్పిస్తోంది. పెట్టుబడిదారీ సమాజం లోని ప్రధాన సమస్య లన్నింటిని పరిష్కరించడానికి ప్రాతిపదిక ఆర్థిక మార్పువస్తే చాలునని ఒకప్పుడు సోషలిస్టులు అనుకున్నారు.

ఈనాడు సోషలిస్టులు కొత్త విషయాలు తెలుసుకున్నారు. ప్రస్తుతం వారి అభిప్రాయం ప్రకారం సమాజంలోని చెడు అంతా స్వేచ్ఛావ్యాపార ఆర్థిక విధానం వల్ల ఏర్పడటం లేదని తెలుస్తోంది. అందువల్ల భవిష్యత్తులో సోషలిస్టుపార్టీ ఎన్నికల ప్రణాళికలు పూర్తి జాతీయాకరణ కావాలని కోరవు. వ్యాపార పోటీని, స్వేచ్ఛా వ్యాపారాన్ని కొన్ని రంగాల్లోను, ఇతర రంగాల్లో వివిధ ప్రభుత్వ సర్వీసు కార్పొరేషన్లను ఏర్పాటుచేసి, కలిపి పని చేయించాలని సోషలిస్టులు కోరతారు.

అందువల్లసోషలిస్టుపార్టీలు ధారావాహిక సాంఘిక సంస్కరణ పార్టీలుగాను, అట్టడుగునపడి మర్చిపోయినవారికి, అణగద్రొక్క బడుతున్నవారికి పార్టీలుగాను, సాంఘిక సంక్షేమానికి వేదికలుగాను పనిచేస్తాయి. ఉత్పత్తిని అధికం చేయడానికి, ఔద్యోగితను గరిష్ఠం చేయడానికి పనిజేయడమేగాక అవకాశాలు, ఛాన్సులు సమానంగా లభ్యమయ్యేట్లుచేయడానికి, ఆరోగ్య, గృహవసతి, విద్యా, సాంస్కృతిక ప్రమాణాలను అభివృద్ధి చేయడానికి కూడా గట్టిగా పాటుబడతారు.

సోషలిస్టులు చెబుతున్న సంస్కరణలు కన్సర్వేటివ్‌లు చెప్పే సంస్కరణలకు కొంతవరకు పోలిక కన్పిస్తూ ఉండవచ్చు. అయితే సోషలిస్టులు సాంఘిక సంక్షేమానికి ప్రభుత్వం ఎక్కువ ఖర్చు చెయ్యాలని, జీవన ప్రమాణాల పెరుగుదలతోపాటు వ్యక్తిగత స్వేచ్ఛలు తరిగిపోయేటట్లు చెయ్యరాదని డిమాండ్ చేస్తారు. అందుచేత సోషలిస్టుపార్టీలు సంకుచిత ఏకవర్గ పార్టీలుగా గాక ప్రజాస్వామిక జీవిత విధానాన్ని ముందంజ వేయించే పవిత్ర విషయా లన్నింటిని రక్షించి, బలపర్చి, పురోగమింపజేయడానికి తీవ్రంగా కృషిచేస్తారు.

పైపాత్ర సోషలిస్టులకు ఎన్నికల్లో విజయం చేకూరు స్తుందా? ఎన్నికల్లో విజయం అనేక పరిస్థితులమీద ఆధారపడి ఉంటుంది. మూఢసిద్ధాంతాలమీదగాక, సంస్కరణలమీద జోరుగా నొక్కిపెట్టిన జర్మన్ సోషలిస్టుపార్టీ కాథలిక్కులు హెచ్చుగాఉన్న బవేరియా రాష్ట్రంలో క్రిస్టియన్ డెమోక్రాటిక్ యూనియన్ మీద ఎన్నికల్లో విజయం పొందడను ఆశాజనకంగానే గాక, గమ నార్హంగా కూడా ఉన్నది.

తీవ్రమైన/రాజకీయ తప్పిదాలు ఉద్రేక పర్చినపుడు మినహా ఓర్పుతో, ధారావాహికంగా పనిచేసే రాజకీయపార్టీలే ఎన్నికల్లో విజయం పొందుతూ ఉంటాయి. సిద్ధాంతాలపై మోజుపోయి నప్పుడు, ప్రజల అభిమానాన్ని హెచ్చుగా సంపాదించినప్పటికి, సంఘటన ఐక్యతను సోషలిస్టుపార్టీలు కోల్పోవచ్చును. నెమ్మదిగా జరుగుతూ ఉత్సాహం కల్గించలేని అభివృద్ధికంటె, కొట్టవచ్చి నట్లు మెరిసే లాభాల్లో విశ్వాసంచూపే సోషలిస్టుపార్టీ సాధారణ సభ్యులు; సోషలిస్టుపార్టీలు ప్రతిపక్ష సంస్కరణ పార్టీలుగా తయారైనపుడు, సోషలిస్టుపార్టీలను భక్తిశ్రద్ధలతో సర్వకాల సర్వావస్థల్లో బలపర్చకపోవచ్చు. అందుచేత సమాజాన్ని మార్చ డానికి యువతీ యువకుల్ని ఆకర్షించడం కష్టం కావచ్చు.

సోషలిస్టుపార్టీలు ఈ పరిణామ చక్రాన్నంతటిని పూర్తి చేసిన జర్మనీ, ఇంగ్లండు ఆది దేశాల్లో, రాజకీయజీవితం గతంలో వలె మనుష్యుల్ని కదిపివేయగలిగేటట్లు ఉండదు. తక్కువ నినాదా లతో, ఎక్కువ సారస్వతంతో, హెచ్చు బాధ్యతగల ఉద్యమంగా పని చేస్తుంది. రష్యా, చైనా దేశాలవలంబించే విదేశాంగనీతి, ఇతర దేశాల జాతీయ జీవితంపైన చూపే ప్రభావం, ఆ జాతీయ రాజకీయ జీవితాలఎడ వినుగు పుట్టకుండా ఉండేటట్లు చేస్తుంది.

పార్టీ రాజకీయాలకు బయట, సోషలిజం నైతిక ఉద్యమం ఔతుంది. శాస్త్రీయజ్ఞాన పద్ధతుల్ని జాతీయ, అంతర్జాతీయ జీవితాలకు అనువర్తింపజేస్తూ సోషలిజం నైతిక ఉద్యమంగా మారుతుంది. ఇటువంటి నైతిక ఉద్యమం పెరిగిన కొలది, మత, తాత్విక అనుబంధాలు తాత్కాలికంగా విభజన చెయ్యనటువంటి, ఆశయ విభేధాలు, శాశ్వత రాజకీయ ముఠాలు లేనటువంటి స్వేచ్ఛా సమాజంగా ఏర్పడడానికి మనమంతా సన్నిహితులమౌతాము.

ఇరవయ్యవ శతాబ్దంలో బలమైన నియంతృత్వ ఫాసిస్టు కమ్యూనిస్టు ఉద్యమాలు పెరుగుతున్నవి. అందువల్ల విడదీసే విష యాలకంటె, అందరికి సమానంగా ఉన్న విషయాలు స్వేచ్ఛా ప్రపంచంలోని ప్రజాస్వామిక పార్టీలకు ముఖ్యము. నియంతృత్వం రాకుండా చేసి, ప్రజాస్వామ్యాన్ని పురోగమింప జేసేందుకు ప్రజా స్వామిక రాజకీయపార్టీలు సన్నిహితం కావాలని సోషలిస్టులు కోరు తున్నారు. తీవ్ర అభిప్రాయబేధాలు ఉండవచ్చు. హింసాపూరిత సంఘర్షణకు త్రోవతీసేటట్లుగా విబేధాలు ప్రజాస్వామిక వాదుల్ని విడదీయరాదు. అందరికి సమానంగా అవసరమయ్యే అవసరాలు, ఆశయాలు, మేధాశక్తితో విశ్వాసము విబేధాలను పరిష్కరించి సోషలిస్టు ప్రజాస్వామ్యం ఏర్పాటుకు తోడ్పడవలసి ఉన్నది.

# ఓ కాలమా!

శ్రీ బండి నాగరాజు

కాలమా! నీతో ఆడుకోవాలనివుంది.
నీతో రావాలనివుంది.
నీతో పరుగెత్తాలనివుంది.
నిన్ను మించి ముందుకు పోవాలనివుంది.
వెనకబడుతున్న నన్ను లాక్కెళ్ళవూ ?
నీ ప్రేమ యెంత గొప్పది !
నీ దయ ఎంతటిది !
నీ మనసు ఏం వుదార మైనది ! ... ...
అబ్బా, యెంతలో మార్పు ?
ఒక్కక్షణంలో ఎన్నోవంతులో ఎంతమార్పు !
నీకు ప్రేమ లేదా ?
దయ లేదా ?
మనసు లేదా ?
నీ పోకడకు అంతులేదా ? ... ...

నీతో ఆడుకోవడం ప్రమాదం.
పరుగెత్తడం అపాయం.
నీతోపాటు రావడం అనర్థం.
మించిపోవడం ముప్పు.
నన్ను లాక్కెళ్ళడం వుడ్డ మోసం.
మనిషికంటే ప్రమాద కారివి నువ్వు.
అబ్బో, నీతో నాక్కుదరదు.
నీకో నమస్కారం.
నా మానాన నన్ను బతకనియ్యి ... ...
అవునూ, నిన్ను కాదని వొదిలికూడా బతక
గయ్యాళి పెళ్ళాన్ని కట్టుకున్నట్టయింది !
నీకు విడాకు లివ్వాలంటే సమాధి కెళ్ళాలి.
అసలు, బుద్ధితక్కువ నాది —
పుట్టడమే పొరపాటు — అవును !



శ్రీ కలువకొలను సదానంద

# న వ యు వ కు డు

మల్లీశ్వరిపైన కంబయ్యకు ఒళ్ళు తెలియనంత మోజు—అంటూ కథ ప్రారంభమైందనుకోండి; కథ యిక ముందుకు సాగవలసిన అవసరం కనిపించదు. ఎందుకంటే, కథ చెప్పటానికి యిందులో ఏముంది గనక? మల్లీశ్వరి ఆడమనిషి. కంబయ్య మగవాడు. జీవిత ప్రయాణంలో మరపురాని మజిలీ ఒకటుంది. అక్కడ పువ్వులు పూస్తాయి. గున్న మామిళ్ళు చిగురిస్తాయి. కోయిలలు గొంతులు విప్పుకుంటాయి. మనిషి బ్రతుకు ముస్తాబయ్యే ఆ అందమైన దశలో ఆడజాతి మీద మగజాతికీ, మగజాతి మీద ఆడ జాతికీ మోజు కలగడం ప్రకృతి సహజం, ప్రాణిధర్మం కూడానూ. కనుక ఒకర్నొకరు ప్రేమించుకోవటమనేది సర్వసాధారణమైన ప్రేమకథే అవుతుందిగానీ, అసాధారణం అనిపించుకోదు.

మల్లీశ్వరి అనే చిన్నదానిపైన కంబయ్య అనే వయస్సు మళ్ళిన వాడికి ఒళ్ళు తెలియనంత మోజు అన్నమాట విన్నామనుకోండి. గారడీచూస్తున్న కుర్రాడిలా కుతూహలం నిక్కిచూస్తుంది. కథ కదనాశ్వంలా ముందుకు దూకుతుంది.

మల్లీశ్వరి కథానాయిక !

కంబయ్య కథానాయకుడు !

నాయకుణ్ణి గురించి తెలుసుకోటానికి ముందు, నాయికను గురించి నాయకుడికి తెలిసివున్న వివరాలేమిటో చెప్పుకుందాం.

బస్తీ నుంచి గానుగ పెంటకు వెళ్ళే బస్సెక్కి, మూడో మైలు దగ్గిర కొండల్లో కోనల్లో బస్సు దిగితే, రెండు ఫర్లాంగుల దూరాన పచ్చని మర్రిచెట్టులా కనిపిస్తుంది కోనపల్లి. ఆర్నెల్ల కిందట చిన్న ట్రంకు పెట్టెతో ఏ దిక్కునుంచో ఎగిరివచ్చి కోన పల్లిలో వాలిన రామచిలకే మల్లీశ్వరి. కోనపల్లిలాంటి అడివికొంపకు ఆమె అవసరం ఎంతో వుందని తెలుసుకోటానికి చాలా రోజులు పట్టలేదు గ్రామస్థులకు. రొచ్చూ రోగమూ లేని మానవులుంటారా లోకంలో ? మల్లీశ్వరి వైద్యం ప్రారంభించింది. మాత్రలిస్తుంది. మరీ అవసరమైతే సూదులు వేస్తుంది. సంచీ చేతబట్టుకుని చుట్టుపక్కల పల్లెలంతా తిరిగి వస్తుంది. పల్లెటూళ్ళ వాళ్ళని పిసినిగొట్టులనటం భావ్యం కాదుగానీ, పొదుపుగా బతికే చిత్తవృత్తి వాళ్ళది. పెద్ద మొత్తాలు గుంజే పట్నం డాక్టర్లతో వాళ్ళకు అవసరంలేదు. మల్లీశ్వరి చాలా మంచిది. ఇచ్చినా, ఇవ్వకపోయినా మంకుపట్టు పట్టేరకం కాదు. గ్లాసెడు వేడి పాలిచ్చినా తాగి వెళ్ళిపోతుంది. కుంచెడు వడ్లిచ్చినా తృప్తిపడి వూరుకుంటుంది. సంచీలో రెండుశేర్ల వేరుశెనక్కాయలు పోసినా, మూట నెత్తికెత్తుకున్నట్లు మురిసిపోతుంది. పంచాయతీ సర్పంచ్ దోమా సీతారాము చౌదరి యిచ్చిన చుట్టు గుడిసెలో 'నర్సమ్మ' అనే వాడుక పేరుతో ఒంటరిగా బ్రతుకుతోంది.

మల్లీశ్వరి అందచందాల్ని గురించి పాఠకులు ఈపాటికే ఊహల్లల్లుకుని వుంటే, పప్పులో కాలువేశారన్న మాటే ! ఆమె పొట్టిగా, ముద్దుగా వుంటుంది. ఒంటిమీద అలంకారాలు బొత్తిగా వుండవు. వయస్సు ఇరవై అని చెప్పుకుంటుంది. ఆమాట నిజం కావచ్చు, కాకపోవచ్చు. ఏమైనా, ముప్పైకి మించదని మాత్రం గట్టిగా అనుకోవచ్చు. ఆడతనం ఒక్కటే ఆమెలోవున్న ఆకర్షణ.

ఇక — కోనపల్లిలోనే వుంటున్న కథానాయకుణ్ణి గురించి చెప్పుకుందాం. ఊళ్ళోని యువకుల పరిహాసాల రీతిలో — కంబయ్య అంటే బట్టతల. కంబయ్య అంటే—బట్టతలచుట్టూ సహజీవనం చేస్తున్న నలుపూ తెలుపూ. కంబయ్య అంటే — మెలితిరిగిన మీసాలు ! కంబయ్య అంటే, యవ్వనపు వాసనల్లో మునిగితేలుతున్న ముసలితనం ! తన వయస్సింకా నలభై దాటలేదంటాడు కంబయ్య. అంటే అంటాడు. ఊళ్ళో వాళ్ళదేం పోయింది?...వాళ్ళూరుకోరు. యాభై ఎప్పుడో దాటిందంటారు.

కంబయ్యకు ఇల్లుంది. ఎకరా పల్లం, రెండెకరాల మెరకా వున్నాయి. కొడుకుల్లేరు. కని, పెంచిన ఒకే ఒక కూతురు మూడేళ్ళ కిందట పెళ్ళి చేసుకుని వెళ్ళిపోయింది. కంబయ్యకు పెళ్ళామంటే ప్రాణం. ఆమె పరలోకం చేరుకుని రెండేళ్ళయింది. జీవితంలో అతన్ని కృంగదీసిన సంఘటన యిదొక్కటే ! కంబయ్య ఒంటరివాడైపోయాడు. తనకొక తోడూనీడాలేని ఆ ఎడారి బతుకు దుర్భరమైంది. అటువంటి దీనావస్థలో అతని మనసు మల్లీశ్వరి వైపు మళ్ళింది. ఆమె అందంగా లేకపోతేనేమి? అతని కంటికి జగన్మోహినిగా కనిపించింది. ఒంటరిగా వుంటున్న ఆమె తనని అనుగ్రహిస్తే ఎంత బాగుండునో అన్న ఆశ మోసులెత్తింది.

ఈ ఆశకు నీరుపోసి కొబ్బరి చెట్టంత ఎత్తుకు పెంచిన వాడొకడున్నాడు. ఆ ఊరి సింగిల్ టీచరు ఆంజనేయులు. ఆంజనేయులు రోజూ బస్తీ నుంచి సైకిలుమీద వచ్చిపోతుంటాడు. అతనికి స్కూల్లో ఉద్యోగం కంటే, ఊళ్ళో సద్యోగమే ఎక్కువ. ఆడవాళ్ళందరితోనూ చనువుగా వుంటుంటాడు. మల్లీశ్వరి దగ్గర కూడా చనువుగా వుంటున్నాడంటే ఆశ్చర్యమేముంది ?

ఓరోజు కంబయ్య కళ్ళలోకి ఓరగాచూచి, ''ఏం కంబయ్యా? నర్సమ్మ అలా చూస్తుందేం నిన్ను ? ... ఏం కథ ?'' అన్నాడు ఆంజనేయులు.

''ఎలా చూస్తుందీ ?'' అన్నాడు కంబయ్య ఏమీ అర్థంకాక.

"అదే!...అదోలా..."

"ఛా! వూరుకో ఆంజిబాబూ! ఏం మాటది?" అన్నాడు కంబయ్య ఇబ్బందిగా. అలా అన్నాడేగానీ, ఆ తరువాత రోజూ ఆంజనేయుల్ని కలుసుకోకుండా వుండలేకపోయాడు.

"కంబయ్యా! నర్సమ్మ నిన్ను గురించి అడిగింది" అన్నాడు ఆంజనేయులు.

కంబయ్యకు రెక్కలొచ్చాయి. "ఏమడిగిందీ?"

"అదే! అంతా అడిగింది."

"నువ్వేం చెప్పావు ఆంజిబాబూ?"

"అదే! అంతా చెప్పాను."

"నా వయస్సడిగిందా?"

"అడిగింది."

"ఏం చెప్పావు నువ్వు?"

"నలభై అన్నాను."

"నలభై యింకా పూర్తి కాలేదే!..."

"ఆమాటే అంది నర్సమ్మ. సుప్పయ్ అయిదేళ్ళ వాడిలా కనిపిస్తావట నువ్వు!"

ఆంజనేయులూ కంబయ్యల స్నేహం దినదిన ప్రవర్ధమాన మైంది. ఆంజనేయులు సూచనల్ని అక్షరాలా పాటించాడు కంబయ్య. వెంట్రుకలకు నల్లరంగు అద్దుకున్నాడు. చలువ బట్టలు తొడుక్కున్నాడు. మీసాలు మరింత మెలితిప్పాడు. మల్లీశ్వరి కనిపించి నప్పుడల్లా చురుగ్గా చూడటం మొదలెట్టాడు.

ఇవన్నీ చేస్తూనే — మల్లీశ్వరిపట్ల తనకున్న అనుమానా లన్నిటినీ ఆంజనేయుల్ని అడిగి తీర్చుకోసాగాడు. అతని మొదటి అనుమానం — ఆంజీ గురించే. ఆంజీ బ్రహ్మచారి వెధవ. పెద్ద దిక్కెవ్వరూలేరు. నవ మన్మథుడేమీకాదు. మెల్లకన్ను కూడానూ! 'గంతకు తగ్గ బొంత' అని నర్సమ్మను తగులుకున్నాడేమో, ఎవరు చూశారూ? "ఆంజీ! అలాంటిదేమైనావుంటే చెప్పేయ్. మనిద్దరికీ ఎందుకు పోటీ?" అని మొహమాటం లేకుండా అడిగేశాడు. "ఛా! నర్సమ్మ నా చెల్లెల్లాంటిది!" అన్నాడు ఆంజీ. సంతోషించాడు కంబయ్య.

అయితే అతనికున్న అనుమానాలు ఒకటా, రెండా! ఆమె కిదివరకే పెళ్ళయిందనీ, మొగుడు వొదిలేశాడనీ చెప్పుకుంటారు జనం. నిజమెంతో, అబద్ధమెంతో? కుర్రసర్పంచి దోమా సీతా రాముడు మిడిమేలం! ఊళ్ళో సగంమంది ఆడవాళ్ళను వంటలవాడిలా రుచి చూసేశాడు. అలాంటివాడు నర్సమ్మను నంజుకోకుండా వుంటాడా? తిరుపతిలో చదువుకుంటోన్న లంకిపల్లోళ్ళ శీను, రాయపాటోళ్ళ సుబ్రమణ్యం వున్నారు వూళ్ళో. బ్రాందీషాపులూ, లాడ్జీలూ కొట్టినపిండి వాళ్ళకు. సెలవుల్లో వొచ్చినప్పుడల్లా నర్సమ్మ యింటిముట్టూ ఈగల్లా ముసురుతుంటారు. ఈ ఈగలు ఆ కూటిపైన వాలకుండా వుంటాయా?... ఈ సందేహాలన్నిటికీ తృప్తికరమైన సమాధానాలిచ్చాడు ఆంజనేయులు.

ఓ రోజు, "పెళ్ళివిషయం అడిగావా, లేదా?" అన్నాడు కంబయ్య నిష్ఠూరంగా.

"కోప్పడకు కంబయ్యా! అడిగాను. ఇష్టంగానే వున్నట్టుంది. ఈరోజు సరిగ్గా అర్థరాత్రికి నిన్ను యింటికి రమ్మంది. అన్ని సంగతులూ నీతోనే మాట్లాడాలిట!"

కంబయ్యగుండె గంతులేసింది. చీకటిపడేలోగా బస్తీకి వెళ్ళి పువ్వులూ పళ్ళూ తెచ్చుకున్నాడు. కాలం పిరికివాడిలా పరిగెత్తింది. రాత్రి రెండు జాములు గడిచాక మల్లీశ్వరి యింటివైపు నడిచాడు కంబయ్య. ఇన్నాళ్ళూ ఆంజీద్వారా రాయబారమేగానీ, ఒక్కనాడూ ఆమె యెదుటబడి మాట్లాడలేదు. ఇప్పుడతనికి బెరుగ్గావుంది.

రెండు మూడుసార్లు తలుపుతట్టిన తర్వాత "ఎవరూ?" అంటూ తలుపు తెరిచింది మల్లీశ్వరి. చీకట్లో నిలబడ్డ కంబయ్యను పరకాయించి చూసి, "నువ్వా కంబయ్యా? ఒంట్లో బాగాలేదా? లోపలికిరా!" అంది. బెదిరిపోయి, వెనక్కి వెళ్ళిపోదామనుకున్న కంబయ్య లోపలికే నడిచాడు. ఆమె లాంతరు వత్తి పెద్దదిచేస్తూ "కూర్చో!" అంది కంబయ్య స్టూలుమీద కూర్చుని పూలూ పళ్ళూ ఆమెకందించాడు. "ఎందుకివీ?" అందామె.

''ఆంజనేయులు చెప్పాడు...'' అంటూ నీళ్ళు నమిలాడు కంబయ్య.

''ఆంజనేయులు చెప్పాడా!...ఏమని?''

''అదే! నువ్వు రమ్మన్నావని!''

ఆ మాటకు ఆమె ఆశ్చర్యపోయింది. ఆ తరువాత నవ్వు కుంది. ''నేను చెప్పలేదే!'' అంది

కంబయ్య గొంతులో పచ్చివెలక్కాయ పడింది. ''పోనీ, ఆంజనేయులు నీతో ఏమీ చెప్పలేదా?'' అన్నాడు.

''ఏమీ చెప్పలేదే !''

''కంబయ్య చివాలున పైకిలేచాడు. ఆంజీ తనను అల్లరి పట్టించాడని అర్థమైపోయిందతనికి.

''లేచావెందుకూ? కూర్చో కంబయ్యా...ఆంజనేయులు చెప్పకపోతేనేం? ఎట్లూ నువ్వే వొచ్చావుగా ?''

అతను సందేహిస్తూ మళ్ళీ కూర్చున్నాడు.

''ఇక చెప్పు...''

''ఏం చెప్పమంటావ్?''

''అదే! ఆంజనేయులుతో ఏం చెప్పావో, అది.''

''నీకు కోపం రాదంటే...''

''పిచ్చి కంబయ్యా! నాకు ఎప్పుడూ కోపంరాదు. సరేనా?''

కంబయ్య ధైర్యంచేసి చెప్పేశాడు, ''నిన్ను పెళ్ళి చేసుకోవాలని వుంది.''

ఆ మాటవిన్న మల్లీశ్వరి నేలమీద నిలబడలేక చాపమీద కూర్చుండిపోయింది. రెండు నిమిషాలపాటు మాట్లాడలేదు. తల వంచుకుని ''కంబయ్యా! నన్ను గురించి నీకు బాగా తెలుసా?'' అని అడిగింది.

''తెలియకేం? అంతా తెలుసు!''

మల్లీశ్వరి వెంటనే వెక్కి వెక్కి ఏడ్చింది.

''కంబయ్యా! అన్నీ తెలిసే నన్ను పెళ్ళాడాలంటున్నావా?... నన్ను ప్రేమించానన్నవాడు మూడునెలలు నాతో కాపురం చేసి, పెళ్ళాడకుండానే వొదిలిపోయాడు. సంవత్సరంపాటు నాకు పనీ పాటా నేర్పిన డాక్టరు నాతో అవసరం లేదనుకున్నాక, మరోపిల్లను పెళ్ళాడి, నన్ను వొదిలించుకున్నాడు. అయినవాళ్ళకు ముఖం చూపలేక యిక్కడ తలదాచుకున్నాను. ఇందాకా యిక్కడే వుండివెళ్ళాడు ఆంజనేయులు. నన్ను పెళ్ళాడతానని అతనూ అనలేదు. దోమా సీతారామయ్య, లంకిపల్లి శీను, రాయపాటి సుబ్రమణ్యం అందరూ ఈ తీగను తొక్కి వెళ్ళారేగానీ, దీనికొక పందిరి వేద్దామనే పెద్ద మనసు చూపినవాళ్ళు ఒక్కరూలేరు. అందుకు నువ్వు సిద్ధపడు తున్నావు. నిన్నేమనాలి కంబయ్యా!...పిచ్చి పట్టిందనుకోవాలా?'' ఏడుపులోనే నవ్వింది మల్లీశ్వరి.

కాళ్ళకింద భూమి బద్దలైనట్లనిపించింది కంబయ్యకు. శక్తిహీనంగా లేచి వాకిలివైపు నడిచాడు. అయితే గుమ్మందగ్గర కాళ్ళు మొండికెత్తాయి. ఒకటి రెండు నిమిషాలు ఆలోచించి వెను దిరిగి మల్లీశ్వరివద్దకు వచ్చాడు. ఆమె తలమీద చెయ్యిపెట్టాడు. ''నర్సమ్మా! ఏడవకు! ... ఆధారంలేని ఈ తీగకు నేను పందిరి నౌతాను నా కూతురే నీ స్థితిలో వుందనుకో! దానికొక మొగుడు కావాలని కోరుకోనూ నేను? నువు నా కూతురు కాకపోయినంత మాత్రాన నీకు మొగుడు లేకుండా పోవాలా?...నిన్ను నేను పెళ్ళి చేసుకుంటా నర్సమ్మా!...నువ్వు సరేనంటేనే...''

మల్లీశ్వరికి గొంతు మూగబోయింది.

తరువాత రెండురోజులూ వాళ్ళిద్దరూ ఊళ్ళోలేరు.

అందరి ఊహాగానాలూ నిజమైనాయి. మూడోనాటి ఉదయం ఇద్దరూ రోడ్లో బస్సు దిగారన్న వార్త వాళ్ళకంటే ముందుగానే ఊళ్ళో అడుగుపెట్టింది. గర్వంగా తలెత్తుకున్న కంబయ్య ముందూ, పట్టుచీరతో పసుపుముద్దలావున్న మల్లీశ్వరి వెనకా, నడిచి వెళ్తుంటే—జనం అరుగుల మీదికెక్కి చూశారు. కంబయ్య యింట్లో కుడికాలు పెట్టింది మల్లీశ్వరి. వీధిలో సందడిమాత్రం తగ్గలేదు. ఇంటి ఎదుట—వీధికి అటువైపున చింతచెట్టుకింద గుమి గూడారు కుర్రకారంతా. వాళ్ళల్లో సర్పంచ్ దోమా సీతారామ చౌదరి, సింగిల్ టీచర్ ఆంజనేయులు, లంకిపల్లి శీను, రాయపాటి సుబ్రమణ్యం మొదలైనవాళ్ళు కూడా వున్నారు. ఆ గుంపులోనుంచి నవ్వులు, ఈలలు, పిల్లికూతలు, వెక్కిరింతలు!

ఒక్కనిమిషం తరవాత యింట్లోంచి బయటికొచ్చాడు కంబయ్య. ఇంటిముందర సగర్వంగా నిలబడ్డాడు. ఆ గుంపుకేసి సూటిగా చూశాడు. నేలమీద ఖాండ్రించి వుమ్మాడు. మీసం మెలి పెట్టుకున్నాడు. ''ఒరే! సిగ్గుందా మీకు? అసలు మీరు మనుషు లేనా?'' అన్నాడు. ఆమాటే చాలనుకున్నాడేమో, యింట్లోకి వెళ్ళి పోయాడు.

అంతమాట అనిపించుకున్న వాళ్ళందరూ యువకులే! ఇది సిగ్గు పడాల్సిన విషయం!

శ్రీ తిరుమల రామచంద్ర

# 'రసో వై సః' - ఉపనిషద్వాక్యం కావ్యరసానికి అన్వయించడం

కావ్యనాటకాది పఠన శ్రవణ దర్శన జనితమైన రసం— శృంగారాదికం భగవత్స్వరూపమని, తదానందం బ్రహ్మానంద సబ్రహ్మచారి అని, ఆలంకారికులు నిర్వచిస్తూ, దానికి ఉపబృంహకంగా తైత్తిరీ యోపనిషత్తు బ్రహ్మానందవల్లి సప్తమానువాకం లోని ''రసో వై సః, రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి'' అనే వాక్యాలు ఉదాహరిస్తుంటారు. కావ్యానందమే బ్రహ్మానందమూ, బ్రహ్మానంద సబ్రహ్మచారి అయితే, వేదాంత చర్చలూ, యోగానుష్ఠానాలూ, ఆత్మానుసంధానాలూ అవసరమే కావు. ఇదే సరైతే,

''అయం సరశనోత్కర్షీ
పీనస్తన విమర్దనః,
నాభ్యూరు జఘన స్పర్శీ
నీవీ విస్రంసనః కరః''

(అయ్యో ప్రియుడా మరణించావే! ఇది నీ చేయి. ఎలాంటిది? నా మొలనూలును లాగి, నా బలిసిన పాలిండ్లను నలిపి, నా పొక్కిలిని, తొడలను పొత్తికడుపును కలయతడుముతూ పోక ముడిని విప్పేది.)

అని ప్రియ మరణంతో దుఃఖించిన నాయిక విలాపంవల్ల కలిగిన కరుణాను ప్రాణిత శృంగారమూ బ్రహ్మానంద సదృశ మవుతుంది. స్తన జఘన విమర్ద వర్ణనవల్ల కలిగే రసానందం బ్రహ్మానంద సదృశమని, ఈ రసం బ్రహ్మమో, ఆత్మో అని అంటే. ఎందుకో నమ్మబుద్ధి పుట్టడంలేదు. ఇలా పోల్చడమూ, భావించడమూ గొప్ప పొరపాటనే అనిపిస్తుంది.

తైత్తరీయ బ్రహ్మానందవల్లి సప్తమానువాకంలోని ఆ భాగం ఉదాహరించి దాని ప్రసంగపౌర్వాపర్యాలు పరిశీలిద్దాం :

''అసద్వా ఇద మగ్ర ఆసీత్। తతో వై సదజాయత। తదాత్మానగ్ం స్వయ మకురుత। తస్మాత్తత్సుకృత ముచ్యత ఇతి। యద్వై తత్సుకృతం। రసో వై సః। రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి। కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందో నస్యాత్। ఏష హ్యేవానంద యాతి......''

ఇది ఈ అనువాకంలోని భాగం. దీని అర్థం ఇది :

''పూర్వం ఇది (జగత్తు) అసత్తుగా (అవ్యాకృత బ్రహ్మ రూపంగా) వుండినది. దానినుంచి సత్తు) నామరూపాత్మక వ్యక్తం) జనించింది. ఆ అసత్తు స్వయంగానే తనను (నామ రూపాత్మక జగద్రూపంలో) రచించుకున్నది. అందువల్ల అది సుకృతం (స్వయం రచితమైనది) అని వ్యవహృతమవుతున్నది. ఈ సుకృతం నిశ్చయంగా రసమే. ఈ రసాన్ని పొంది పురుషుడు ఆనంది అవుతున్నాడు. హృదయాకాశంలో ఈ ఆనందం (ఆనంద స్వరూపుడైన ఆత్మ) లేకపోతే, ఎవరు అపానక్రియను, ప్రాణక్రియను చేయగలరు? ఇదే వారిని ఆనందింపజేస్తున్నది...''

ఉపనిషద్వ్యాఖ్యాతలైన పెద్దలలో మొదటివారయిన శంకర భగవత్పాదులు ఈ వాక్యాలను ఎలా వ్యాఖ్యానించారో చూద్దాం.

''...తస్మా దస్తి తద్ బ్రహ్మ సుకృత ప్రసిద్ధేః। ఇతశ్చాస్తి। కుతః? రసత్వాత్। కుతో రసత్వ ప్రసిద్ధిః బ్రహ్మణః ఇత్యత ఆహ:—

''యద్వై తత్సుకృతమ్। రసో వై సః।రసోనామ తృప్తిహేతు రానందకరో మధురామ్లాదిః ప్రసిద్ధో లోకే। రసమేవాయం లబ్ధ్వా ప్రాప్యానందీ సుఖీభవతి। నాసతః ఆనంద హేతుత్వం దృష్టంలోకే। బాహ్యానంద సాధన రహితా అప్యనీహా నిరేషణా బ్రాహ్మణా బాహ్య రసలాభాదివసానందా దృశ్యంతే విద్వాంసః; నూనం బ్రహ్మైవ రసః తేషామ్। తస్మాదస్తి తత్తేషా మానంద కారణం రసవద్బ్రహ్మ।

''ఇతశ్చాస్తి. కుతః? ప్రాణనాది క్రియాదర్శనాత్। అయమపిహి పిండో జీవతః ప్రాణేన ప్రాణిత్య పానేనా పానితి। ఏవం వాయవీయా ఐంద్రియకశ్చ చేష్టాః సంహతైః కార్య కారణైః నిర్వర్త్యమానా దృశ్యంతే। తచ్చైకార్థ వృత్తిత్వేన సంహననం నాంతరేణ చేతని మసంహతం సంభవతి। అన్యత్రా దర్శనాత్।

''తదాహ – తద్యది ఏష ఆకాశే పరమే వ్యోమ్ని గుహాయాం నిహిత ఆనందో నస్యాత్ నభవేత్ కో హ్యేవ లోకే హ్యేవాన్యాదపాన చేష్టాం కుర్యా దిత్యర్థః। కః ప్రాణ్యాత్ప్రాణనం వా కుర్యా త్తస్మా దస్తి తద్ బ్రహ్మ యదర్థాః కార్య కరణ ప్రాణనాది చేష్టాః తత్కృత ఏవ చానందో లోకస్య।

''కుతః ? ఏష హ్యేవ సర ఆత్మా ఆనందయా త్యానంద యతి సుఖయతి లోకం ధర్మాను రూపం। స ఏవాత్మా ఆనంద రూపోఽవిద్యయా పరిచ్ఛిన్నో విభావ్యతే ప్రాణిభి రిత్యర్థః।...''

[తైత్తిరీయ శంకర భాష్యం 175–177,] గీతా ప్రెస్, గోరఖ్‌పూర్.]

దీని వివరణ కూడా తెలుగులో ఇవ్వడం న్యాయం.

"...అందువల్ల ఆ సుకృత రూప ప్రసిద్ధి సత్త్వాల్ల అది బ్రహ్మ అని సిద్ధమవుతున్నది. బ్రహ్మ ఇందువలన కూడ అవుతున్నది. ఎందువల్ల? రస స్వరూపం కావడంవల్ల బ్రహ్మకు రస స్వరూప ప్రసిద్ధి ఏ కారణం వలన — దీనికి శ్రుతి యిలా అంటున్నది :

"ప్రసిద్ధ సుకృతమైనదంతా నిశ్చయంగా రసమే. పులుపు, తీపు అనే తృప్తి దాయకం ఆనందకరం అయిన పదార్థం లోకంలో రసమని ప్రసిద్ధం. ఈ రసాన్నిపొంది పురుషుడు, ఆనంది, అర్థాత్ సుఖి అవుతున్నాడు. లోకంలో ఆ సత్ పదార్థం ఆనందహేతువుగా కనిపించదు. బ్రహ్మనిష్ఠులు, నిరీహులు, నిరపేక్షులు అయిన విద్వాంసులు బాహ్య సుఖ సాధన రహితులయినా, బాహ్య రసలాభంతో ఆనందితులయిన వారివలె ఆనందితు లయినట్లు కనిపిస్తారు. నిశ్చయంగా వారి రసం బ్రహ్మ. అందువల్ల రసానికి సమానంగా వారికి ఆనంద కారణమయినది బ్రహ్మ.

"ఇందువలనకూడా ఇది బ్రహ్మ. ఎందువలన? ప్రాణనాది క్రియను చూడడంవల్ల. జీవించినవాని పిండం కూడ ప్రాణ సహాయంతో ప్రాణన క్రియ జరుపుతున్నది, అపానవాయు ద్వారా అపాన క్రియ జరుపుతున్నది. ఈ విధంగా సంఘాతం పొందిన ఈ శరీరేంద్రియ చేష్టలు, వాయవీయ చేష్టలు నిర్వర్తింపబడుతుండడం చూస్తున్నాము. ఈ వాయ్వాది అచేతన పదార్థాల ఏకైకోద్దేశ సిద్ధికోసం పరస్పరం సంహతం (అనుకూలం) కావడం ఏదో అసంహతమైన (దేనితోనూ చేరని) చేతనం లేనిదే సాధ్యంకాదు; ఎందుకంటే, ఇలాటిది మరెక్కడా చూడలేదు గనుక.

"దీనినే శ్రుతి ఇలా చెబుతున్నది : ఆకాశంలో పరమాకాశంలో అర్థాత్ బుద్ధిరూప గుహలో మరుగైన ఈ ఆనందం లేకపోతే లోకంలో ఎవరు అపానక్రియ చేయగలరు? ప్రాణనక్రియ చేయగలరు? అందువల్ల అది బ్రహ్మమే. దీనివల్లనే శరీరేంద్రియాల ప్రాణనాది చేష్టలు జరుగుతున్నవి; లోకానందం కూడా తత్కారణమే.

"ఇది ఎందుకు? ఎందుకంటే, ఈ పరమాత్మే లోకాన్ని దాని ధర్మానుసారం ఆనందింప జేస్తున్నది; సుఖమయం చేస్తున్నది. దీని అంతర్య మేమిటంటే, ఆనందరూపి అయిన ఆత్మనే ప్రాణులు అవిద్యాపరిచ్ఛిన్నంగా భావిస్తున్నాయి..."

దీనివల్ల 'రసో వైసః' వాక్యంలోని రసం ఆత్మ తప్ప వేరొకటి కాదని స్పష్టం కదా!

అభినవ గుప్తాచార్యులు కావ్యరసం బ్రహ్మానంద రసంలోని తుంపర వంటిదిగా అవభాసించేదే కాని, బ్రహ్మానంద సబ్రహ్మచారి కాదని ధ్వన్యాలోకంలోని "యా వ్యాపారవతి" శ్లోక వివరణలో ఇలా అన్నారు :

"...సకల ప్రమాణ పరినిశ్చిత దృష్టాదృష్ట విషయ విశేషజం యత్సుఖం, యదపివాలోకోత్తరం రస చర్వణాత్మకం తత ఉభయోపి పరమేశ్వర విశ్రాంత్యానందః ప్రకృష్యతే, తదానంద విప్రుణ్మాత్రా వభాసో రసాస్వాద ఇత్యుక్తం ప్రాగస్మాభిః। లౌకికంతు సుఖం తతోపి నికృష్ట ప్రాయం బహుతర దుఃఖానుషంగా దితి తాత్పర్యమ్।"

[ధ్వన్యాలోకలోచనం, తృతీయోద్యోతమ్]

"సకల శాస్త్రాలూ నిరూపించే ఐహికాముష్మిక విషయ విశేషజన్యమైన సుఖంకన్నా, లోకోత్తరమైన రసచర్వణాత్మకమైన సుఖానికన్నా ప్రకృష్టమైంది పరమేశ్వర విశ్రాంత్యానందం — పరమేశ్వరునిలో ఐక్యమయ్యే ఆనందం. ఆ ఆనందకణ మాత్రావ భాసమైనది రసా స్వాదనమని ఇంతకుముందు మేము అన్నాము. లౌకిక సుఖమయితే బహుతర దుఃఖ సంబంధంవలన అంతకన్నా నికృష్ట ప్రాయమని తాత్పర్యం."

ఈ వాక్యాలనుబట్టి అభినవ గుప్తాచార్యుల మతంలో రస చర్వణాత్మకమైన సుఖం లౌకిక సుఖంకన్నా ఒకమెట్టు ఎక్కువే గాని, పరమేశ్వర విశ్రాంత్యానంద సదృశం ఎంత మాత్రమూ కాదు.

కావ్యానందాన్ని గురించి అభినవ గుప్తులు యింత తెగవేసి చెప్పినా, జగన్నాథ పండితులు 'రసో వైసః'ను కావ్య రసానికి అన్వయించడమేకాక అభినవ గుప్తాచార్యులమతమూ ఇదేనని అనడం ఆశ్చర్యం కలిగిస్తుంది. అభినవ గుప్తుల మతాన్ని అపార్థం చేసుకొన్నాడా జగన్నాథ పండితులు? ఆయన వాద సరళిని చూస్తే అపార్థం చేసుకొన్నట్లు కాక, తనవాదానికి అనుకూలంగా లాగినట్లే కనిపిస్తుంది.

"అథాస్యాం సుఖాం శఖానే కిం మానమితి చేత్ సమాధావపి తద్భావే కిం మాన మితి పర్యను యోగస్య తుల్య త్వాత్।

సుఖమా త్యంతి కం యత్తత్
బుద్ధి గ్రాహ్య మతీంద్రియమ్,
వేత్తి యత్ర న చైవాయమ్
స్థితః చలతి తత్త్వ తః (గీత - 6–20.)

ఇత్యాదిః శబ్దోస్తి తత్రమాన మితిచేత్, అస్త్యత్రాపి రసోవైసః రసగ్గ్ హ్యే వాయం లబ్ధ్వా నందీ భవతి ఇతి శ్రుతిః, సకల సహృదయ పక్షం చేతి ప్రమాణద్వయమ్। యేయం ద్వితీయ పక్షే తదాకార చిత్త వృత్త్యాత్మికా రస చర్వణోపన్యస్తా సా శబ్ద వ్యాపార భావ్యత్వా చ్ఛాబ్దీ। అపరోక్ష సుఖాలంబన త్వా చ్చా పరోక్షాత్మికా। తత్త్వం వాక్యజ బుద్ధివత్। ఇత్యాహు రభినవ గుప్తాచార్యాః"

[రస గంగాధరః — 25–27 కావ్యమాల, బొంబాయి — 1939]

"[శంక] మరిచర్వణకు సుఖాంశ భానమున్న యేమి ప్రమాణము?

[సమా] సమాధియందు యోగికి కలుగు ప్రతీతి సుఖాత్మక మన నేమి ప్రమాణము? అని మేము ప్రతి ప్రశ్న చేయుదుము.

సహృదయుల యొక్కయు యోగీశ్వరుల యొక్కయు అనుభవమే ప్రమాణము. ఇంకొక ప్రమాణము ఉభయత్ర సాధ్యము కాదు.

యత్రోభయో స్సమోదోషః
పరిహారోఽపి తాదృశః,
నైకః పర్యను యోక్తవ్యః
తాదృ గర్థ విచారణే

అని నియమము. ఏ విషయమున వాద ప్రతివాదులకు దోష పరిహారములు సమానములో, అట్టి అర్థ విచారముపట్ల ఒకడు ఇంకొకరిని ప్రశ్నింపరాదు. ఉభయులు మిన్నకుండుట పాడి.

[శంక]సమాధి ప్రతీతికి సుఖాంశమున్నదను మాకు స్మృతి ప్రమాణము కలదు ఎట్లన ?

సుఖ మాత్యంతికం యత్తద్
బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్
వేత్తి యత్ర న చైవాయం
స్థితః చలతి తత్త్వతః (గీత, 6–21.)

అనంతమగు సుఖమేది కలదో అది ఇంద్రియ నిరపేక్షము. కేవల బుద్ధిగ్రాహ్యము (కేవలబుద్ధి భాసకము) అగును. అవిషయ జనిత మగునట్టి సుఖమును సమాధి యందు ఎవ డనుభవించు చున్నాడో వాడు జ్ఞాని, ఆత్మ స్వరూపము నందు నిలిచినవాడు. కావుననే అతడు తాత్త్విక రూపము నుండి చలింపడు అనిభావము.

[సమా] రస చర్వణ యందును సుఖాంశ భానము కలదను మాకు గరీయః ప్రమాణము శ్రుతి ప్రమాణము కలదు.

(1) రసోవైసః, (2) రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి :— అని [తైత్తిరీయోపనిషత్తు] నిశ్చయముగా ఆ సచ్చిదానంద స్వరూపుడు ఆత్మరసము. ఆ యాత్మ రసమును పొంది ప్రమాత ఆస్వాద్యుడే—పరమానంద స్వరూపుడే—యగును. నిజము—అనిశ్రుత్యర్థము. కావ్యరసా స్వాదనమందు నాటకము చూచునట్టి కాని, శ్రవ్య కావ్యమును వినునట్టికాని సకల సహృదయులయొక్క ప్రత్యక్షానుభవము ప్రమాణము. అట్లే సమాధియందు ఆత్మ సాక్షాత్కార మొందు యోగీశ్వరుని యపరోక్షానుభవము ప్రమాణము. ఇట్లు ఉభయులకు ప్రమాణము కలదనుట తుల్యము. ఇది ప్రథమ పక్షానుసారము.

ద్వితీయ పక్షమందు రసచర్వణ ఏది చెప్పబడెనో, అది ఆనందాకార చిత్తవృత్తి. అది శబ్దవ్యాపారమగు వ్యంజనా వ్యాపార మగుటంజేసి, శాబ్ది (శబ్దబోధ రూపము). వెండియు అపరోక్ష విషయీభూతము ఏ యానందము కలదో అది ఆత్మరూపము. అది ఈ చర్వణకు ఆలంబము (విషయము) అగుటప్రత్యక్ష రూపము.

[శంక] శాబ్దికత్వము, అపరోక్షత్వము ఎట్లు సరిపడును? నైయాయికమతము ఒప్పదే.

[సమా] పోనీ, నైయాయికులు ఒప్పరుగాక! వేదాంతులు ఒప్పుదురు. తత్త్వమసి అను శ్రుతివాక్యముచే జీవబ్రహ్మైక్య ప్రతీతి కలుగునప్పుడు అది అపరోక్షమును, శాబ్దముఐన జ్ఞానముగ నంగీకృతము. అట్లే సాహిత్య శాస్త్రమునందును రస చర్వణము శబ్దమును అపరోక్షమునైన జ్ఞానమని యెఱుక.

ఈ పై జెప్పినది అభినవగుప్తాచార్యపాదుల మతము. ఇది సిద్ధాంతము.

[శ్రీ ధరణికోట వెంకటసుబ్బయ్య అనువాదం. పుటలు : 113–115].

జగన్నాథ పండితులు అభినవగుప్తుల ఆశయాన్ని అపార్థం చేసుకొన్నారని తోస్తుంది. ఈ శంకే శ్రీ జె.ఎల్. మాసన్, ఎం.వి, పటోవర్ధన్‌లకూ కలిగింది వారు ఇలా అన్నారు :

"రసోవైసః। రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వా నందీభవతి Actually however this scriptual statement refers to the Atman and not to aesthetic experience. The proper meaning of the statement is; 'That (Atman) is surly (Nai) Rasa (Joy or Bliss). Having realised the (Atman which is) Rasa (Bliss) he becomes happy or. Blissful? In the fist part of the quotation it is said that having realised that Atman which is Rasa rupa or Anandarupa he ic, the spirutual aspiramt (Sadhaka) becomes supremely happy (Anandi Bhavathi). But Jagannath seems to have understood both parts of the quatation as referring to Rasa to Poetry or Drama ic as referring to acsthetic experience. He understood the second part to mean: "having realised Rasa, ie. the emoti- onal flavour, he (ie. the sahridaya or Samajika) becomes supremely happy. But we doubt very much if the quotation from the Upanishad is capable of such are interpretation."

[Santarasa and Abhinavaguptas Phisosophy of Aesthetics pp 177 1969 BORI]

బ్రహ్మానంద స్వరూపాన్ని బ్రహ్మానందవల్లి అష్టమానువాకంలో వివరించింది. ఆ ఆనందాల పరంపరలో మానుషానందం అట్టడుగుది. అలాంటప్పుడు కావ్యానందాన్ని ఆనందాలకు శిఖరమైన బ్రహ్మానందంతో పోల్చడం ఉచితం కాదనిపిస్తుంది. దీని ఔదాత్య నౌచిత్యాలకు సహృదయ విమర్శకులే గీటురాయి.

డాక్టర్ నాయని కృష్ణకుమారి

# చీమలు

చీమలు చిన్నవే. బలవంతుడైన మనిషిముందు ఎంతో అల్పమైనవి. చీమల ఎర్రదనంలో అరిభీకరత్వం ఉంది. వాటి సంఘీభావంలో గుండెల్ని చీల్చే శత్రు శక్తి నిగూఢంగా ఉంది. అవతల ప్రాణి అయోమయ దశలో ఉన్నంతవరకూ వాటి ముట్టడికి తిరుగు లేదు.

ముప్పై ఎనిమిదేళ్ళ మురళీధరం ముందుకు సాగిపోతున్న చీమల బారును చూస్తున్నాడు. మత్తుగా వాలిపోతున్న రెప్పల్ని అతి ప్రయత్నంమీద పైకి లాక్కుంటున్నాడు. కళ్ళముందు మసక తెర. ఒక్కో చీమ వెయ్యి చీమల్లాగా బూదర బూదరగా అలుక్కుపోయి, ఆ చీమలన్నీ సముద్రంలాగా కనిపిస్తున్నయ్. తరంగాలు తరంగాలుగా మారి అవి తన్ను ముంచేస్తున్నట్లు సన్నని జలదరింపు. మురళీధరం అరచేతులు భయంవల్ల చల్లబడ్డాయి.

ఎదురుగా బల్లమీద కనిపించే నాటు సారాయి సీసా మెరుస్తోంది. చెవుల్లో హోరు! శరీరం అనుభవించే అయోమయపు సుఖంతో మనస్సు రాజీపడడంలేదు. గుండె బరువుగా ఏవేవో దిక్కుమాలిన విషయాలతో కొట్టుకులాడుతోంది. తనకే అర్థంకాని అయోమయంలో పడి తానీ జీవితం గడపడం ఏమిటి?

మురళి బలవంతాన రెప్పల్ని పైకెత్తి చీమల్ని చూడడానికి ప్రయత్నించాడు. ఎదురుగాఉన్న బల్ల రెండు బల్లల్లాగా కనపడుతోంది. బల్లచుట్టూ ఆమ్లెట్ తునకలు పడి నానా కంగాళీగా ఉంది. ఒక పెద్ద తునకను లాక్కుపోయే ప్రయత్నంలో ఉన్నయ్ చీమలన్నీ. అవి ఎర్ర చీమలు. ఇంత కూడా సందులేకుండా ఆ తునకను పూర్తిగా కమ్ముకోవడంచేత అది ఎర్రని గుండుసూదులు గుచ్చిన బంతిలాగా తమాషాగా ఉంది. చీమలన్నీ ఎటు లాగితే అటు కదులుతూ, విధి చేతులో మనిషి బొమ్మలాగా ఉందది. మురళి దృష్టి సరిగా నిలవడం లేదుగాని, మెదడునిండా గతానికి సంబంధించిన ఆలోచనలు!

కాలేజీలో చదివే రోజుల్లో మంచి చురుకైనవాడు మురళీధరం. ఆటల్లో, చదువులో, అన్నిటా నేనే సుమా అన్నట్లుండేవాడు. నవ్వుతూ నవ్విస్తూ గలగలా తిరిగే ఆ అబ్బాయికి ఇంట్లో పిల్లలంతా భయపడేవాళ్ళు. ''అదుగో చిన్నాయన వొస్తున్నాడు'' అంటూ మురళి అన్న భార్య పిల్లల్ని అదుపులో పెడుతుండేది. అన్నకు తమ్ముడంటే ఎంతో గురి. సెలవుల్లో ఇంటికి వస్తే అన్న పిల్లల్ని వెంటేసుకుని ఊరి బయట దిగుడు బావిలో ఈతలు నేర్పేవాడు. ఇంట్లో లైటు పోయినా, ఫాను చెడిపోయినా, రేడియో పలక్కపోయినా చుట్టుపక్కల వాళ్ళందరికీ మురళీధరం కావలసిందే. పిల్లలకు చదువు చెప్పడం మురళికో ఆట. చిన్నాయన కళ్ళతో బెదిరిస్తే ఎంత రాని లెక్కయినా వాళ్ళకు టపీమని వచ్చికూర్చునేది. ఉబ్బరంగా ఒంటేలుకు పోవలసి వచ్చినా ఆపుకునేవాళ్ళేగాని మురళికి వేలు చూపించడానికి భయపడేవాళ్ళు.

''అటువంటి మురళినేనా నేను? ఏమిటో ''పేడతట్టలో పురుగులాగా'' ఇట్లా బతికేస్తున్నాను. మనుషులూ సంఘటనలూ అన్నీ చీమలై నన్ను ముట్టడిస్తున్నయ్. వీటికి లొంగుతున్నాను నేను. ఇవి నన్ను ముక్కలు ముక్కలుచేసి కలుగుల్లోకి ఈడ్చుకు పోతున్నయ్. నేను ప్రతిఘటించాలి. ప్రతిఘటించితీరాలి''—ఉద్రేకంగా అనుకోసాగాడు మురళి. చుట్టూ ఉన్న ప్రపంచమంతా ఉయ్యాల ఊగుతున్నట్లుగా ఉంది. ఉక్కిరి బిక్కిరిగా నవ్వుతూ విపరీతంగా కుదిలిపోతోంది.

మురళీధరం పశువైద్యంలో డిగ్రీ సంపాదించగానే ఉద్యోగం అతణ్ణి వెతుక్కుంటూ వచ్చింది. పట్నానికి దూరంగా ఓ నది ఒడ్డున పుణ్యక్షేత్రంలో పశువుల డాక్టరుగా ఉద్యోగ జీవితం మొదలు పెట్టాడు. కోట్లాది భక్తులకు మనశ్శాంతిని ప్రసాదించే ఆ దైవక్షేత్రం తన జీవితాన్ని మరో దారిన నడవమని శాసించింది. కాదు. క్షేత్రమేం చేసింది పాపం! ఉత్తరాయిలాగా ఏళ్ళ తరబడీ చలనం లేకుండా నిలిచిపోయిన దైవమేం చేశాడు?

తన్ను శాసించిన వాళ్ళు వేరు. తనతో పోలిస్తే క్షుద్రులు. ఉత్త చీమల్లాంటి వాళ్ళు. వాళ్ళు జ్ఞాపకానికి తగలగానే, అంత మత్తులో కూడా మురళి శరీరం ఒణికిపోసాగింది. పైన పాలనవ్వులు ఒలకబోసే నియాన్ లైటు మసకబారిపోసాగింది. ఆ మసక తెరల్లో ఎదురుగా నల్లగా చెయ్యెత్తు మనిషి నీలయ్య పగలబడి నవ్వుతున్నాడు. వాడు నవ్వుతుంటే పళ్ళు తెల్లగా మెరిసినా ఆ తెల్లదనం వెనక నల్లగా అన్నీ కపటత్వపు నీడలు. ''నీలయ్యా! నువ్వా ఎన్నీ గతికి తెచ్చింది. ఉత్త చీమలాంటి వాడివి! అయినా నీ లాటి చీమలు గుంపులుగుంపులుగా చేరితే బలవంతమైన సర్పం కూడా లొంగిపోవలసిందే. నీకు లొంగిపోయాను ఉత్త చీమల పాల పడిపోయాను!'' అనుకున్నాడు మురళి.

''నేన్లేనా సార్! నీలయ్యను జ్ఞాపకం పెట్టుకున్నావు. మరి నన్ను'' అంటూ ఎదురుగా నిల్చున్నాడు సంగడు.

వాడూ నవ్వుతున్నాడు. గారగట్టి ఎర్రగా మెరిసే పళ్ళన్నీ బయటపెట్టి నవ్వుతున్నాడు. ఎర్రచీమలు గుండ్రంగా గుంపుకట్టినట్లు ఎర్రజీరలతో భయంకరంగా కనిపించే కళ్ళువాడివి. వాడి చుట్టూరాసి, దుబారా, చప్టీలు, కల్లు గురిగెలు గిరగిరా తిరుగుతున్నయ్. మురళికి కంపరమెత్తిపోతోంది. భయంతోనూ, అసహ్యంతోనూ ఒళ్ళు తూలిపోతోంది. లేచి నిల్చుంటే పడేటట్లున్నాడు.

ఈ అల్పులంతా తన చుట్టూ చేరారు. తనను పీక్కుతింటున్నారు. వీళ్ళను ఒదిలించుకోవాలి. ఎట్లా? ఎట్లా?--

సంగయ్య ఆ ఊళ్ళో సారాకొట్టు యజమాని. నీలయ్యకు ఆరో ప్రాణం. సారాకొట్లను ప్రతియేడూ పాట పాడతారు. పాట ఎవరెక్కువ పాడితే వాడే ఆ సంవత్సరం సారా వ్యాపారం చేసుకో వచ్చు. సంగయ్య ఎప్పుడు హెచ్చుపాట పాడేవాడే. నల్లగా పోత పోసిన విగ్రహంలాంటి సంగయ్య తుట్టె పెదాలతో, దుబ్బుగా పెరిగిన కను బొమల్తో చూడగానే జంకుపుట్టిస్తాడు. రాజవేషం గనుక తగిలిస్తే, వాడు ప్రాచీన రాజవంశాలకు చెందిన ఏ ద్రావిడ మహా రాజులాగానో రక్తికట్టిస్తాడు. కల్లుదుకాణంలో నాపరాయి పరిచిన ఎత్తైన దిమ్మమీద కూచుని చుట్టూ పెద పెద్ద కల్లు బానలతో వ్యాపారంచేసేవాడు మకుటంలేని మహారాజే.

సంగడికి సారా వ్యాపారంతోపాటు పాడి పశువులు కూడా ఉండేవి. పాలనూ, సారానూ సమానంగా ఆదరించే ఈ దేశంలో వాడి వ్యాపారాలు రెండింటికీ నష్టం లేదు. పశువులకు దొమ్మరోగం తగిలో, ఉంగిడి వచ్చో, పొట్ట ఉబ్బో, అవస్థలు ప్రాప్తించి నప్పు డల్లా సంగడికి మురళీధరం గోపాలకృష్ణుళ్లా కనిపించేవాడు.

మురళి హస్తవాసి మంచిది. జబ్బుగాఉన్న పశువు తన ముందుంటే ఇది ధనవంతుడిదా బీదవాడిదా అన్న ఆలోచన వచ్చేది కాదు. దీని బాధను ఎంత తొందరగా పోగొట్టగలనా అని తహ తహ లాడేవాడు. జబ్బుగా ఉన్న పశువుల కళ్ళల్లో భాషను చదవ గలిగితే అవి, ''మురళి మా అమ్మ! మురళి మా కన్నతల్లి'' -- అంటాయనడంలో సందేహం లేదు.

''అందుకే సార్! నువ్వంటే నాకు దేవుడితో సమానం. ఆ నీలిగాడి మాటలిని, నీ మనసు సమాధాన పడ్తాదని నీకు సారా దాగడం మప్పినాను! నిన్ను పూర్తిగా ముంచేసినాను సార్--'' ఎదురుగ్గా సంగడి బొమ్మలో ఏడుపు ముంచుకొస్తోంది.

''అవున్లే. నీ తప్పేముంది? కల్లుసీసా కళ్ళబడితే తప్ప నిలవలేని స్థితికి నన్ను నువ్వు రమ్మన్నావా? -- నేనే ఆ ఊబిలో దిగిపోయాను. కాదు, సంగయ్యా! ఆ షేర్‌ఖాన్‌తో షరీకై నీలయ్యే నన్నీ ఊబిలోకి దించేశాడు.''--మురళి మెదళ్ళో ఆలోచనల దారాలన్నీ చిక్కుబడి గజిబిజిగా తయారయినయ్. అన్నీ ఒక కొలిక్కిరాని గతకాలపు భావనలు

పశువుల వైద్యుడికి వైద్యంతోపాటు మరో బాధ్యత కూడా ఉంది. అది కబేలాకు తోల్కొచ్చే పశువుల్లో దేన్ని కొయ్యచ్చో దేన్ని కూడదో చెప్పేబాధ్యత. మురళి అధికారముద్ర లేకపోతే మనుష్యులు తినే అర్హత ఆ పశువుల కుండదు. ఈ సందర్భంలోనే షేర్‌ఖాన్ మురళి జీవితంలో ప్రవేశించాడు.

షేర్‌ఖాన్ పేరులో కనిపించే పెద్దపులితనం వాడి బతుకులో అణువణువునా ఉంది. ప్రతి కదలికలో పులిసుమా అనే జంకును ఎదుటివాడిలో కలిగించే శక్తి ఉంది వాడికి. వాడికీ లోకమంతా పెద్ద కబేలా. అందులో తనకు నచ్చని వాళ్ళు పశువులు. తాను మెచ్చినవాళ్లు అట్లాంటి పశువుల్ని మాంసం పోగుల కింద మార్చి డబ్బు చేసుకునే చతురులు. డబ్బంటే ఏమిటో షేర్‌ఖానుకు బాగా తెలుసు. ఒక పులి మేక గొంతు కొరికి చవిచూచే రక్తం లాంటిది డబ్బు. వెచ్చగా, చిక్కగా ఘాటుగా ఎన్నో సదుపాయాలను వెగటు పుట్టించేదాకా అందించేదే డబ్బు. ఆ వెగటుదనంలో ఉండే చిత్ర మైన సుఖంకోసం వాడేమైనా చేస్తాడు. దాన్ని సాధించడానికి మొత్తం లోకాన్ని తనకత్తికింద మెడపెట్టిన మేకలాగా చూస్తాడు

అయితే షేర్‌ఖాన్‌లో ఉన్న ఈ పులితనం మురళీధరం మనసు కెక్కనేలేదు.

ఒక రోజున, ''ఏవిటోయ్ ఖానూ! ఎవరీ జీవాల్ని నీకు అంటగట్టింది? వీటికి రోగం ఉంది. ఇవి కొయ్యడానికి పనికి రావు'' అంటూ తన పరిక్ష పూర్తి చేశాడు మురళి.

''ఏం చేస్తాం బాబుగారూ! మనుషులకే తిండి దొరకని రోజుల్లో పశువులకు జబ్బుగాక మరే వుంటుంది? మీరేదో ఆ ముద్ర గొట్టేయండి. మీ ఋణం ఉంచుకునే వాణ్ణిగాను'' అన్నాడు షేర్‌ఖాన్.

మురళికి చర్రున మండింది. వీడు తనకే ధర్మపన్నాలు చెప్తున్నాడా? లేక శాసిస్తున్నాడా? ''ఏవిటయ్యా నీ ఉద్దేశం? నేను ప్రభుత్వం చేతికింది ఉద్యోగినా, కాక నీకింద పనిచేస్తున్నానా? పశువు బాగుందీ లేందీ చెప్పేది నేను. నేను చెప్పాకే నువ్వు కోసేదీ అమ్మేదీ!'' అన్నాడు.

ఒక్క క్షణంలో సగంసేపు దిమ్మర పోయాడు ఖాను. ఇన్నాళ్ళకో మొనగాడు పుట్టాడన్న మాట. అహంకారాన్ని అతి ప్రయత్నంమీద అణిచేశాడు. చేతులు పిసుక్కుంటూ మొహం దీనంగా పెట్టుకుని బతిమాలి చూచాడు. కాని మురళీధరం మొండి. ఆ వేళ కబేలాకు తెచ్చిన పశువుల ఆయుర్దాయం పొడిగించబడ్డది. షేర్‌ఖాన్ గుండె ఉప్పెననాటి సముద్రంలా ఘూర్ణిల్లిపోయింది.

ఇదుగో, ఇక్కడ మొదలైందండీ చీమల సంఘీ భావంలోని బలం!

బారులుకట్టి ముందుకు సాగే చీమల్ని గమనించారా? ఎదురుగా ఒక చీమ వస్తూ బారులో చీమల్ని ముక్కూ ముక్కూ మోటించి రహస్యం చెప్పుకుంటూ పోతుంది. అంతే. అన్నీ ఆ సమాచారాన్ని అక్షరాలా అమలు పరుస్తాయి. ఎక్కడో ఉన్న పెద్ద జీవాల్ని చుట్టుముట్టి లొంగదీసుకుని మోసుకొచ్చేస్తాయి. ముక్కు మోటించిన చీమ మళ్ళీ ఈ బారులో కలవదు. అది కావలసినప్పుడు హంగు చేస్తుంది. పైనుంచి పెత్తనం చేస్తుంది. మురళీధరాన్ని లొంగదీసుకోవడంలో షేర్‌ఖాన్ చేసిందీ అంతే.

నీలయ్య షేర్‌ఖానూ మంచి స్నేహితులు. షేర్‌ఖాన్ను కాదని ఆ ఊళ్ళో నీలయ్య బతకలేడు. ఆ మాటకొస్తే ఎవరూ బతకలేరు.

నీలయ్య బతక నేర్చినవాడు. తన అవసరాలు తీర్చుకోడానికి పెద్దవాళ్ళ దగ్గర అతి వినయాన్ని చూపించినట్లే, చిన్నవాళ్ళ

దగ్గర జబర్దస్తీతనం అంతకు రెండు రెట్లు చూపిస్తాడు. వాడి చేతులో కత్తె ఉంటే, దానికి రెండు వేపులా పదునుంటుంది. అవడానికి కాంపౌండరయినా మురళి దగ్గర ప్యూనులాగా పనిచేసేవాడు నీలయ్య. ఆ సేవాభావంతోటే మురళి దగ్గర్నుంచి బోలెడంత నమ్మకాన్ని కొనుక్కున్నాడు.

సమ సమాజ భావం మురళి శరీరంలో సహజంగా రక్తం లాగా ప్రవహిస్తుండేది. అతను నీలయ్య భుజంమీద చెయ్యేసుకుని బజార్లలో బాహాటంగా తిరిగేవాడు. నీలయ్య మీదున్న నమ్మకం మురళీధరాన్ని చాలా దూరం తీసుకెళ్ళింది.

ఆసుపత్రి నిండా ఖరీదయిన మందులూ, శస్త్ర సాధనలూ ఉండేవి. వాటి వాడుకవివరాలు తెలియజేసే రిజిస్టరులో ప్రతిరోజూ ఆఫీసు మూసేవేళకు మురళి సంతకం చెయ్యాలి. వాటిని భద్రంగా బీరువాల్లో బిగించి తాళాలు మురళి జాగ్రత్త చేసుకోవాలి. అయినా నీలయ్య రిజిస్టరుతెస్తే వివరాలు చూచుకోకుండానే సంతకం పెట్టేవాడు. తాళాలు ఒక్కొక్కసారి నీలయ్య దగ్గరే ఉండేవి.

మురళి ఎదురుగా ఉన్న సీసాలన్నీ ఖాళీ అయిపోయాయి. బుర్రలో ఎన్నో రంగులు మిణుగురుల్లా ఎగురుతూ మాయమౌతూ యాతన పెడుతున్నాయి.

"నువ్వురా నీలయ్యా మొనగాడి వంటే! నా సర్వీసులో ఒడుదుడుకులు తెచ్చావ్. అందరి ముందూ నన్ను అపరాధిలాగా నిలబెట్టేశావ్. 'మనసుకు సమాధాన మౌతుంది సార్' అంటూ నన్ను తాగుబోతుని చేశావ్. చివరకు రామిరెడ్డి హత్యలో నన్ను ఇరికించాలని చూశావ్. పాపం! రామిరెడ్డి!"

మురళి బుర్ర అడ్డదిడ్డమైన ఊహల్ని పట్టుకుని అలగం తిరగడం మొదలు పెట్టింది.

నిజానికి గోకి రెడ్డిని గురించి చెప్తే కానీ నీలయ్య ఎంత దుష్టుడో తెలియదు.

ఆ ఊళ్లో పశువుల ఆస్పత్రీ, పంచాయతీ ఆఫీసూ ఒకే బిల్డింగ్‌లో ఉన్నయ్. రెండింటికీ ప్రవేశద్వారం ఒకటే. రామిరెడ్డి ఆ ఊరి సర్పంచ్. పేరునుబట్టి అతణ్ణి రాముడే అనుకోవడానికి వీలులేదు. ఆ రాముడికి రాజకీయాల కిటుకులు తెలీక సవత్తల్లి అడవులకు పొమ్మంటే తానొక్కడే కాకుండా పెళ్ళాన్నీ, తమ్ముణ్ణీ వెంటేసుకుని మరీ వెళ్ళిపోయాడు. ఈ రామిరెడ్డి రాజకీయాల్లో ఆరితేరిన దిట్ట. ఎత్తుకు పై ఎత్తులువేసి ఎప్పుడూ తన కుర్చీకి అతుక్కుపోయే విద్యను కుణ్ణంగా నేర్చుకున్నాడు. అందుకే ఆ ఊళ్లో చాలా మందికి అతగాడు నచ్చేవాడు కాదు. ఎందరో కప్పబోతు మనుషుల్ని శత్రువులుగా సంపాదించుకున్నాడు.

ఒకరోజు పంచాయతీ ఆఫీసులో బల్లముందు కూచున్న రెడ్డిని ఎవరో చంపేశారు. అందుకు వాళ్ళు వాడిన ఆయుధం పశువుల ఆస్పత్రికి చెందిన స్కాల్‌పెల్.

"ఒరే నీలయ్యా! తన కుర్చీ తప్ప మరోటి పట్టించుకోని రెడ్డి నిన్నేం చేశాడు? హంతకుల చేతుల్లోకి మన ఆస్పత్రి స్కాల్‌పెల్ ఎలా వెళ్ళిందిరా?—మందమైన పశువుల చర్మాన్ని కోసేదానికి మనిషిగుండె ఒక లెక్కా! — దీనికంతా ఎవరురా కారణం రాస్కెల్!" — మురళీధరం ఊగిపోతున్నాడు. శరీరం వశం తప్పిపోతోంది.

"బిడివో తనిఖీకి వచ్చినప్పుడెంత నాటక మాడావ్! పోయిన సామాన్లకీ, మందులకీ, నేన్రా కారణం! నాకు నాటుసారాఅలవాటు చేసి, అప్పులుపెట్టి, మత్తులో ఉన్నప్పుడు నా జేబులో జీతం డబ్బులు కొట్టేసి—ఒరేయ్! సంగడి గేదె చచ్చిపోతే నా అశ్రద్ధ వల్లనేనని వాణ్ణి నా మీదికి తోల్తావురా! పశువులు మూగ జీవాలురా! అవి నా ప్రాణాలురా!"—

మురళికి ఎక్కిళ్ళొస్తున్నయ్. ఎక్కిళ్ళతోపాటు కన్నీళ్లొస్తున్నయ్. ఉద్రేకం అతణ్ణి నిలవనియ్యడంలేదు. కుర్చీమీదనుంచి లేచి నిటారుగా నిల్చోడానికి విశ్వప్రయత్నం చేశా . లేవబోతూ మోకాలు బల్లకు కొట్టుకున్నాడు. పక్కకో అడుగు వెయ్యాలనే ప్రయత్నంలో కుడిపాదం ముందుకు నెట్టాడు. అది తూలి పక్కనే ఆమ్లెట్ ముక్కను కమ్ముకున్న చీమల గుంపుమీద పడ్డది.

కాలికింద మెత్తగా, కస కస నలిగిపోతూ ఎన్ని అల్పప్రాణాలు! ఆ క్షణాన వెన్నుపాములో జంకో జలదరింపో విద్యుత్తులా ప్రసరించింది. ప్రయాణం చేసే మనిషి నిద్రమత్తు, బస్సు కుదుపుకు తపీమని ఎగిరిపోయినట్లు మురళి మెదడు నావరించుకున్న మత్తు ఒక్కసారిగా ఆవిరైపోయింది.

నలిగి అట్టకట్టుకున్న చీమలమీదనుండి కాలు తీసేశాడు మురళి.

'ఒరే ఖానూ, నీలయ్యా, సంగడూ! ఉత్త చీమలురా మీరంతా! వీటిని చూడండి, బాగా చూడండిరా! నా కాలికింద నలిగి ఎట్లా పచ్చడైపోయాయో!"—అంటూ పగలబడి నవ్వసాగాడు. ఆ నవ్వుకు ఇల్లంతా దద్దరిల్లిపోయింది.

# శుభాకాంక్ష

## శ్రీ మేకా సుధాకరరావు

రావమ్మా కాళయుక్తీ !
తలవాకిట నిలిచిపోయావేం—అలా
తటపటాయిస్తూ ?
అంతా చిందర వందరగా ఉందనా ?
రా లోనికి
ఆనందంగా—ఆనందకరంగా:

నీ ముందు రాజ్యంచేసిన పింగళలో
నీరూ గాలీ కుట్రపన్ని
నిలువునా ముంచేసిన
మా కోస్తా సీమల్లోనూ
దక్షిణాదినీ
బ్రతుకు లిప్పుడిప్పుడే కోలుకొంటున్నాయి !
ఆ ఎండిన బ్రతుకు మోడులు
నిండుగా పూయించు — ఆ సీమల
పండు వెన్నెలలు కాయించు !

శిశిరాంత నిశాంతంతో
చెదరిపోయిన భయాల చీకట్లు
వసంతోదయంతో
శుభాల వెలుగులై విరిసినవి.

బుసలుగొట్టే చలుల నాగులకు
ఆ పసిడి వెలుగుల మసల తావేలేదిక.

విరిసిన ఈ వసంతపు సుగంధాలు
వాడవాడలా వ్యాపించి
వాడని ఆనందం వీడువీడునా పంచి
బీడు వారిన జీవిత క్షేత్రాల
మోడువారిన మనోనికుంజాలు
చివురులెత్తి, కుసుమించి
ఆనందపు శోభలు
అందించా లందరికీ.

పంట లెంతగా పండినా
తమ బ్రతుకులు పండని కూలీలూ
పరిశ్రమలెంత సత్ఫలించినా
తమ శ్రమలు ఫలించని కార్మికులూ —
యజమానుల స్వార్థం క్రమ్మిన
నీడల చీకటిలో నివసించే
నికృష్టపు స్థితికి నిలువనీడలేకుండా పోవాలి.

తాడూ బొంగరంలేని పేద ప్రజల బ్రతుకులకు
కూడూ గూడ పంచుతూన్న ఈనాడు
జాతి చరిత్రకే ఒక కొత్త వెలుగు రానున్నది.

నా ఆలోచనల నాగళ్లు దుక్కు చేసిన
ఆశయాల క్షేత్రంలో
ఈ కలం నాటిన అక్షర బీజాలు
మోసులెత్తి, రాశులుగా శుభం సుఖం పండించాలని—
నా జాతిరీతి ఖ్యాతివంతం కావాలని,
చిరకాలపు నా కోరిక ఫలియించే
శుభదినమది శీఘ్రంగా రావాలి !

సామాన్యప్రజాశ్రేయస్సే ప్రధాన ధ్యేయంగాసాగే
నూతన ఆర్థిక సాంఘిక సూత్రాల అమలుతో
దేశం సౌభాగ్యవంతమై
సుసంపన్నమై వెలుగొందాలి —
వసంత శోభగా వెలుగొందాలి —
ఇదే నా ఆకాంక్ష !
ఇది నా శుభాకాంక్ష !!

# ఏక్ టి షాదా గాల్పొ

బెంగాలీ మూలం :
శ్రీ స్వరాజ్ బంద్యోపాధ్యాయ

# ఒక మామూలు కథ

తెలుగు అనువాదం :
శ్రీ దండమూడి మహీధర్

రెండో నంబరు బస్సు శ్యాంబజారు, కాలేజీ స్ట్రీటు, బాపూ బజారు, డల్‌హౌసీ స్క్వేర్ — వీటిమధ్య తిరుగుతూ వుంటుంది. కండక్టర్ నందకిశోరు బస్సులో బ్యాలెన్సు నిలుపుకుంటూ, 'తుమి కొథాయ్? తుమి కొథాయ్?' అని అడిగి టికెట్టు ఇచ్చి డబ్బులు తీసుకోవటం, ఎక్కిన ప్రయాణీకుల్ని 'ఆడా ఆడీ' (తొందర తొందరగా) అని అంటూ లోపలికి పంపించడం — అంతా ఒక అలవాటుగా మారిపోయింది.

'కాళీఘాట్...ఎషో ఎషో...' భవానీపూర్...

నందకిశోర్ బస్ ఆపటం, టిక్కెట్లు ఇవ్వటం, స్టేజిదగ్గర ప్రయాణీకుల్ని దించి, కొత్త వాళ్ళను ఎక్కించుకోవటం — వీటిని ఒక యంత్రంలాగా నిర్వర్తిస్తూ వుంటాడు.

మనిషి చూడ్డానికి బక్కపలచగా వుంటాడు. నలుపురంగు! 20 – 22 సంవత్సరాలుండొచ్చు! పొడుగాటి ఉంగరాల జుట్టు! మొహంలో తేజస్సు వుంది. అతని కళ్ళవైపు చూస్తుంటే నవ్వుతున్నట్టుగా వుంటాయి.

'కాలేజీ స్ట్రీట్!' ...

'బాపూ బజార్' ...

*          *          *

రోజూటి మాదిరిగానే ఆరోజు కూడా వివేకానంద్ రోడ్డు బస్‌స్టాప్‌లో బస్సు ఆగబోయేముందు తల బయటికిపెట్టి చూశాడు. స్టాప్‌లో ఆమె వుంది. ఫుట్‌బోర్డు మీదికొచ్చి నిలబడ్డాడు. ఆమె బస్సెక్కింది. ఆమె కనకాంబరం రంగుచీరె చెరగు అతన్ని స్పర్శించింది. నందకిశోర్ గుండె రెండుసార్లు కొట్టుకుంది. ఏదో సువాసన అతని నాసికా పుటాల్లో ప్రవేశించి ఆనందాన్ని కలిగించింది; ఇరవయ్ రెండు సంవత్సరాల యువక హృదయంలో రేగిన కంపనానికి అతని శరీరం గగుర్పొడిచింది.

ఆమెవెళ్ళి సీట్లో కూర్చుంది. ఆమె వయస్సు ముప్ఫై సంవత్సరాలుండొచ్చు; ముప్ఫై కాకపోతే ఇరవయ్ ఎనిమిది! ఆమెతో యౌవ్వన చాంచల్యం దాటిపోయింది. ఆమెలో ప్రశాంత మాధుర్యం ప్రవేశించింది. మొహంలో ప్రశాంతత గూడు కట్టుకొని వుంది. చూడ్డానికి ఎంతో సౌమ్యంగా కన్పిస్తున్నది. ఎంత అందంగా వుండంటే — ఒకసారిచూస్తే ఎవ్వరూ మరచిపోలేరు. చాలా ఆకర్షణీయమైన మొహం! ఆమె మొహంవైపు చూడటం అంటే నందకిశోర్‌కు ఎంతో ఇష్టం! ఆమె చీరె చెరగు అతన్ని స్పర్శించినా, లేదా ఆమె బస్సులో ప్రవేశించినప్పుడు వ్యాపించే పరిమళాన్ని ఆఘ్రాణించినా — అతని మనస్సు గాలిలో తేలిపోతూ వుంటుంది.

ఏ కారణం చేతనయినా బస్సు లేట్ అయి సరీగ్గా పది గంటలకు వివేకానంద్‌రోడ్డు చేరుకోకపోతే అతనిమనస్సు మనస్సులో వుండదు. ఆ రోజున ప్రయాణీకుల్ని కసురుకుంటాడు. ఇంట్లో కూరలో కారం ఎక్కువైందని చిటపటలాడతాడు. ఇక ఆ రాత్రికి అతనికి సరిగా నిద్ర కూడా పట్టదు!

*          *          *

చాలా రోజుల తరువాత గాని నందకిశోర్‌కు ఆమెపేరు 'తాపసీతరు గుప్త' ఎమ్. ఎ. అని తెలీలేదు! పేరు తరువాత ఏదో కాలేజి పేరు వుందిగాని, అదేమిటో స్పష్టంగా తెలీలేదు. అది కూడా హేండ్‌బ్యాగ్‌కు ఒకమూలన వున్న కార్డుమీద వున్నది. టికెట్ డబ్బులు ఇవ్వటం కొంచెం ఆలస్యం అయింది, ఆ రోజున! ఈ లోపల ఆ పేరు చదివేశాడు.

ఆమె ఎమ్. ఎ. చదివిందని తెలుసుకొని నందకిశోర్ అదిరిపోయాడు. ఎమ్. ఎ. అంటే మాటలా, అన్నిటికంటే చివరిది! అని అనుకున్నాడు. ఆమె రోజూ ఏ స్టాప్‌లో దిగుతుందో, అక్కడికి కొద్ది దూరంలోనే ఆడవాళ్ళ కాలేజీ ఒకటివుంది. బహుశా అక్కడే ఈమె లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తూ వుండివుండవచ్చునని వూహించాడు. తను పెద్దగా చదువుకోలేక పోయినందుకు బాధపడ్డాడు. మెట్రిక్ పూర్తయ్యాక అతని తండ్రి కండక్టర్ ఉద్యోగం ఇప్పించాడు. తండ్రి ముసలివాడయ్యాడు.

అయితే నందకిశోర్ తనకు చదువులేదని నిత్యం బాధపడుతూండేవాడు. తాపసీతరుగుప్త ఎం. ఎ; చదివినందుకు అతనెంతో మురిసిపోతూ వుండేవాడు! 'తనకు వెలుగులేదు, ఆమెకు వెలుగు దేదీప్యమానంగా వుంది!' అని అనుకునేవాడు.

*          *          *

బహుశా, ఈ కండక్టర్‌కు బుద్ధి మందగించిందని మీరనుకుంటూ వుండవచ్చు! లేకపోతే ఎం. ఏ. చదివిన ఆ లెక్చరర్ ఎక్కడ, చదువూ సంధ్యాలేని ఈ కండక్టర్ ఎక్కడ? ఇద్దరిమధ్య పదేళ్ల వ్యత్యాసం అయినా వుండి వుంటుంది. ఇతగాడి పిచ్చి కాకపోతే మరేమిటి? పిచ్చి అయితే అయి వుండవచ్చు! కాని నంద

కిశోర్‌కు కూడా మనసు అంటూ ఒకటి వుంది! మనస్సును బంధించడం ఎవరితరం? అది ఎన్నెన్నో ఆకాశ హర్మ్యాలు నిర్మించు కుంటుంది! మరి ఇలా చేయడం సబబేనా? నందకిశోర్‌ను ఇందుకు దోషిగా ఎంచవలసిందేనా?...అయితే వినండి:

దాదాపు సంవత్సరంన్నర క్రింద తాపసీతరు గుప్తాను చూసిన రోజున—ఒక సంఘటన జరిగిపోయింది! అదే నందకిశోర్ మనస్సులో అగ్నిని రేపి, అతన్ని దహించివేసింది! ...

డ్రైవర్ ఒక్కసారిగా సడన్ బ్రేక్ వేశాడు తాపసీతరుగుప్తా ముందు నిల్చొని టిక్కెట్లు ఇస్తున్న నందకిశోర్ ఆ కుదుపుకు అమాంతంగావెళ్ళి తాపసీతరు గుప్తా ఒళ్ళో వక్షస్థలంమీద పడి పోయాడు' గంభీర ప్రకృతిగల తాపసీతరుగుప్తా వెంటనే అతన్ని విదిలించి అవతలకు నెట్టేందుకు ఎంతమాత్రం ప్రయత్నించక, అతన్ని అలాగే వుండనిచ్చింది, అరక్షణంసేపు! అంతలో అతను సంబాళించుకొని లేవటానికి ఉద్యుక్తుడయ్యాడు! ఇంతలో పక్కనే నిల్చున్న ఇద్దరు యువకులు అతనిమీద విరుచుకు పడ్డారు. ఒకతను మెడ పుచ్చుకున్నాడు; మరొకతను—'నువ్వు మనిషివా, పశువ్వా?' అని అంటూ చెయ్యి ఎత్తాడు, చెంపదెబ్బ వెయ్యటానికి !

'పోనివ్వండి! ఇందులో అతని తప్పేముంది, పాపం?' అని తాపసీతరుగుప్తా అన్నది.

ఆ యువకుడు ఎత్తిన చెయ్యి దించివేశాడు. అయితే ఆ ఇద్దరు యువకులూ, బస్సులో ప్రయాణంచేస్తున్న ప్రయాణీకులూ—నందకిశోర్‌వైపు కోపంగా చూస్తున్నారు. లజ్జితుడైన నందకిశోర్ ప్రయాణీకుల చూపుల్ని భరించలేకపోయాడు ఆ చూపుల్లో మనిషిని దహించివేసే శక్తి వున్నట్టయితే ఆ రోజున నందకిశోర్ నామరూపాలు లేకుండా అయిపోయి వుండేవాడు!... తనను సంబాళించుకొని నీరునింపుకున్న రెండు మేఘశకలాలవంటి నేత్రాలతో ఆమెవైపు చూశాడు. 'భయపడకు!... నేనేమీ అనుకో లేదులే!' అంటున్నట్టుగా తాపసీతరుగుప్తా నందకిశోర్ వైపు చూసింది.

సిగ్గుతో కుంచించుకుపోయిన నందకిశోర్, కృతజ్ఞతా భావంతో ఆమెవైపు చూశాడు.

ఆ తరువాత ఆమె రోజూ పదిగంటలకు బస్సెక్కుతూ వుండేది...రోజులు రెక్కలు కట్టుకొని ఎగిరిపోయాయి...ఆనాటి ఆమె స్నేహపూరిత నేత్రాలను, బాహుబంధనాన్ని, సర్వాంగస్పర్శను విస్మరించలేకపోయాడు!... ఆ అనుభూతిని అతను మరచిపోలేక పోయాడు!...

రోజులు గడుస్తున్నాయి. ఒక్కొక్కరోజు కాలగర్భంలో కలిసిపోతున్నకొద్దీ నందకిశోర్‌కు ఆమెలో ఏవో కొత్త అందాలు కన్పిస్తున్నాయి. మెడమీద వదులుగా వాలివుండే ఆమె కేశరాశి, పౌడరు—స్నోలులేని ఆమె సహజ ముఖమండలం, ఆమె విస్ఫారిత నేత్రాలూ—అతనిలో నూతన లోకాలను సృష్టిస్తూ వుంటాయి. ప్రతిరోజూ ఆమెను చూసి—ఇంతటి అపూర్వ సౌందర్యంగల స్త్రీ ప్రపంచంలో ఎవరూ వుండబోరని అనుకుంటూ వుండేవాడు.

ఆ తరువాత మరొక సంవత్సరంన్నరపాటు నందకిశోర్ తాపసీతరుగుప్తాను గురించి వూహాల ప్రపంచంలో విహరిస్తూ వుండిపోయాడు. అతనికి ఒక రోజున తాపసీతరుగుప్తాను ప్రేమిస్తున్నట్టు బోధపడింది. అతనిలో ఆ బోధ కలగటంతో భయం వేసింది; పైగ ఎంతో లజ్జపడి పోయాడు.

ఆ రోజు అతనికి శలవు కావడంవల్ల—వివేకానంద రోడ్డు మలుపుమీద ఆమె రాకకోసం నిరీక్షిస్తూ నిలబడ్డాడు. మూడు—మూడున్నరప్పుడు తాపసీతరు బస్సు దిగింది. చేతిలో హేండ్‌బ్యాగ్, ఏవో రెండు పుస్తకాలూ వున్నాయి. బస్సుదిగి ముందుకుసాగింది.

నందకిశోర్ ఆమెను వెంబడించాడు. తిన్నగా కొంతదూరం వెళ్ళాక కుడిచేతివైపునున్న ఒక ఇంట్లోకి వెళ్ళింది. నందకిశోర్ ఆ ఇల్లు గుర్తుపెట్టుకొని అక్కడకు కొంచెం దూరంలోనే వున్న టీ దుకాణంలోకి వెళ్ళి కూర్చున్నాడు. ఆమె బట్టలు మార్చుకొని, కాఫీ టీలు ముగించుకొనేందుకు టైం ఇవ్వాలనే ఉద్దేశ్యంతో!

నందకిశోర్ ఇటీవల డబ్బులు మిగుల్చుకోవడం అలవాటు చేసుకున్నాడు. ప్రతి ట్రిప్‌లోనూ వచ్చే పై ఆదాయాన్నికూడా జాగ్రత్తచేసి వుంచుతున్నాడు. ఇదంతా పెళ్ళికోసం! వాళ్ళ కుటుంబాలలో పిల్ల తరఫువాళ్ళకు కట్నం ఇచ్చుకోవాలి. లేకపోతే పిల్ల దొరకటం కష్టం! అయితే నందకిశోర్ అవసరంకంటే ఎక్కువే జమచేశాడు! ఇక పెళ్ళిచేసుకోవడమే తరువాయి!...కాని చేసుకో లేదు.

ఆకాశంమీద వ్యాపించిన కారుమేఘాలు పడమరవైపుకు పరుగెడుతున్నాయి. చల్లటిగాలి వీస్తున్నది. వర్షంవచ్చే సూచనలు కన్పిస్తున్నాయి.

* * *

నందకిశోర్ తాపసీతరుగుప్తా వుండే ఇంటికెళ్ళాడు. తలుపు తెరిచి మెట్లెక్కి పైకి వెళ్ళేప్పటికి కుర్రవాడొకడు ఎదురైనాడు.

''ఒరేయ్ బాబూ! తాపసీతరుగుప్తా వుండేది ఇక్కడేనా? కొంచెం చెబుతావా! ఎక్కడో?''—నందకిశోర్ అడిగాడు!

'ఎందుకు చెప్పాలి?' అని ఆ కుర్రవాడు తప్పుకోబోయాడు. నందకిశోర్ అతని చెయ్యి పుచ్చుకొని, నాలుగణాల బిళ్ళ అందిస్తూ 'ఇప్పుడు చెప్పు, ఎక్కడుంటుందో?' అని అన్నాడు.

'మూడో అంతస్తులో!' అన్నాడు కుర్రాడు.

''ఆమెతో ఇంకెవరుంటారు? ''నందకిశోర్ ప్రశ్నించాడు.

''ఎవ్వరూ వుండరు, ఒకత్తె వుంటుంది.''

'ఆమె ఏం వుద్యోగం చేస్తుంది?'

'పాఠాలు చెబుతుంది!'

'నీ పేరేమిటి?'

'హులో!'

నందకిశోర్ హాలోను వదిలేశాడు. మూడో అంతస్తుకెళ్ళి చూస్తే తాపసీతరు ఈజీ చైర్‌లోపడుకొని ఏదో చదువుకుంటున్నది. తెల్లటి బట్టలు ధరించి వుంది. ఆమె అందమైన చేతులు మాత్రం కన్పిస్తున్నాయి. చేతికి గడియారం కూడా లేదు. వట్టి చేతులు కన్పిస్తున్నాయి. ఆమె కేశరాశి ఈజీ చైర్ వెనక వ్రేలాడుతున్నది.

నందకిశోర్ హృదయం కంపించింది. అతని అరిచేతులు, పాదాలు చెమటతో నిండిపోయాయి. తన ఇంట్లో వున్న దుర్గామాత ప్రతిమను గుర్తుకుతెచ్చుకొని సంస్మరించుకున్నాడు. కొంచెంసేపు అలాగే నిల్చుండి పోయాడు.

కొంచెం చీకటి పడింది.

'నేను మిమ్మల్ని కలుసుకోవడానికి వచ్చానండి !' అని అన్నాడు, ఒక్కసారిగా ఆమె ముందుకెళ్ళి నిలబడుతూ !

తాపసీతరు గుప్తా చదువుతున్న పుస్తకం మూసేసి — 'ఎవరు ?' అంది ?

తాపసీతరు గుప్తా తనను గుర్తిస్తుందనుకున్నాడు నందకిశోర్ ! కాని ఆమె చూపును బట్టి ఆమె తనను గుర్తుపట్టలేదని గ్రహించాడు. అయితే ఆమె అలా తను వెళ్ళినందుకు ఆశ్చర్యాన్ని ప్రకటించలేదు.

తన అందమైన కళ్ళను అతని వైపుకి తిప్పి — 'ఏం పని మీద వచ్చావు ?' అని అడిగింది తాపసీతరు గుప్తా !

నందకిశోర్ ఈలోపు కొంచెం సంబాళించుకున్నాడు. గుర్తుపట్టనందుకు సంతోషించాడు.

'మీ దగ్గర చదువుకోవాలని వుందండీ ! మీరు చాలా బాగా చదువు చెబతారని విన్నాను. !'

తాపసీతరుగుప్తా పెదవుల మీద చిరునవ్వు తాండవించింది.

''ఈ అర్థంలేని మాట ఎవరిదగ్గరవిన్నావు ? ... నేను పాఠాలు చెప్పడం నిజమే గాని — బాగా చెబుతానన్నది మాత్రం నిజం కాకపోవచ్చు. ఇంతకు నువ్వేం చదువుతున్నావు?'' గురు—శిష్యుల సంబంధం ఏర్పడక ముందే తాపసీతరుగుప్తా నందకిశోర్‌ను 'నువ్వు' అనటం మొదలు బెట్టింది.

'ఏదో పేరుకు మెట్రిక్ చదువుకున్నాననుకోండి !' అని నందకిశోర్ అన్నాడు.

''నేను బి. ఏ. వాళ్ళకు తప్ప ఎవరికీ చెప్పలేను !'' అని అన్నది, కొంచెం నిరాశగా ! అంత తక్కువ చదువుకున్న వ్యక్తి తన దగ్గరకు అలా వస్తాడని ఆమె వూహించలేదు.

''చెప్పనంటే ఎలాగండీ ? మీకు ట్యూషన్ ఫీజు ఎంత కావాలన్నా ఇస్తాను. నాకు మాత్రం మీరు ట్యూషన్ చెప్పాల్సిందే!' అని అన్నాడు, నందకిశోర్ !

అతని సమాధానం విని తాపసీతరుగుప్తా నిర్విణ్ణురాలైంది. అతన్ని పరీక్షగా చూసింది.

''నిన్నెక్కడో చూసినట్టుందే...ఏదో లీలగా గుర్తుకొస్తున్నది...''

'ఎక్కడో బజార్లో చూసే వుంటారు !' అని నందకిశోర్ మొహం వీలైనంత వరకు ఆమెకు కన్పించనీయకుండా పక్కకు తిప్పేసుకున్నాడు.

అప్పుడే వర్షం ప్రారంభమైంది. గాలికి వానజల్లు వచ్చి ఆమె మొహం మీదికొచ్చి పడుతున్నది. ఈజీచైర్‌లో నుంచి లేచి— 'లోపలికిరా !' అని అన్నది తాపసీతరు గుప్తా !

ఆమె పడక కుర్చీలో నుంచి లేచేప్పుడు, ఆమెవైపు నందకిశోర్ కళ్ళార్పకుండా చూశాడు. ఆమె శరీరంలోని ప్రతి భంగిమ అతనికి అపూర్వంగా, అతి సౌందర్యవంతంగా కన్పించింది అమితానందంతో అతని శరీరం రోమాంచితమైంది. 'ఆమెను ఇదే విధంగా అనంతకాలం వరకు అనవరతం చూస్తూ వుండగలిగితే తనకిక జీవితంలో మరొక కోరిక అంటూ మిగలదు !' అని నందకిశోర్ అనుకున్నా . 'తన యావత్ ప్రపంచం తాపసీతరు గుప్తా కనుపాపల చెంతనే చోటుచేసుకొని వుంది!' అని అతని భావన ! ఈ భావనా ప్రపంచంలో మునిగి నందకిశోర్ తనను తాను మర్చిపోయాడు.

'లోపటికి రమ్మన్నానుగా !' అనే తాపసీతరు గుప్తా చల్లని కంఠం నందకిశోర్ విన్పించడంతో మళ్ళీ మామూలు ప్రపంచంలోకి వచ్చాడు.

నందకిశోర్ లోపలికెళ్ళాడు.

'ఈ కుర్చీ మీద కూర్చో !'

నందకిశోర్ కూర్చున్నాడు.

తన రెండు కళ్ళు అతనికి అప్పగించి — ''అవును గాని ! నన్నుగురించి నీకెవరు చెప్పారు ?'' అని ఆమె అడిగింది.

నందకిశోర్ విహ్వలుడైపోయాడు. మాట మార్చివేయాలనే వుద్దేశ్యంతో — 'ఇంతకూ ట్యూషన్ ఫీజు ఎంత తీసుకుంటారో చెప్పారు కాదు ! ఎంత ఇవ్వమంటారో చెప్పండి!' అని అన్నా .

తాపసీతరు నవ్వింది.

'నువ్వు నాకేమీ ఇవ్వనక్కర్లేదు గాని, నేనుమాత్రం మరొక చోటికి రాలేను ! నువ్వే ఇక్కడికొచ్చి చదువుకోవాలి !

'అలాగే నండి ! అయితే రోజూ నేను సాయంత్రం పూట వస్తాను !'

'రోజూ నేను సాయంత్రం పూట వస్తాను !' ఇదొక్కటే నిజం ! చదువు అనేది వట్టి మిష మాత్రమే ! అతనక్కడికి వెళ్ళాలి ! వెదుకుతున్నాడు కూడాను !

★ ★ ★

ఆరోజు నుంచే రోజూ సాయంత్రంపూట వెళ్ళటం ప్రారంభమైంది. పుస్తకాలు కొన్నాడు. నోటు బుక్కులు కొన్నాడు. కలం

కొన్నాడు. ముందుగా కొంత కాలం తాపసీతెరు బెంగాలీ ఇంగ్లీషు అనువాదం చేయిస్తానన్నది. నందకిశోర్‌కు చదువుమీద ఏమాత్రం ఆసక్తిలేదు. కాని తప్పదుగా! ఏదో నేర్చుకుంటున్నాను. ఆ మిషతో ఆమె ఎదుట కూర్చోవచ్చునని! గ్రామర్ చెప్పడం అంటే ఆమెకు చాలా సరదా! టెన్స్ చెప్పేప్పుడు ఆమె ఎంత తన్మయత్వం చెందుతుందంటే ఆమె జెడ వూడిపోయి జుట్టు వక్షస్థలం మీద పడుతుంటూ వుంటుంది. అప్పుడప్పుడు పమిట కూడా తొలగిపోయి చేతిమీద పడుతుంది. ఆమె ఇదేమీ పట్టించుకోదు. నందకిశోర్‌కు చదువు ముందుకు సాగదు. 'ప్రెజెంట్ ఫర్‌ఫెక్ట్ టెన్స్' అర్థం చేసుకోవడానికి ఎంతమాత్రం ప్రయత్నించడు! తాపసీతెరు మోహం వైపుచూస్తూ ఉండిపోతాడు. చీర సర్దుకొని ఆమె మధ్య మధ్యన 'అర్థమైందా?' అని అడుగుతూ వుంటుంది.

'ఊఁ' అని మాత్రం నందకిశోర్ అంటాడు.

'ఈసారిగనుక అడిగిందానికి సమాధానం చెప్పకపోయావంటే వూరుకోను. బాగా కోప్పడతాను సుమా!'

నందకిశోర్ నవ్వుతాడు.

చివరకు అలాగే అయింది. ప్రెజెంట్ ఫర్‌ఫెక్ట్ టెన్స్‌ను గురించి అడిగితే గుడ్లు తేలేశాడు.

'మరి ఇప్పటిదాకా ఏం వింటున్నట్లు?' అని తాపసీతెరు అడిగింది.

నందకిశోర్ మాట్లాడలేదు.

నందకిశోర్‌కు ఆమె మృదు మధుర కంఠం వింటూ కూర్చోవడం అంటే ఎంతో ఇష్టం. ఆమె ఏమి చెబుతున్నదీ అతనికి అక్కర్లేదు.

'అర్థం కాలేదండి!' అన్నాడు.

'అయితే మళ్లీ చెబుతాను. ఎక్కడ అర్థంకాకపోతే అక్కడ అడుగుతూ వుండు!' అని గడియారం వైపు చూసింది. ఎనిమిదిన్నర కావస్తున్నది.

'ఈ రోజుకి చాల్లే! రేపురా!' అని అన్నది.

నందకిశోర్ పుస్తకాలు సర్దుకొని లేచాడు. ఇప్పుడు మరొక వ్యక్తి వస్తాడని అతనికి తెలుసు! అతనెవరో నందకిశోరుకు తెలీదు. ఆ మనిషిని ఒకసారి చూశాడు. కోటు, ప్యాంటు వేసుకుంటాడు, చేతిలో సిగరెట్టు వెలుగుతూ వుంటుంది, ఎప్పుడూ! పొడుగ్గా, ఎర్రగా వుంటాడు. మనిషి అందంగా వుంటాడు. అతను కన్పించడంతోనే ఆమె మోహం ఒక్కసారిగా విప్పారుతుంది. నవ్వుతూ మాట్లాడుతుంది. సిగ్గుపడుతుంది.

'వచ్చావా, రంజన్! ఇంత ఆలస్యమైందేం?' అంటుంది, అతను కన్పించడంతోనే.

నందకిశోర్ నల్లటి మోహం మరింత నల్లబడుతుంది ఈ మాట విన్నప్పుడు! ఆయనెవరిని నందకిశోర్ తాపసీతెరు గుస్తాను ఎప్పుడూ అడగలేదు. అలా అడగటం మంచిది కాదేమోనని అతని భావన! అయితే అతని ప్రసక్తివచ్చినప్పుడు మాత్రం ఆమె మౌనం వహిస్తుంది.

ఇలా కొంతకాలం గడిచింది.

*　　　*　　　*

ఒకరోజు మధ్యాహ్నంపూట కాలేజీ అయ్యాక తాపసీతెరు ఇంటికొచ్చి, బట్టలుమార్చుకొని మంచంమీద పడుకుంది. కొంచెం బడలికగా వుండటంవల్ల ఆమెకు వెంటనే కునుకుపట్టింది.

సాయంత్రం మామూలువేళకు నందకిశోర్ వచ్చాడు. రెండు మూడు పర్యాయాలు బయట నిల్చొని పిలిచాడు. సమాధానంలేదు. చీకటిగావున్న గదిలోకి వెళ్ళాడు. లైటు వేశాడు. తాపసీతెరు ఆ రకంగా నిద్రపోవటంచూసి వెంటనే బయటికొచ్చాడు, వరండాలోకి! అక్కడ కొంచెంసేపు నిలబడి మళ్ళా గదిలోకి వచ్చాడు. ఆమె వెనుకటి లాగానే గాఢ నిద్రలో వుంది. ఒక చెయ్యి కిందికి వేలాడుతున్నది; చీరె అంతా ఒక పక్కకు జరిగి పోయింది. నడుం దగ్గర మాత్రం కొంచెంగా వుంది.

నందకిశోర్ గుండె ఊహించడం ప్రారంభించింది. బయటికి వెళ్ళాలనిపించడంలేదు; అక్కడ అలా నిల్చోవడం కూడా మంచి పద్ధతి కాదని అనిపిస్తున్నది. కాళ్ళూ చేతులు వణుకుతున్నాయి; వళ్ళంతా చెమట పట్టింది. చలనం లేకుండా అలాగే నిలబడి పోయాడు. అతని రెండు కళ్ళు అభూత పూర్వమైన అమృత పానాన్ని ఆస్వాదిస్తూ అలౌకికానందాన్ని అనుభవిస్తున్నాయి.

అతి కష్టంమీద నందకిశోర్ కొంచెం ముందుకు అడుగు వేశాడు. మళ్ళీ వెంటనే వెనక్కుతగ్గాడు. వేడి, చెమటకు కాటోలు తాపసీతెరు గుస్తా కాటుక పెట్టుకున్న కళ్ళ నుంచి నల్లటి జీరలు కళ్ళకింద కన్పించాయి. అస్పృష్ట, నిష్పోషితయౌవ్వనం ఈరోజున తనకు తెలియకుండానే వెలుగును చూసింది.

నందకిశోర్ వెంటనే వెళ్ళి తలుపుమూసి వచ్చాడు. లైటు తీసివేశాడు. గుండె కొట్టుకుంటున్నది. అయినప్పటికి తన ఆనందమయ ప్రేమకు కళంకాన్ని అపాదించడం అతని కెంత మాత్రం ఇష్టంలేదు. నందకిశోర్ అతి జాగ్రత్తగా శరీరంమీది నుంచి తొలగిపోయిన చీరెను సరిగా సర్దాడు. బహిర్గతమైన అవయవాలకు మరుగు కల్పించాడు. వెళ్ళి తల దగ్గర కింది కూర్చొని తలమీద చేతితో నిమిరాడు.

'కే?' (ఎవరు?) అని అతి నెమ్మదిగా అన్నది!

నందకిశోర్ చెయ్యి మరొక రెండుచేతుల్లో బందీగా చిక్కుకున్నది. ఊరిశిక్షపడ్డ నేరస్థుడులాగా నందకిశోర్ భయభీతుడైనాడు; మనిషినిలువునా చల్లబడిపోయాడు. ఇలా జరుగుతుందని అతను వూహించలేదు.

''కే? రంజన్?''

నందకిశోర్‌కు ఆ చీకట్లో ఏం చేయాలో తోచలేదు. నంద కిశోర్ తలను ఆమె తనమీదికి లాక్కుంది. ఆ తరువాత వక్షస్థలం మీదికి లాక్కొని గట్టిగా అదిమి పట్టుకుంది.

*   *   *

చాలాసేపు గడిచిపోయింది. తాపసీతరు శరీరపు వేడికి నంద కిశోర్ మనస్సులో అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లాయి. అతను వూహించుకున్న ప్రేమలో ఇలాంటి ఉత్తేజనకు స్థానంలేదు. ఆ సమయంలో అతన్ని ఎవరో ఏదో అంతస్తు నుంచి కిందికి పడేసినట్టనిపించింది.

తన ప్రశాంత ఆనందం కాస్తా మంటగలిసిందనుకున్నాడు. ఆమె శరీరం పొగలు సెగలూ కక్కుతున్నది. నందకిశోర్ ఆ వేడిని భరించలేకపోతున్నాడు! ఆమె మరింత గట్టిగా అతన్ని తనవైపుకు లాక్కుంటున్నది. నందకిశోర్ కిది నచ్చలేదు!

అతనీ చర్యను మరింతగా ఈసడించుకున్నాడు. ఆమె బాహుపాశంలో బందీగా చిక్కుకున్న నందకిశోర్ ఉండబట్టలేక పోయాడు. ఎంతో బాధపడి చివరకు — 'నన్ను వదలండీ!' అని అన్నాడు.

తాపసీతరుగుప్తా, ఎం.ఏ; ఒక్కసారిగా మంచం మీదినుంచి స్ప్రింగ్‌లాగా అతన్ని విదిలించుకుని లేచి కింద నిల్చుంది.

లైటు వెలిగింది.

నందకిశోర్ స్థాణువులా నిల్చున్నాడు.

అతని చెంపమీద వరసగా ఒకటి కాదు, రెండు కాదు—ఐదు దెబ్బలు పడ్డాయి. ఆ తరువాత చీర సర్దుకుంది.

చెంపదెబ్బలు తిని కూడా నందకిశోర్ కదలలేదు, మెదల లేదు. అలాగే నిలబడివున్నాడు.

'స్టుపిడ్! రాస్కెల్!! బయటికి నడువు!' స్విచ్ ఆన్ చేస్తే నడిచే యంత్రంలాగా బిగ్గరగా శబ్దం చేసి ఆగస్మాతుగా ఆగిపోయింది. ఆమె మొహం ఎర్రగా వుంది; కళ్ళు మెరొస్తున్నాయి.

నందకిశోర్ ఇంకా అలాగే నిలబడివున్నాడు. అప్పుడుగాని తాపసీతరుకు తను పొరపాటు స్విచ్‌ని ఆన్ చేసినట్టు అర్థం కాలేదు. ఏమాలోచించిందో, ఏమో, కొంచెం సేపయ్యాక అతని వైపు తిరిగి — 'నువ్వెప్పుడొచ్చావు?'

ఆమె సహజమైన కంఠం అతనికి విన్పించేప్పటికి 'నంద కిశోర్ ఆమె వైపుకు తిరిగి — కొద్ది సేపయింది!' అని అన్నాడు.

'నన్ను లేపవలసింది! ... సరే...' అని చెమటతో నిండి పోయిన తాపసీతరు ఈజీ చైర్‌లో కూర్చుండి పోయింది.

'అదుగో, అక్కడ స్టౌ వుంది! కొంచెం టీ తయారు చేస్తావా?'

నందకిశోర్ గబాగబా స్టౌ దగ్గరకు వెళ్ళి టీ తయారు చెయ్యడం మొదలు బెట్టాడు. అతని మనస్సు స్వాభావిక స్థితికి చేరుకున్నది. టీ తయారు చేసి ఆమెకొక కప్పు అందించాడు. తను కూడా ఒక కప్పు తీసుకున్నాడు.

నందకిశోర్ గడియారం వైపు చూశాడు. ఎనిమిదిన్నర కావస్తున్నది. రంజన్ వచ్చే టైం అయింది.

'ఏమయ్యా! నువ్విక్కడకు చదువుకోవడానికి వస్తున్నావా లేక వేరేదైన కారణం మీద వస్తున్నావా? అని' తాపసీతరు అగస్మాత్తుగా ప్రశ్నించింది.

నందకిశోర్ మాట్లాడలేదు.

'ఆలోచించి రేపు చెప్పు!'

నందకిశోర్ వెళ్ళిపోయాడు.

*   *   *

ఆ రెండోరోజూ తాపసీతరు మళ్ళి అదే ప్రశ్న అడిగింది. 'నువ్విక్కడకు ఎందుకొస్తున్నావు? నిజం చెప్పు!''

నందకిశోర్ నిర్భయంగా, నిర్వికార భావంతో — మిమ్మల్ని చూడ్డానికి వస్తున్నాను, చదువుకోవడానికి కాదు! అని చెప్పాడు.

'నన్ను చూడ్డానికా?' తాపసీతరు కొంచెం విస్మితురాలై అంది — 'ఎందుకు?'

''మీరు అందంగా వుంటారు! మిమ్మల్ని చూడ్డం అంటే నాకెంతో బావుంటుంది!'' నందకిశోర్ వెంటనే తడుముకోకుండా సమాధానం చెప్పాడు.

తాపసీతరుకు కూడా ఈ అనుమానం కలగకపోలేదు. కాని కండక్టర్ ఉద్యోగం చేసుకునే ఈ బక్కపలచటి నల్లటి కుర్రాడిలో ఈ భావం పని చేస్తున్నదా? తాపసీతరుకు నవ్వొచ్చింది. నవ్వును ఆపుకుంటూ — ''అయితే ఇక ముందు నువ్వు నన్ను చూడలేవు!'' అని అన్నది.

'ఎందుకని?' నందకిశోర్ మొహం వాడిపోయింది.

'ఈ నెలాఖరున నా పెళ్ళి! పెళ్ళయ్యాక సిమ్లా వెళ్ళి పోతాను!'

నందకిశోర్ నల్లటి మొహం మీద చీకటి వ్యాపించింది.

'ఏమండి, సిమ్లా ఇక్కడికెంత దూరమండీ? మధ్య మధ్యలో నేనక్కడకు రాకూడదాండీ?'

'చాలా దూరం. రాలేవు' అని తాపసీతరు గుప్తా ఎం. ఏ; నవ్వటం ప్రారంభించింది. 'ఎంత మధురమైన నవ్వు?' అని అనుకున్నాడు, నందకిశోర్!

'అయితే ఎప్పటికీ కలవరా?' నిట్టూరుస్తూ అడిగాడు, నందకిశోర్!

నవ్వుతూ, కొంచెం కాఠిన్యం కనబరుస్తూ — 'ఉహుం!' అని అన్నది, తాపసీతరు !

నందకిశోర్ శిలాప్రతిమలాగా నిల్చుండిపోయాడు — చాలా సేపటి వరకు !

'పెళ్ళెప్పుడండీ ?'

'ఆగష్టు 28 న !'

నందకిశోర్ ఆ తర్వాత చాలా సేపు కూర్చున్నాడు. 'ఇత గాడు వట్టి తెలివి తక్కువ పెద్దమ్మలాగా వున్నాడు. నన్ను ప్రేమించడమేమిటి ? విచిత్రంగా వుంది !' అని అనుకొని స్నేహ సిక్త స్వరంలో — 'బహుశా నీకు బాధగా వున్నదనుకుంటాను !' అని అన్నది.

'లేదండి, ఏ మాత్రం లేదు !' అని నందకిశోర్ అన్నాడు. ఆ తర్వాత కొద్ది సేపటికి అతను శెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. అతను వెళ్ళినవైపు చూస్తూ తాపసీతరు గుప్తా దీర్ఘంగా నిట్టూర్చి — నా అందం. నా యౌవ్వనం ఈకుర్రాణ్ణి ఆకర్షించి నట్టుంది ! ఇది క్షణికమైందని అతనికి తెలిసి వస్తుంది. అయినా ఈ కుర్రాడికి ప్రేమను గురించి ఏం తెలుసు ?

ఈ కాలపు కుర్రాళ్ళంతా ఇంతేనేమో ? తమ కంటే పెద్ద వాళ్లయిన ఆడపిల్లల్ని ప్రేమించేస్తారు. ఏమిటో ? అని తనలో తను అనుకుంది. ఇలా అనుకున్న తరువాత ఆమెకు కొంచెం తేలిక పడినట్టు అనిపించింది.

* * *

ఆగష్టు 28వ తేదీ!

ఆ రోజున తాపసీతరు తన పెళ్ళి అని చెప్పాక మళ్ళా ఈ రోజున వచ్చాడు. నందకిశోర్ మధ్యలో ఆమెను కలుసుకోలేదు. ఈ రోజు ఆమె పెళ్ళి! అందుకే వచ్చాడు. , ఈ రోజు తరువాత ఇక వచ్చే అవకాశమేలేదు.

ఈ రోజు నిజంగా చాలా సుదినం, నంద్‌కిశోర్‌కు! అతను కండక్టర్ ఉద్యోగం చేసుకుంటూ మొత్తం మూడొందల డెబ్భైఐదు రూపాయలు కూడబెట్టగలిగాడు. ఈ డబ్బుతో పెళ్ళి చేసుకుందామనుకున్నాడు ఆ డబ్బంతా ఈ రోజున ఒక సంచిలో పోసి తీసుకొచ్చాడు. ఆ డబ్బు తాపసీతరుగుప్తా కిచ్చి శాశ్వతంగా వెళ్ళిపోదామని అతని వుద్దేశ్యం.

డబ్బు సంచితో నందకిశోర్ రెండో అంతస్తుకెళ్ళాడు. మొదటిరోజున కన్పించిన కుర్రాడు మళ్ళ ఈ రోజున కన్పించాడు. అతని చేతిలో ఈ రోజున పావలాకాదు — నాలుగురూపాయలు పెట్టేశాడు.

నందకిశోర్ పైకెళ్ళాడు. సాయంత్రం అయిన గదిలో వెలుతురులేదు. పెళ్ళి హడావిడి కన్పించలేదు. మనుషులకోలాహలం అంతకంటేలేదు. ఏమిటో అంతటా నిశ్శబ్దత తాండవిస్తున్నది.

నందకిశోర్‌కు కొంచెం భయమేసింది. గదిలోకి వెళ్ళాడు. చీకటిగావుంది. తలుపు తెరిచేవుంది. ఏమిటిందంతా? అతనికి ఆశ్చర్యం వేసింది.

* * *

మంచంవైపు చూస్తే ఏదో కదులుతున్నట్టు కన్పించింది. స్విచ్ ఆన్ చేసేటప్పుడు నందకిశోర్‌కు ఆ రోజు జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది.

లైటు వెలిగింది. మంచంవైపు చూసి నందకిశోర్ స్తబ్దుడైపోయాడు తాపసీతరు నిద్రపోతున్నది. ఈ రోజు కూడా ఆమె శరీరంమీద వస్త్రంలేదు. ఈ రోజు కూడా ఒక చెయ్యి నేల మీదకు వేలాడుతున్నది. అయితే ఆ రోజుకూ, ఈ రోజుకీ చాలా వ్యత్యాసం వుంది.

తాపసీతరు అవయవాలన్నీ ఉబ్బి కుళ్ళిపోయాయి. స్ఫోటకం వచ్చింది. అది అతి భయంకరరూపం దాల్చింది. చేతిలోవున్న సంచి ఒకపక్కనబెట్టి శరీరంమీద చీరె కప్పాడు. తలవైపుకువెళ్ళి కింద కూర్చొని తలమీద చేతితో నిమిరాడు.

'కే?' కే ఆఛేన్? తాపసీతరు అతి నీరసంగా అడిగింది!

'మీ' అన్నాడు నందకిశోర్!

తాపసీతరుగుప్తా కళ్ళు తెరిచిచూసింది. అతన్ని చూసి ఆమె వెనుకటిలాగా నవ్వటానికి ప్రయత్నించింది.

(తుమి రోఖ్ నయి రోఖాన్ హయితే చలియ జావో!)

''నువ్వు ఇప్పుడే నువ్విక్కడనుంచి వెంటనే వెళ్ళిపో'' అని అన్నది.

నందకిశోర్ మారు మాట్లాడలేదు.

'ఇన్నిరోజుల్నుంచి ఎందుకు రాలేదు?' తాపసీతరు ప్రశ్నించింది.

'ఇలాగని తెలిస్తే తప్పుండా వచ్చి వుండేవాణ్ణి'! అని అన్నాడు, నెమ్మదిగా !

తాపసీతరు బాధకు తట్టుకోలేక ఆర్తనాదం చేస్తున్న ట్టుగా అన్నది, అతినెమ్మదిగా. 'నేనిక బతకను!' అని!

నందకిశోర్ ఆమెచేతిని తనచేతిలోకి తీసుకొని — భయపడ కండి! 'ఏం ఫరవాలేదు. ఇంట్లో ఎవరూలేరా? ఈ స్థితిలో ఒంటరిగానే వున్నారా?' అని అడిగాడు.

''అందరూ నన్ను వదిలి వెళ్ళిపోయారు. నీకు తెలుసోలేదో, రంజన్ కూడా సిమ్లా పారిపోయాడు, నిన్ననే! నా దగ్గర కూర్చోనే లేదు. రెండు రోజులు చూశాడు. ఒక ఉత్తరం రాసి నా మీదపడేసి వెళ్ళిపోయాడు. ఇదుగో, అతని ఉత్తరం చదువు!''

ఇంగ్లీషులోవున్న ఒక చిన్న ఉత్తరం తాపసీతరు నందకిశోర్ చేతికందించింది.

'ఉత్తరం అక్కడ వుంచండి! ముందు మీ ఆరోగ్యం బాగు పడాలి! ఆ తరువాత చూసుకోవచ్చు. బెడ్‌షీట్ ఎక్కడున్నదో చెప్పండి!' అని అన్నాడు నందకిశోర్.

అక్కడున్న సూట్‌కేస్‌వైపు చూపించి గట్టిగా నిట్టూర్చింది, తాపసీతరు! ఆమె చీర చెరగు చివరనున్న తాళపు చేతులు తీసుకొని పెట్టె తెరిచి బెడ్ షీట్, చీరె, మరికొన్ని ఇతర వస్త్రాలు బయటికి తీశాడు. అన్నీ మార్చాడు. పాత బెడ్‌షీట్, చీరె, ఇంకేవో బట్టలు తీసుకొని బాత్‌రూం కెళ్ళి అన్నీ ఉతికాడు. ఆరవేశాడు. బయటికెళ్ళి, అగరుబత్తీలు, పటికిబెల్లం, మెంతులు, నెయ్యి వగైరా సరకులు తెచ్చాడు. ముందుగా అగరబత్తీలు వెలిగించి, పటికిబెల్లం, మెంతులూ కలిపి నానబెట్టాడు.

తాపసీతరు అంతా చూస్తూనే వున్నది. నందకిశోర్ ఆనం దానికి మేరలేకుండా వుంది. ఆమె చూసి చూసి—'ఇక నువ్వు ఇంటికి వెళ్ళవా?' అని నెమ్మదిగా అడిగింది.

ఇంటికెళ్ళి పోవడానికి రాలేదు నేనిక్కడికి!—చిన్న పిల్లాడికి మల్లే నవ్వాడు నందకిశోర్!

''మీకు వళ్ళంతా బాధగా వుందిగదూ? చేతితో నెమ్మదిగా నిమురుతాను !''

నందకిశోర్ దగ్గరికొచ్చి కూర్చున్నాడు. అతని ప్రశాంత ముఖమండలంవైపు చూసేప్పటికి తాపసీతరుకు అభయమిచ్చినట్లని పించింది. ఆమె రెండు కనుకొలకులు నీటితో నిండిపోయాయి. కళ్ళు మూసుకుంది. కళ్ళ చివరనుంచి కన్నీటి చారలు కిందికి ప్రవ హించాయి.

15 రోజులపాటు నందకిశోర్ చేసిన శుశ్రూషవల్ల తాప సీతరు ఆరోగ్యవంతురాలయింది. ఆమె బట్టలు ఉతికి, వంటచేసి, రాత్రింబగళ్ళు మేల్కొని నందకిశోర్ ఆమెను మృత్యుముఖంనుంచి కాపాడాడు.

* * *

ఆరోజు సాయంత్రం నందకిశోర్ తాపసీతరుకోసం పూరీలు, బంగాళాదుంపల కూర తీసుకొచ్చి—'తినండి!' అన్నాడు.

'తినండి!...ఇంకా చాలా పనివుంది నాకు' అని అన్నాడు నందకిశోర్.

తాపసీతరు కళ్ళు తెరిచి నందకిశోర్‌వైపు చూసింది.

'నేను చూడ్డానికి చాలా అసహ్యంగా వున్నానుగదూ?' అని అగస్మాత్తుగా అడిగింది.

నిజంగానే తాపసీతరు గుర్తుపట్టలేనంతగా మారిపోయింది. మొహం అంతా గుంటలు పడిపోయింది. అగస్మాత్తుగాచూస్తే మనిషి చాలా భీభత్సంగా కన్పిస్తూంది. నందకిశోర్ మెల్లగా నవ్వాడు.

''నాకు మాత్రం అలాగని అనిపించడంలేదు! సాధారణంగా జబ్బుచేస్తే ఎవరైనా కొంచెం మారిపోవడం జరుగుతూనే వుంటుంది. ఆ సంగతి అలా వుంచండి, ముందు మీరా పూరీలు తినండి!''

తాపసీతరు నందకిశోర్ చెయ్యి తీసుకొని తన కళ్ళమీద పెట్టుకుంది. కొంచెంసేపటికి నందకిశోర్ చేతికి అశ్రుకణాల స్పర్శతగిలింది.

'అప్పుడప్పుడు నాకంటే నువ్వు ఎంతో పెద్ద వాడివని అనుకొని ఎంతో ఆశ్చర్యపడిపోతూ వుంటాను!' అని గద్గద కంఠంతో అన్నది.

'ఏమిటండీ, మీ మాటలు మీరూను?' నందకిశోర్ నవ్వుతూ అన్నాడు— ''నక్కకూ నాగలోకానికీ చాలా వ్యత్యాసం వుందండీ! నేనో చదువులేని మూర్ఖుణ్ణి! నేను మామూలు వాణ్ణి! ఇక మీరో? చాలా తెలివిగలవారు; విద్వాంసులు! మీకూ నాకూ సాపత్యం ఏమిటి? అయినా పోనిద్దురు, అవన్నీ ఇప్పుడెందుకు ?''

'కాదు!...చెప్పు—నువ్వు నాతో వుండిపోగలవా?' అని తాపసీతరు పూడిన గొంతుకతో అడిగింది!

నందకిశోర్ ఆశ్చర్యపోయాడు. ఇదేమిటి? తాపసీతరుగుప్తా, ఎం. ఏ; లెక్చరర్ ఇలా అడుగుతుందేమిటి?

''ఇన్ని రోజుల్నించి ఎంతమందిని చూశాను, అందరూ కపట వేషధారులని తెలుసుకున్నాను. నిజమైన వ్యక్తిని ఈనాటికి చూడగలిగాను! ఆ వ్యక్తిని వదులుకోవడం నా కిష్టంలేదు. చెప్పు— నాతో వుండిపోతావా ?''

నందకిశోర్ మళ్ళీ నవ్వాడు, సన్నగా !

'పోనివ్వండి, ఇప్పుడెందుకా సంగతి ?'

'కాదు, చెప్పు ! నన్ను క్షమించావా లేదా ?'

'ఎందుకు క్షమించడం ?'

'ఆవేళ నిన్ను అవమానించాను. నాకేం తెలిసింది కాదు, ఆ రోజు !'

'నాకీ క్షమాపణలు, అవమానాలు ఏమీ తెలీదు'— నంద కిశోర్ కొంచె గంభీరంగా అన్నాడు— 'మీరేం చేసినా నాకు బాగానే వుంటుంది. అదే నా కానందం! నా ఆనందం మరొకరికి అర్థం కాకపోవచ్చు! అది నాకొక్కడికే తెలుసు !'

అత్యంత సహజ ధోరణిలో మాట్లాడిన అతని మాటలు వినేటప్పటికి తాపసీతరు కళ్ళవెంట కన్నీటిధార కట్టలు తెంచుకుని ప్రవహించింది. జీవితంలో ఇంత సహజంగావున్న మాటల వెనక ఎంతటి ఆప్యాయత ఇమిడివుందో తాపసీతరుకుతెలుసు ! ఈ మాట లలో ఎక్కడా కృత్రిమమనేదిలేదు. మోసంలేదు. గత పాతిక సంవ త్సరాలకాలంలో ఎంతోమంది ధనికుల్ని, లెక్చరర్‌లను, రచయిత లను, ఆఫీసర్‌లను — ఇలా ఎంతోమందిని దగ్గరగా చూసింది. వాళ్ళతో పరిచయం ఏర్పరచుకున్నది. వాళ్ళల్లో ఎవరూ ఈ బస్ కండక్టర్‌లాగా మాట్లాడలేదు. వాళ్ళంతా బస్ కండక్టర్‌కంటే

( మిగతా 43 వ పేజీలో )


కోరమాండల్ ఫ్యాక్టరీలో
పైకప్పు మార్చే పనిలేదు!
చార్మినార్
ఆస్‌బెస్టాస్ సిమెంట్ రేకులు రసాయనికంగా
తినివేయడాన్ని అమోఘంగా ఎదుర్కొంటాయి గనక
చార్మినార్ ఆస్‌బెస్టాస్ సిమెంట్ రేకులు. నాణ్యతతో
కూడిన ఫైబర్‌తో, ఆస్‌బెస్టాస్ సిమెంట్ ఉత్పాదనల
తయారీలో దేశంలో ఎంతో అనుభవజ్ఞులైన వారిచే
తయారు చేయబడినవి.
హైదరాబాద్ ఆస్‌బెస్టాస్
సిమెంట్ ప్రోడక్ట్స్ లిమిటెడ్.
సనత్‌నగర్, హైదరాబాద్-500 018.
ఫ్యాక్టరీలు : హైదరాబాద్ (ఆం.ప్ర.) మరియు బల్లాబ్‌గర్ హర్యానా
అత్యధికంగా అమ్ముడుపోతున్న. ఎగుమతి చేయబడుతున్న భారతదేశపు ఆస్‌బెస్టాస్ సిమెంట్ ఉత్పాదనలు
ప్రాజెక్ట్ : కోరమాండల్ ఫెర్టిలైజర్స్ లిమిటెడ్, విశాఖపట్నం వాస్తు శిల్పజ్ఞులు : ఇంజనీర్స్ ఇండియా లిమిటెడ్

HA/77-12 A

# తెలుగుతల్లి ప్రార్థన

## ఆచార్య గంధం అప్పారావు

**ఈ** గేయంలో తెలుగు సాహితీ సంస్కృతులలోని ప్రగతిని, తెలుగు పల్కుల నుడికారపు సొంపునూ సోయగాన్ని వెలార్చ ప్రయత్నించాను. ఈ పాట అందరినోట వినాలని కుతూహలంతో ఉన్నాను.

సుందరీ తెలుగమ్మ వందనాల్ గైకొమ్మ !
మందార నవపుష్పమాలలూ నీకమ్మ !
మా కన్నతల్లివీ మా భాగ్యరాశివీ
మహనీయమూర్తివీ మంజువాణివి నీవు —
సుందరీ తెలుగమ్మ వందనాల్ గైకొమ్మ.

### నా గా ర్జు న ుడు

మానవత్వపు దివ్య మార్గములు చూపినా
బహుశాస్త్రపారీణు ప్రజ్ఞాధురంధరుని
నాగార్జునుని గన్న నారీమతల్లివీ
సుందరీ తెలుగమ్మ వందనాల్ గైకొమ్మ.

### తి క్క నా ర్యు డు

భావతీక్ష్ణతనిచ్చు పదబంధములు కూర్చి
తెల్గు పల్కులలోని వెల్గులు వెలార్చియు
కవిత అల్లినయట్టి కవిబ్రహ్మ నీ కొడుకు
సుందరీ తెలుగమ్మ వందనాల్ గైకొమ్మ
మందార నవపుష్పమాలలూ నీకమ్మ

### భ క్త పో త న

పల్లెజీవితములూ ప్రతిఫలింపగజేయు
గొల్లకథలను వ్రాసి గోవర్ధనంబెత్తి
మందార మకరంద మాధుర్యమున తేల్చు
భక్తపోతన గన్న భవ్యభారతి వీవు
సుందరీ తెలుగమ్మ వందనాల్ గైకొమ్మ
మందార నవపుష్పమాలలూ నీకమ్మ.

### వే మ న క వి

హేతువాదము తోడ వెలసినా సూక్తులు
భావలోకములందు భానూదయంబులై
అజ్ఞాన తిమిరంబు నంత మొందింపగా
ప్రగతిమార్గముచూపు ప్రత్యక్షవేదాంతి
విప్లవ కవీంద్రుండు వేమన్న నీ కొడుకు
సుందరీ తెలుగమ్మ వందనాల్ గైకొమ్మ
మందార నవపుష్పమాలలూ నీకమ్మ.

### కృ ష్ణ దే వ రా య లు

దేశ భాషలయందు తెలుగులెస్సని చెప్ప
సాహితీ సామ్రాజ్య సార్వభౌముండయిన
కృష్ణరాయలు నీదు కూర్మి బిడ్డడు తల్లీ !
సుందరీ తెలుగమ్మ వందనాల్ గైకొమ్మ
మందార నవపుష్పమాలలూ నీకమ్మ.

### త్యా గ య్య

సంగీత సాహిత్య సచ్చరిత్రమ్ములూ
నాదస్రవంతిలో నాట్యమాడుచునుండ
వైరాగ్యరూపుడౌ వాగ్గేయకారకుని
త్యాగయ్య గన్నట్టి ధన్యురాలవు తల్లీ !
సుందరీ తెలుగమ్మ వందనాల్ గైకొమ్మ
మందార నవపుష్పమాలలూ నీకమ్మ !

### గి డు గు రా మ య్య

పండితుల భాషను ప్రజల భాషగ జేయ
ధైర్య స్థైర్యములతో దండయాత్రలు చేసె
పిడుగయ్య యనదగెడి గిడుగు రామయ్యనూ
కడుపార గన్నట్టి కమనీయమూర్తివీ
సుందరీ తెలుగమ్మ వందనాల్ గైకొమ్మ
మందార నవ పుష్పమాలలూ నీకమ్మ.

### వీరేశలింగం

విస్ఫులింగమువంటి వీరేశలింగముకు
సంఘ సంస్కర్తకూ సత్యవీశ్వరునకూ
ప్రియమైన తల్లివీ ప్రేమాంబురాశివీ
సుందరీ తెలుగమ్మ వందనాల్ గైకొమ్మ
మందార నవ పుష్పమాలలూ నీకమ్మ.

### గురజాడ అప్పారావు

దేశమును ప్రేమించు మంచితనమును పెంచు
దేశమంటే ప్రజలు మట్టికాదని చెప్ప
అభ్యుదయ కవిరాజు నప్పారాయని తల్లీ !
సుందరీ తెలుగమ్మ వందనాల్ గైకొమ్మ
మందార నవ పుష్పమాలలూ నీకమ్మ !

### ఆశీర్వాదం

కన్నబిడ్డలపైన కరుణజూపుము తల్లీ
ఆశీర్వదింపుమా అమృతస్వరూపిణీ
సంఘభావము నిచ్చి శాస్త్రదృష్టి నొసంగి
మానవత్వము తోడ మనునట్లు చేయుమా
సుందరీ తెలుగమ్మ వందనాల్ గైకొమ్మ
మందార నవ పుష్పమాలలూ నీకమ్మ !

## ఒక మామూలు కథ

(40 వ పేజీ తరువాయి)

బాగా చదువుకున్నవాళ్ళు; ఎక్కువ జీతం తెచ్చుకుంటున్నవాళ్ళు, సమాజంలో మంచి పేరు ప్రతిష్ఠలున్నవాళ్ళు ! మంచి తెలివి తేటలున్నవాళ్ళు! అందుకే ఈ మూర్ఖుడైన బస్ కండక్టర్ అన్న మాటల్లో ఎంత విలువవున్నదో ఆమెకు అర్థమైంది. జీవితంలో, నవలలలో, కథల్లో, వూహల్లో ఇలాంటి ప్రేమ లభ్యం కావడం దుర్లభం! తాపసీతరు ఈ దుర్లభప్రేమను పోగొట్టుకోదలుచు కోలేదు !

'నువ్వు నా దగ్గరే వుండిపోతావా ?' తాపసీతరు మళ్ళా అడిగింది !

నందకిశోర్ వెనకటిలాగానే అత్యంత శాంతమైన స్వరంతో అన్నాడు—'ఊహూఁ! ఉండను! మీ ఆరోగ్యం కుదుటపడ్డాక వెళ్ళి పోతాను. మీరనుకునే విధంగా జరగదు !'

'ఎందుకని ?'

లోకులు ఏమనుకుంటారో మీరేమైనా ఆలోచించారా ? మీరు ఎం. ఏ; చదివారు; కాలేజీలో లెక్చరర్‌గా చేస్తున్నారు. నేనా? అతి సామాన్యమైన వ్యక్తిని ! చదువులేని మూర్ఖుణ్ణి ! బస్ కండక్టర్‌ని ! ఇలా జరగటానికి వీల్లేదు !

'లోకులతో నాకేమిటి? ఇది నా స్వవిషయము! ఆ భారం మీద వదిలెయ్ !'

నందకిశోర్‌కు గాయం తగిలినట్టయింది.

'[illegible] పేరు వాతో మాటిమాటికీ అనకండి. మీరింతగా [illegible]పి వస్తున్నందుకు నాకు చాలా [illegible]టితో వుండిపొమ్మంటున్నారు; అలా వుండే అర్హత నాలోలేదు. ఒకవేళ నేను ప్రస్తుతానికివున్నా, ఆ తరువాత ఏదో ఒకరోజున నేనలా- వుండటాన్ని మీరు భరించలేక పోవచ్చు. ఇలా అని నేను మిమ్మల్ని తప్పుపట్టటంలేదు! క్షమించండి!'

తాపసీతరు చాలా సేపటిదాకా మాట్లాడలేదు.

ఆ తరువాత అతనిచెయ్యి వదిలేసింది.

'అయితే ఎక్కడికి వెళ్తావు ?'

'ఎక్కడికి వెళ్ళేది, మీకు చెప్పే వెళ్తాను !'

'అయితే పిలిచినప్పుడు రావాలి వస్తావా ?'

'వస్తాను! మీరు పిలిచినప్పుడు వస్తాను. పిలిస్తేనే!'

నందకిశోర్ ప్లేట్‌లోవున్న పూరీలు ఒక్కటొక్కటే తీసి ఆమెకు తినిపించాడు. ఆ తరువాత మూతి తుడిచాడు. తల మర్దన చేస్తూ—'కాసేపు పడుకోండి! తరువాత లేపి, వీటిని తినిపిస్తాను!' అని అన్నాడు.

చిన్నపిల్లను నిద్రబుచ్చుతారే, అలా ఆమె తల నిమురుతూ నిమురుతూ నందకిశోర్ ఆమెను నిద్రబుచ్చాడు. తాపసీతరు మొహంమీద తృప్తితో కూడుకున్న ఆనందం దోబూచులాడు తున్నది.

కొద్దిసేపటికే ఆమె నిద్రబోయింది.

నందకిశోర్ లైటు తీసేశాడు. వరండాలోకి వెళ్ళి ని బడ్డాడు. ఎదురుగా నీలాకాశం కన్పిస్తున్నది. ఆకాశంమీద ఎక్క మేఘాలు కన్పించడంలేదు— అతని మనస్సుకు మల్లేనే !

శ్రీ మాదిరాజు రంగారావు

# వజ్రాయుధం-ఒక సమాలోచనం

అభ్యుదయ సాహిత్య చరిత్రలో 'వజ్రాయుధం' మరో ఉదయ బింబం. సోమసుందర్ కృతుల్లో ప్రముఖమైందీ ప్రత్యేకంగా పేర్కోదగిందీ. ఇతని అభ్యుదయ వ్యక్తిత్వాన్ని వెలుగులోకి తెచ్చిందీ. ఇందులో కవి ఆదర్శమైన సామ్యవాదం వాస్తవ చిత్రణం ఆవిష్కృతమైంది. సంవిధానంలో ఉద్రేకాన్ని నిలుపుతూ వేగాన్ని సాధించే శిల్పం రచనకు ఔజ్జ్వల్యాన్ని కలిగిస్తూంది. ఆదర్శమూ సంవిధానమూ రెండూ సమన్వయాకృతిని పొందడంలో రచనకు విశిష్టత చేకూరింది. ఈ సందర్భంలో ఈ కవిత్వానికి వెన్నెముక ఐన ఆదర్శరూపానికి దోహదం చేసిన కాలాన్నీ విస్మరించలేం. దేశ చరిత్రగతిలో అంతర్జాతీయరంగంలో ప్రధానమైన మార్పులకు లోనవుతూ క్రొత్తరూపాన్ని దిద్దుకుంటూన్న సమయం. ఒకప్రక్క దేశ స్వాతంత్ర్యంవైపు ఉత్సాహంతో మొగ్గచూపుతూంటే మరో ప్రక్క ప్రపంచయుద్ధ పర్యవసానంగా ఆర్థిక సంక్షోభంతో క్రుంగిపోతూంటే ఎట్టెదురుగా సామాన్యుడు అడుగులు ముందుకు వేయలేని స్థితిలో ఉన్నాడు. చారిత్రక దృక్పథమూ, సామాజిక స్పందనగల కవులు ప్రత్యక్షస్థితిని గుర్తించారు. ఈ చీకటి అంచులపైనుండి ఇటు దేశభక్తి ప్రభావమూ అటు సామ్యవాద ప్రకాశనమూ, రెండూ కలసి క్రమంగా విశ్వమానవతా భావంలో ఐక్యమై ఆధునికతను సంతరించుకున్న క్రాంతి ముఖం అవతరించింది. దేశభక్తి, అభ్యుదయ భావన, విశ్వమానవత ఒక వలయంనుండి మరో వలయానికి పరిక్రమిస్తూ రచనారూపం విస్తృతినీ వికాసాన్నీ పొందింది. ఈ వలయాల్లో ఎదురయ్యే నిమ్నోన్నతాలనేకం. వీటిని అధిగమిస్తూ సామ్యవాద "సమధర్మం" నెలకొల్పుతూ పురోగమించడమే ఈ కవి ప్రధానలక్ష్యం.

ఇతని సామాజిక తత్త్వానికి గాఢత్వాన్నీ నైశిత్యాన్నీ సంపాదించి పెట్టడంతో ఆగక కార్యాచరణమే ప్రేరణగా నిలచింది అభ్యుదయ రచయితల సంఘం. అఖిల భారత స్థాయిలో 1936 లోనే ఆవిర్భవించినా, 1943లో తెలుగుదేశంలో అవతరించింది. ఈ కవి అభ్యుదయ రచయితల సంఘం కార్యనిర్వాహక ప్రముఖుల్లో ఒకరు. 'వజ్రాయుధం' వెలువడేనాటికి (1949) కవి ఊహలో, ఆచరణలో అభ్యుదయ భావన తీవ్రమైన ప్రభావం నెలకొని ఉండడం సహజం. ఉత్తాలమైన అభ్యుదయ చైతన్య తరంగాలు ఎగసి దూకే కాలం. ఎటు చూచినా క్రొత్తదనంకోసం ఆరాటం, మానవత్వపు విలువలకోసం ఆవేదన, ప్రగతిశీల దృక్పథంతో కృషీ కన్పిస్తుంది. సామాజికమైన కదలికతో సాహిత్యంలోనూ వస్తువు, భావన అభివ్యక్తి గుర్తుపట్టరానంతగా మార్పు పొందింది. ఈ ప్రభావం ఒక దశాబ్దంపాటు తెలుగుదేశాన్ని ప్రకంపితం చేసింది. ఈ స్వల్పకాలంలోనే ప్రతితేజస్వీ నవ్యప్రయోగాలు సంతరించి చిరయశస్వీగా నిలచాడు."[1] సాహిత్యంలో వీరి కృషి పర్యవసానంగా "విప్లవం, వర్గపోరాటం, దోపిడీ, బూర్జువావర్గం, జనశక్తి, తరాల పీడన కన్నీరూ వంటివి క్రొత్త కవి సమయాలుగా స్థిరపడినాయి."[2]

అభ్యుదయ రచయితల సంఘం, ఆధునికతకు వేదికగా నిలచింది. అంధ విశ్వాసాల తిరస్కారం, హేతువాద దృక్పథం, ప్రజాసన్నిహితత్వం, వాస్తవికచిత్రణం, సమస్యా విశ్లేషణంలో మార్క్సిద్ధాంతాల సమన్వయం, సామాన్యుని పట్ల సానుభూతి, వైజ్ఞానియుగ వివేకం, అన్న అంశాలు స్థూలంగా క్రొత్త సాహితీ వ్యవస్థను తీర్చాయి. ఈ "క్రొత్త" రూపం, దీనికి పూర్తిగా భిన్నమైన "పాత" స్థానంలో అవతరించింది. క్రొత్త వ్యవస్థకు బలం చేకూర్చే అభ్యుదయ శక్తులను సమీకరించే ప్రయత్నంలోని భాగమే "వజ్రాయుధం". ఈ రూప రేఖలతో నిత్యమూ అనుభవంలోకి వచ్చే జీవితాన్ని స్పందింపజేస్తూ, చేరదలచుకొన్న గమ్యాన్ని నిర్దేశిస్తూ ఆరంభమైన క్రొత్త యుగానికి "వృద్ధ జగతి సమాధిపై సమధర్మం ప్రభవిస్తూ" ప్రాతినిధ్యం వహిస్తూంది. ఆధునికతకు ప్రాతినిధ్యం వహించే అభ్యుదయోద్యమం, మానవుని ప్రయాణంలో ఎదురయ్యే నిమ్నోన్నతాలను సమానంచేసే దృష్టితో ఇందుకు కారణభూతులైన పీడకుల వ్యూహాన్ని ఛేదిస్తూ, పీడితుల అసహాయతను మార్చి శక్తివంతమైన సాధనంగా రూపొందించే అక్షరాకృతి ఈ కవితా సంపుటి.

## II

"లోపలి కోరిక" అన్న గేయం తల్లి—కవీ, ఇరువురి సంవాద రూపం. తల్లి మాటల్లో ప్రశ్నా రూపంలో మాతృ హృదయం, కవి మాటల్లో సమాధానంగా దేశ ప్రజల బంధనమూ ఆర్తి, కోరిక, నిశ్చయం, ప్రయత్నమూ, గమ్యంవరుసగా చిత్రితమైనాయి. ఈ క్రమంలో వర్తమాన స్థితి నుండి కవి కాంక్షించే భవిష్యత్తు దర్శనమిస్తుంది.

"నీ బిడ్డలు,
దిక్కులేని పిట్టలవలె
గూడులేక కూడులేక
అల్లాడుట చూడలేక, తల్లీ
నలుబది కోట్లకు మించిన
సంతానం కన్నతల్లి
నీ చల్లని దీవెనతో
పురోగమిస్తామమ్మా"

దుర్భరమైన దారిద్ర్యంతో నీడలేక, తిండిలేక క్రుగ్గే దీన జనుల దుస్థితి కరుణాస్పందంగా చిత్రితం. కవి హృదిలో నిబిడమైన క్షోభనూ ఆవేదననూ, స్ఫూర్తి కట్టించేది. మరోచోట కవి చుట్టూ అలముకొన్న నిరాశను దూరీకృతం చేస్తూ ''ఇది జనులందరికీ సరిపోయే సిరిసంపద'' గల దేశం అని మొక్కవోని ఆత్మస్థైర్యాన్నీ, ఆశా విస్ఫూర రూపాన్నీ ప్రదర్శిస్తాడు.

> ''నీ చేతుల బంధించిన
> సంకెళ్ళను త్రెంచాలని
> నీ సంతతి స్వేచ్ఛలోన
> ఊపిరి పీల్చాలని
> వర్గ రహిత స్వర్గమ్మును
> స్థాపించుటకోసం తల్లీ
> ఇది నాలోపలి కోరిక
> ఇది నా తీరని తపస్సు''

స్వాతంత్ర్యేచ్ఛతో, ఆచరణ శీలంతో పురోగమించే తత్త్వం, మాతృస్థానీయంగా స్వదేశాన్ని భావించే ఉత్తమ సంస్కారాన్ని అందిపుచ్చుకుంది. సంకెళ్ళు ఛేదించి ప్రజల దైన్య స్థితిని తొలగించి స్వేచ్ఛను సాధించి మానసికమైన ఆరోగ్యాన్ని ఆనందాన్నీ నెలకొల్పే కోరికతో ఆ పై చేరుకోవలసిన గమ్యం సమసమాజ స్థాపనం సూచితం. ఈ పంక్తులలోని కవిత్వతత్త్వానికి స్పందన రూపాలు. ఇందులో రెండు అంశాలు గమనించదగినవి. మొదటిది, స్వదేశ దాస్య విముక్తితో స్వాతంత్ర్యం పొందాలన్న ఆకాంక్ష. రెండోది కార్యసిద్ధి వెంటనే చేయవలసిన కర్తవ్యం, వర్గ రహిత సమాజ స్వప్నాన్ని యథార్థంగా దర్శించాలన్న ఆరాటం. మొదటిది తక్షణం జరుగవలసింది. ఇది మొదటిమెట్టు, తరువాతది కవి ఆదర్శమైన వర్గ రహిత సమాజ స్వప్నం, తపస్సుగానే నిలచింది. సమాజపరంగా కవి ఆదర్శాన్ని ప్రతిబింబించే ఈ ఆశాస్ఫూర్తి ఇందులో స్ఫుటంగా దర్శమిస్తుంది.

## III

> ''ధరణీచక్రం గిర గిర
> పరిభ్రమిస్తోందదిగో
> నిమ్నోన్నతముల జగతికి
> ఉద్వాసన చెబుతోంది''

'వజ్రాయుధం' లక్ష్యాన్ని నిర్దేశించే గేయం 'సమధర్మం'. ఇందులో మౌలికమైన సమస్య, పురాతనమైన శిథిలమైన వ్యవస్థను రూపుమాపి నూత్నమైన అభ్యుదయాత్మకమైన వ్యవస్థను నెలకొల్పడం. ఈ మార్పులో ఇరుశక్తుల పరస్పర సంఘర్షణలో

జనించే ఆవేశం, ఆవేదన, ఉద్దేశం రచనలో ఉత్కటమైన స్థాయి నంది వైప్లవ రూపాన్ని పొందాయి. మార్క్స్ ప్రతిపాదించిన సామ్యవాద సిద్ధాంతం ప్రపంచంలో అసాధారణమైన క్రొత్త ఆలో చనా వికాసానికీ, వ్యవస్థా నిర్మాణానికీ కేంద్రమైంది. సోవియట్ రష్యా, లెనిన్ నాయకత్వంలో మహత్తరమైన శ్రామిక విజయాన్ని సాధించి సామ్యవాద రాజ్యంగా రూపొందడంలో ప్రపంచాన్ని ఆకర్షిం చింది. దీని ప్రభావంవల్ల, అప్పటి వరకూ గుర్తించనివీ, గుర్తిం చినా శ్రద్ధ వహించనవీ ఎన్నో అంతరాలూ, ఎగుడు దిగుళ్ళూ, అంతరించి సమాజం, సమస్థితి పొందాలన్న ఆలోచనతోపాటు తీవ్ర మైన కృషి అంతటా ప్రబలింది.

*　　　*　　　*

ధ్రువతారలో లెనిన్ గురించి వ్రాస్తూ —

నీ పవిత్ర దేశం ఈ
భువిలో నిర్మిత స్వర్గం
నరజాతి విముక్తిగా
పరమావధి ధ్రువతారగా

చిరకాలం వెలుగుతుందన్న ఆశాభావాన్ని ప్రకటిస్తాడు. చారిత్రకమైన పరివర్తన దశలో పీడితులు, దళితులపట్ల నిలిచి పోరాడే వారికి ఆశాబింబంగా రష్యా నిలచింది. ఈ గేయం వ్రాసిన కాలంలో ప్రచండంగా ప్రపంచాన్ని పరివర్తింపజేసే విప్లవాత్మక మైన మార్పులను కోరే పక్షానికీ దేశమే నాయకత్వం వహించింది. ఈ సందర్భంలో శ్రీ సుప్రసన్న అభిప్రాయం గమనార్హం. "అభ్యు దయ కవులు, సంఘ కార్యకర్తలూ ఎన్నిసార్లు రాజకీయ సంబంధం లేదని చెప్పినా సంఘం వెనుకాల, ఆధారంగా కమ్యూనిస్టు పార్టీ ఉన్నదనే విషయం ఈనాడు అందరూ అంగీకరించే సత్యం".[3] చాలాకాలం క్రితమే, ప్రచలితమై ఉన్న ఈ అంశాన్ని దృష్టిలో పెట్టుకొనేకాబోలు, శ్రీశ్రీ "తాను ఏ సాంఘిక దురన్యాయాలను నిర్మూలించాలని ఆవేదన పడుతున్నాడో వాటి నిర్మూలనకే ఒక రాజకీయ పక్షం కూడా ప్రచారంచేస్తే కవి తనశిల్పాన్ని తప్పకుండా ఆ పక్షాని కంకితం చేసి తీరుతాడు. అది లోపలినుంచి పుట్టుకొని వచ్చే ప్రేరణగాని బలవంతంగా విధించిన నిర్బంధం కాదు" అన్న మాటల్లో కవుల నిర్వహణ రీతిలో మనస్తత్వానికి సంబంధించిన రెండు ముఖాలు ప్రవృత్తమైనాయి. ఒకటి ఆంతరమైన ప్రేరణకు సంబంధించిందీ, సహజమైందీ. రెండవది బాహ్యమైన పరిస్థితు లను బట్టి ఏర్పడిందీ, తత్కాలానికి సరిపడిన స్వల్పమైన లేదా వైయక్తికమైన ప్రయోజనాపేక్ష కలది. అభ్యుదయ కవులు కమ్యూనిస్టు పార్టీకి గల సంబంధంలోని సహజత్వం, లక్ష్యంలో అభిప్రాయసామ్యం ఉద్ఘాటితమైంది. ఇది నిశ్చయమైన అభిప్రాయాలుగల వ్యక్తిత్వాన్ని ప్రకటించేది. ఈ దృష్టిలో శ్రీ సుప్రసన్న మాటల్లో యధార్థం లేకపోలేదు. కవిత్వంతోపాటు విమర్శలోనూ మరొక ప్రక్కనుండి వ్యాఖ్యాన పద్ధతిలో, విశ్లేషణా రీతిలోమార్క్స్ తాత్త్విక దృక్పథం ప్రభావాన్ని ప్రసరించింది.

అశేష ప్రజా ప్రయోజనంకోసం, నియంత్రితమైన సమ సమాజాన్ని రూపొందించే ధోరణిలో అచంచల విశ్వాసంతో క్రొత్త వ్యవస్థను నిర్మించే ప్రయత్నం జరుగుతున్న సమయం. పాలితులు పాలకులమధ్య పీడితులు పీడకులమధ్య చెలరేగే తిరుగుబాటుతో- సంఘర్షణలోని తీవ్రదశ చైతన్యాత్మకమైన యుగధర్మంగా భావిత మైంది.

"పగిలివ నిశ్శబ్దంవలె
పగ్గ్రాచులు లేచినవో!"

ఇంతకాలం నోరులేక పడి ఉన్న ప్రజల మనస్సు తాడితమై విజృంభించి వెంటాడేస్థితిని వ్యజ్యమానంచేసే పై పంక్తులు సోమసుందర్ కవితాత్మను ప్రఫుల్లం చేసేవీ. "వృద్ధ జగతి సమా ధిపై సమధర్మం ప్రభవింపజేసే ఆశారూపానికి క్రియాశక్తిగా విప్లవం రూపొందింది. చరిత్రగతిలో వచ్చిన పరివర్తనావేగంతో సంఘర్షణ పర్యవసానంగా నిమ్నోన్నతాలు నశించి, పరాధీనత్వం, పురాలోకం, కృతకత్వం, వక్రగతి స్థానంలో స్వాధీనత్వం, నవలోకం, సహజత్వం, ఋజుగతి అవతరించి క్రమంగా అవనిపై "నిన్న నేడుల కృషియే రేపై" సమధర్మం ప్రభవిస్తుందన్న ఆశాకేతనం ఆవిష్కృతమైంది.

"భువి యొక విప్లవమూర్తై
నిలువు కాళ్ళ నిలుస్తోంది
అరుణారుణపతాకయై
ఆకాశం పిలుస్తోంది"

వైప్లవశక్తులు విజృంభించి జడమూ, స్తబ్దమూఐన సమాజాన్ని చైతన్యంతో జ్వలింపజేసి "భువి సమస్తసంపదలకు" సామాన్య మాన వులను "అధినాథులు"గా నెలకొల్పే ప్రయత్నంతో,

"నిద్దుర చీకటి వెలుపల
వేకువ మెలకువ పుట్టును
ఇదిగో విప్లవ దుందుభి
వినిపించిన సందేశం"

ఆలోచనా రూపంలో వికసించిన అభ్యుదయ భావన స్ఫుటంగా ప్రతిఫలమయ్యే లయాత్మక పద విన్యాసంతో చీకటినుండి ఉదయమై భవిష్యత్తు వెలుగుతూ రూపొందిన కాంతి చిత్రం "సమధర్మం".

సమధర్మంతోపాటు పేర్కొదగిన మరో కవిత 'ఖరార్ నామా'.

"జన్మెత్తిన మానవునకు
జీవితమే పరమ ధనం
అయి అది ఒక మారే
అతని కొసబడిన వరం"

సంఘంలో పురుగులవలె పుట్టి పెరిగి, అస్తిత్వమూ, ప్రయోజ నమూ ఎరుగకుండా తన చరిత్ర చెరగిపోయే మానవుడిక ఉండ బోడని కవి విశ్వాసం. భూతకాలపు మర్యాదలనే బూజును దులిపి భవిష్యత్తుకోసం తిరుగుబాటుతత్వాన్ని ప్రకాశమానం చేస్తూంది.

దోపిడి, పిరికితనం బీదరికంనుండి విముక్తమైన జీవితంలో ఆనందం, శాంతి కని ఆశించే ఉదాత్త లక్ష్యాలు. కాలం నిల్వదు. జీవితం ఆగదు. గతం తిరిగిరాదు. అందువల్ల జీవితంలో ప్రతి క్షణం ఎంతో విలువైందిగా భావితమైంది. మరోజన్మ, పరలోకం మొదలైన మూఢవిశ్వాసాలు, పరోక్షంగా తిరస్కృతమైనాయి. వాటి పేరిట జరిగే అన్యాయం, నెలకొనే అజ్ఞానం సూచిస్తూ యథార్థాన్ని గుర్తించి వివేకంతో జీవితమనే పరమధనాన్ని ఉపయోగించుకోవాలన్న ఆరాటం గుర్తింపవచ్చు. ఇది ప్రబోధాత్మక రూపంలో క్లుప్తత కలిగి సూక్తి సదృశంగా ఉంది. ఈ గేయంలో సామాన్య మానవుని రూపంలో కవి, గొంతుకొసల దేశభక్తి నిర్వచనాలతో గొంతు విడివడిన పూర్ణధ్వనిలో సామ్యవాద వ్యాఖ్యానంతో, ఉత్సాహం, త్యాగం, విప్లవం, ఆశ మొదలైన గుణాలు పుంజీభవించుకున్న మూర్తిగా కన్పిస్తాడు.

''గాయపడిన సింహంవలె
గర్జించనీ కంఠధ్వని
రాబోయే స్వర్ణయుగానికి
నీ జీవిత మొక రహదారి''

సమాజంలోని పీడితుల నావహించవలసింది సింహత్వం, కంఠంలో నినదించవలసింది గర్జాధ్వని. ఇది భవిష్యత్ సామ్యవాద విజయానికి జయభేరిగా భావించడంలో వైప్లవ సమరం సూచితం. ఇది చైతన్య శీలమైన కవి మనస్తత్వానికి చిహ్నంగా, ఆ తరువాత కవిలోని అరాజక ధోరణికన్నా నిర్మాణాత్మకమైన ప్రవృత్తికి నిదర్శనంగా కన్పిస్తుంది.

## IV

మౌన ఘోషలో మృత్యుప్రాయమైన దుర్భర స్థితిలో, సుప్తమైన అంగార కణాలు మేల్కొని ఎగసి పడే దృశ్యాలు, ఒక మారు కీలా నృత్యంతో, మరోమారు జ్వాలాహోమంతో సంఘర్షణ, విప్లవానికి సూచీ రేఖలుగా కన్పిస్తాయి.

''ఆకలి అమ్మా ! ఆకలి !
అన్నపూర్ణ గర్భగుడిని
ఆకలి గంటలు !''

'అన్నపూర్ణ గర్భగుడిని' అన్న మాటల్లో ఆవహించిన సంప్రదాయ బంధురత్వాన్ని చీల్చుకొని 'ఆకలి గంటల' ధ్వనిలో అభ్యుదయాత్మక భావతరంగం నినదిస్తూంది. ''ఆకలి, అమ్మా ! ఆకలి'' అన్న శబ్దాల్లో కరుణాత్మకమైన కవిదృష్టి మెరపువలె మెరస్తూ దేశం పొందుతూన్న దారిద్ర్య స్థితి యొక్క అమేయమైన సాంద్రతను దర్శింపజేస్తూంది.

''నాలో నరాల లోపలి
గడియారం తలుపుకు
గడియ పడిందెపుడో''

ఇది అత్యంతాధునికమైన భావచిత్రం ! గడియారం—ఎన్నికలో నవ్యమైన భావ నిర్మితిపట్ల కవి ఔత్సుక్యం కన్పిస్తుంది. ఇందులో దయనీయమైన సామాజిక రూపదర్శనంతో కవి పొందిన నిశ్చేష్ట రూపమూ ఉంది.

* * *

భగత్సింగును గురించి వ్రాసిన గేయంలో వీరుని చరిత్ర ఆధారంగా దేశభక్తి, విప్లవరూపం రెండిటి సమన్వయ రూపం లోకాన్ని ముంచెత్తే ''క్రాంతి కాల జాగృతి''గా భాసితమౌతూంది. రచన ఉద్రేకం, ఆలోచనతోపాటు నియతమైన శబ్ద శిల్పాన్ని సంతరించుకొని సాగింది.

ఒక వీరుడు
ఒక తారక
మహాకాంతి
మహాక్రాంతి !

వర్తమానంలో భగత్సింగు మరణం, భవిష్యత్తుకు క్రాంతి పథంగా భావితమైంది.

తారను పీక నులిపి చీకటి చంపింది. వీరుని పీక నులిమి పిశాచి చంపింది. ఒక తారకపోతే వేయి తారకలు బారులు తీరి అవతరించాయి.

చీకటి గుండెకు తూట్లుపడేట్లుగా. ఒక వీరుడుపోతే వేలాది వీరులు బారులుగా విప్లవయోధులై నిలచేరు. చీకటి పిశాచం అంతంతో స్వాతంత్ర్యోదయమైంది.

''చీకటి పిశాచి చచ్చెను
తాటకి వలె పూతన వలె
మేరువుగా శవం పడెను''

మొదట ప్రాణంగల రెండు రాక్షస రూపాల నిర్జీవమైన దశ, తరువాత ప్రాణరహితమైన మేరు ప్రసక్తి, క్రమంగా భయాన్ని చేకూర్చే క్రూరప్రవృత్తినీ, (జడమయమైన పర్వతం) ఆశ్చర్యాన్ని కలిగించే మౌఢ్య ప్రభావాన్నీ సూచించేవి. చీకటీ, మేరువూ ఇక్కడ అంధప్రాయమైన, స్పందన రహితమైన, లక్షణానికి ప్రతీకలు!

## V

కవి భావించే కార్మిక లోకానికి ప్రతినిధిగా ఫ్యాక్టరీ గీతం నిర్మితమైంది. దీని చిమ్నీ నుండి వచ్చే పొగ నిర్దయవలె ఉందనీ, దాని గర్జనలో భువి పేగులు దద్దరిల్లాయనీ శ్రామికుల కష్టాలకు కవి గీసిన చిత్రం, చరిత్రలో సంకట స్థితిలో పీడితులూ పీడకుల మధ్య అవిచ్ఛిన్నంగాసాగేఘర్షణ ధ్వనింపజేస్తూంది. ఎన్నోఏండ్లుగా సాగుతూన్న ఈ వ్యవస్థలో ''దేవుడు న్యాయం చేస్తాడా ?'' అన్న ప్రశ్నకు సమాధానం ఉక్తి చమత్కృతితో యజమానులు భూరి విరాళాలతో దేవుని కొనేశారంటాడు. దేవుని, ధనస్వాముల నమ్మిన బంటుగా భావిస్తాడు. సమస్త కష్టాలకూ భగవంతునిపై భారం

వేసి, కూర్చునే మనస్తత్వాన్ని నిరసిస్తూ కర్తవ్యోన్ముఖులనుచేసే లక్షణం ఉంది. దేవుని పేరిట తమ ఉనికినీ, స్థిరత్వాన్నీ కాపాడుకొనే పీడకుల మనస్తత్వమూ సూచితమౌతూంది. దేవుడు, మతం మానవ కల్పితాలు. ఇవి మార్పు కెపుడూ వ్యతిరేకం, పురోగతికి నిరోధం అన్నదే ఇతని అభిప్రాయం. కాల్పనికజగత్తులో విహరించే కన్నా యధార్థ జీవితంలో ఆచరణ రూపం ఇతని పరమలక్ష్యం. ఇదే సమాజాన్ని పురోగమింప జేస్తుందన్న విశ్వాసమూ కన్పిస్తుంది. ఈ స్థితిలోనూ ధనస్వాముల ఔద్ధత్యానికి అంతం లేకపోలేదన్న ఆశ చూడవచ్చు. ఈ సందర్భంలో శక్తిలేని హీనస్వరంతో,స్పృహ తప్పిన భుజగంతో పెట్టుబడిదారీ వ్యవస్థ వినాశ దశ సూచితం అయినా బెబ్బులి గర్జించడం మానలేదు. చిమ్నీ భుగ భుగ మని పొగ చిమ్ముతూనే ఉంది ఇంకా.

> ''యజమానుల లోహపు గుండెల
> అమానుషత్వానికి హడలే''

కూలీలంతా ఈ క్లిష్ట ఘట్టంలో సంఘటితమైన శక్తితో ఎదుర్కొని ధనమదాంధుల, అధికారుల ''కాని కారరహిత గర్వం ఆకృతియై'' నిల్చిన ఫ్యాక్టరీ ప్రజాయత్తం కావలసిన అవసరం ప్రపంచితమైంది.

ఈ కృతి చివరది ''ఆకలి నాలుకలన్నీ'' అనే గేయం. ఇది ఒకవిధంగా ఫ్యాక్టరీ గేయంలోని భావరూపానికి క్రియారూపంగా భావింపవచ్చు. ఒక ముదుసలి, చరిత్ర పూర్వగాథను నెమరువేసే స్మృతులరూపం ఇది. ఈ నులివెచ్చని జ్ఞాపకాల్లో అన్నార్తుల లోకం, పేదల శ్రమజీవుల కష్టతతీ, కలవారి కండకావరం; నిరంకుశుల కఠోరపాలనం, ఫలితంగా చెలరేగిన కల్లోల జనసందోహం—కన్పిస్తాయి. ఆకలి నాలుకలన్నీ ప్రళయంవలె గర్జిస్తే కుబేర దుర్గాలు గుభిల్లున కూలి పేదజనుల ''స్వామ్యజగతి'' అవతరించడమన్న లక్ష్యం కవి ఆదర్శరూపంగా కన్పిస్తుంది ఒక్కమారు వెనుకకు మరలి చూస్తే ఆరంభంలో—

> ''తన చరిత్ర తనే పఠించి
> ఫక్కున నవ్వింది ధరణి
> తన గాథను తనే స్మరించి

భోరున ఏడ్చింది ధరణి'' అంటూ మొదలైన ఈ కృతి చారిత్రక భౌతిక దృక్పథంతో నిర్వహింపబడింది. ధరణి తన చరిత్ర తానే పఠించి ఫక్కున నవ్వడంలో—భోరున ఏడ్వడంలో అతి నిబిడమైన వేదన వెనుక దయనీయమైన యథార్థ జీవితం ఉంది. ఎంతో కాలం గతించినా, ఎందరో రాజులు మారినా చరిత్రలో సామాన్యుని జీవితం ఏ మార్పూ లేకుండా ఏసోపానంమీద నిలచిందీ ఒక్కమారు గుర్తుకు తేవడమే కవి ప్రయత్నమంతా. చివర ఈ దుర్దశ పరాస్తమై నెలకొనే ఆనందరూపం చిత్రితమైంది.

> ''ఓహోహో! స్వప్నం కాదుగదా!
> ఎంతలోనే ఎంత మార్పు!''

సమాప్తిలో ''కాలగతికి'', ''నూత్నజగతికి'', ప్రభవించే పురిటిబిడ్డగా ఆశారూపమైన సమధర్మం ఆవిష్కృతమైంది. ఈ విధంగా సామ్యవాద భావన ఆద్యంతాలూ అనుస్యూతంగా ప్రవహించే ఈ కృతిలో భావైక్యం స్ఫుటంగా కన్పిస్తుంది

శ్రమజీవుల ఆకలి నాల్కల గర్జాధ్వనితో, చైతన్యంపొందిన జన సమూహం, రేఖదాటి; శ్రమఎరుగని వారి ఆడంబరం ఆర్భాటం అంతరించి, క్రొత్త గాలి విసరుతో ధనస్వామ్య వ్యవస్థ ఛిన్నాభిన్నమైన స్థితీ, కర్కశ పరిపాలనం అంతమొందిన దశ ప్రసక్తమైంది. చారిత్రకంగా పరిస్థితుల ఆరోహణక్రమంతో, భౌతికవాద గతితో చివరకు సామాన్యుని జీవిత వికాసం వ్యంజితమైంది. ఈనాడు దీని అవసరం ఊహిస్తే, వాస్తవంగా ఇంకా సామాన్యుని జీవితం ఒక స్థాయికి చేరుకోనేలేదు. ఎప్పటికప్పుడు ఆర్థిక వ్యవస్థలో కుదురుబాటు లోపిస్తూనే ఉంది. రాజకీయ సంక్షోభం ఉండనే ఉంది. ఈ పరిస్థితి కావ్యప్రయోజనాన్ని ఇనుమడింపజేస్తూంది.

చరిత్రలో ఒక పరిణామదశకీ కృతి ప్రతిబింబం ఒక వ్యవస్థనుండి మరో వ్యవస్థకు మారే ప్రగతిమూర్తికీ కవి ప్రతినిధి 'మహాప్రస్థానం' తరువాత పరిగణింపదగిన అభ్యుదయకృతుల్లో ఉత్తమ కృతి ''వజ్రాయుధం.''

## అ థో జ్ఞా పి క లు

(1) సోమసుందర్—శేషేంద్ర జాలం, పుట 11

(2) ,, ,, ,, ,, పుట 11

(3) సాహిత్య వివేచన. పుట 29.

శ్రీ బులుసు వేంకటేశ్వరులు

# సారస్వత వ్యాసంగము

లోకములో మనుష్యులు సాధారణముగా ననేక వ్యావృత్తులలో, వ్యాసంగములలో నిమగ్నులై యుందురు. ఏ పనియైనను చేయుచుండునే కాని మానవుఁ డేపనియుఁ జేయకుండ నుండఁ జాలఁడు. అది మానవ ప్రవృత్తి. తద్భిన్నుఁడు జడుఁడైనను గావలయును. జ్ఞానియైనను గావలయును. ఇతరుల కది యసాధ్యము.

> "కావ్యశాస్త్ర వినోదేన కాలోగచ్ఛతి ధీమతామ్
> వ్యసనేనచ మూర్ఖాణాం నిద్రయా కలహేనవా."

కావ్యశాస్త్ర వినోదములతో ధీమంతుఁడు కాలము గడపుచుండఁగా, మూర్ఖుఁడు సప్తవ్యసనములలో నొకదానితోఁ గాని ఒకదానితో నొకదానికి సన్నిహిత సంబంధము గల మఱియొకటి రెండింటితోఁ గాని నిద్రతోఁ గాని వాక్పారుష్య నిలయమైన కలహపరుత్వమునఁ గాని కాలము పోఁబుచ్చుచుండును.

కావున మానవునకుఁగల అనేక వ్యాసంగములలో 'సారస్వత వ్యాసంగము' ప్రముఖస్థాన మాక్రమించును. సారస్వత ప్రయోజనము కేవల వినోదము కాదు. కేవల కాలక్షేపము కాదు. కేవల హాస్యము కాదు. అది మానవుని ప్రవృత్తిని తీర్చిదిద్ది ఇహపర సుఖ లాభదాయకము కావలయును. అందుచేఁ కళలన్నిటికి వలెనే సారస్వత కళ పరమార్థము గొప్పది. సారస్వతము సారస్వతమునకై కాదు. కళ కళకోసముకాదు, ఇహపర సుఖ లాభములకు, ధర్మార్థ కామ మోక్షములకు. ఇది భారతీయ సాహిత్య పరమార్థము

అర్థదృష్టి కలవారికి సాధారణముగాఁ బరమార్థ దృష్టి యుండదు. అర్థము లన్నిటికంటె నుత్తమమైనది కనుకనే పరమార్థ మనుమాట వచ్చినది. పరమార్థము విలువ పరిగ్రహించినవాఁడు వట్టి యర్థము వంకకుగాని, అపార్థముల వంకకుఁ గాని పోఁడు, పోజాలఁడు. పరమార్థ దృష్టికి అంతర్దృష్టి అత్యంతావశ్యకము. అంతర్దృష్టికి తపస్సు మిక్కిలి అవసరము. తపస్సు ఏకాగ్రత నొసంగును. ఏకాగ్రత నిర్దిష్ట వస్తు నిమగ్నత నొసంగును. నిర్దిష్ట వస్తు వ్యగ్రత నిరుపమ సాహిత్య మొసంగును. కనుకనే కవి ఋషి కావలయు ననిరి పెద్దలు. 'నా నృషిః కురుతే కావ్య'మ్మను మాట సత్యము. ఋషియనఁగా Seer (చూచువాఁడు) అని యర్థము. చూచువారందఱు కవు లగుచో అంధులు తప్ప మిగిలిన వారందఱు కవులు కావలసి వచ్చును. మఱి చూచుట యననేమి? భూత భవిష్య ద్వర్తమాన విషయములు చూడఁగలుగుట, ఈ శక్తి అంతర్దృష్టికే కలదు. కనుక అంతర్దృష్టి ఋషిత్వము ననే అబ్బును. ఋషి నీతి నియమవంతుఁడు. లోక వ్యవహార విజయమున కైనను, నీతి నియమము లుండవలయును, లోకాతీత విషయ విజయమునకు నీతి నియమము లవసరము లేదనుకొనుట అవివేకము.

ఏకాగ్రమనస్కునకు, నీతి నియమవంతునకు వాక్కు స్వాధీనమగును. వశ్యవాక్కు కలవాఁడే భావ వ్యక్తీకరణకు, ఉత్తమ భావ ప్రదర్శనమునకు యోగ్యుఁడు. భావము శబ్ద గతము. శబ్దము లమృత స్వరూపములు. అక్షరములు. మిగిలినవి క్షరములు. క్షరములు కాని అక్షరములు కవికి స్వాధీనమై యుండుటకు మనోనియమ, వాఙ్మయము, ఇంద్రియ నియమాదు లవసరములు. ఇవి కలవాఁడే శుచి. శుచియే కవి కానోపును. అశుచులు కవులు కావచ్చును గాని కవులు కాలేరు. అగుట వేఱు, అనిపించుకొనుట వేఱు. కనుక 'శుచిః కవిః' అని వేదమ్మూలము. బహునీతి నియమబద్ధుఁడు, అంతర్దృష్టి యుతుఁడు, శుచి, భూత భవిష్య ద్వర్తమాన వేది ఉత్తమ కవి యగును. అట్టి కవుల రచనలు చదివి అర్థము చేసికొని ఆనందించుట, ఇహపర సుఖ లాభము లందుట. ఇది సారస్వత వ్యాసంగము. ఈ వ్యాసంగమున నున్నవా రదృష్టవంతులు.

'కవితా వ్యాసంగము' కల్ప వృక్షము వంటిది. అది కవికి, చదువరులకు, ఇపుడు, ఎపుడు ఇహపరసుఖ లాభదాయకము. సుకవి

య్యెనవాఁడు రాజ్యం మిచ్చిన నొల్లఁడు 'సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్.' సుకవివతంసులు 'ఒల్లరు నిర్జరేంద్ర పద మొల్లరు బ్రహ్మ పదంబు.' నిర్జరేంద్ర పదమునను బ్రహ్మపదమునను పతనమున్న నుండవచ్చునుగాని సుకవితా రాజపదము శాశ్వతము, పతనరహితము, అమృతము. తరతరములకు యుగయుగములకుఅది మార్గ దర్శకము. ఇహపర సుఖ శుభ లాభదాయకము. సుకవికి చావు లేదు.

ఈ దృష్టితోడనే భారతీయ మహాకవులు పరమ పావన కవితా వస్తువులు పరిగ్రహించిరి. ఆ రహస్య మెఱిఁగియే ఆంధ్ర కవులును వారి ననుసరించిరి. నన్నయాదుల భారత స్వీకృతి కదియే కారణము.

రమణీయ శబ్దములను రమణీయార్థ ప్రతి పాదకములుగ వాడి రమణీయ భావములతో సారస్వతమును రమణీయ మొనర్చిన మహాకవుల ఋణముతీర్చుకొనుటకు, ఉపలబ్ధి పొందుటకు మార్గము సారస్వత వ్యాసంగము.

శబ్దములు రమణీయములై అర్థములు రమణీయములై భావములు రమణీయములై రమణీయతను పరమావధిని జేరుటే భారతీయ సాహిత్య లక్ష్యము. ప్రాజ్ఞు లగు ఆంగ్ల విమర్శకులు కొంద ఱీ భావములు పొందియున్నవారు కలరు. అందు మాత్యూ ఆర్నోల్డు ముఖ్యుఁడు. "Sweetness and Light" అను రెండు మాటలలో సారస్వత పరమావధి నాతఁడు సూచించినాఁడు. Sweetness మృదు మధురత, Light జ్ఞానప్రకాశము. మృదు మధుర శబ్దభరితమై జ్ఞాన ప్రకాశము లక్ష్యముగాఁ గలదియే ఉత్తమ సాహిత్యమని ఆతఁ డుద్ఘోషించినాఁడు. ఆ సాహిత్య ప్రయోజన మందుటకే సాహిత్య వ్యాసంగము.

సాధు సమ్మత మైన సారస్వత వ్యాసంగము పూర్వ పుణ్య లబ్ధము. సారస్వత వ్యాసంగలోపమే అశాంతికి హేతువు. సారస్వత వ్యాసంగము ప్రశాంతి హేతువు. ప్రశాంతికన్న భాగ్యమేది? అశాంతి కన్న దారిద్ర్యమేది ? మన బాల బాలురకు బాల్యమునుండియు సారస్వత వ్యాసంగ జిజ్ఞాస కలిగించుట మన పవిత్ర విధ్యుక్త ధర్మము. మన ధర్మము మనము నిర్వర్తించినచో భావి భారత పౌరులు, నీతి నియమబద్ధులు, నిరుపమ పరమార్థ దర్శనులు అయి నిత్య సుఖమందఁగందు రనుట నిర్వివాదాంశము.

శ్రీల కెల్ల నిత్యమాల వాల మ్మగు తెలుఁగనేల వెలసె దివ్యకవితమునుపు, పండె దేశపుణ్యంబు మిక్కిలి, దివ్యకల్పవల్లి తెలుఁగుతల్లి.

ఆంధ్రి నవతరిల్లె అష్టాదశ పురాణ రాజములును కావ్యరాజములను శతక నాటకముల శాశ్వతంబులు గాఁగ, ఆంధ్రజనుల భాగ్య మతిశ యముగ.

నియమవంతుఁ డగుచు భయభక్తులం గల్గి, భారతంబు మన కుపాయనముగ
నీయ నద్భుతముగ వ్రాయఁడే నన్నయ్య, అతని కవిత మనకు అమృత మయము.

తిక్కన కవిరాజు దివ్య ప్రకాశుఁడు, భారతా ద్వితీయ భవ్యసుకవి
అతనికవిత యెల్ల ఆపాత మధురము, చదువ వలయుఁ బెక్కుసారు లదియె.

ఎఱ్ఱన సనపర్వ మెఱ్ఱనార్య నృసింహ, ఘనపురాణ మమృత కల్పము కదు
ఈ త్రిమూర్తులు మన కెప్పు డారాధ్యులు, గర్వకారణములు కదుఁ గడుఁగడు.

అంకితంబు నొసంగ నధమరాజుల కని, కంకణంబుఁ గట్టుగన్నయట్టి
పోతరాజు మనదు పూర్వ పుణ్యఫలంబు, భవ్యమైన దతని భాగవతము.

నాకుఁ జుట్ట మగును నాచన సోమన్న, పాలకురికి ఆత్మబంధు వరయ
అమ్మవంకవార లష్టదిగ్గజములు, ఎవరు బంధువు లిల నింతకంటె?

ఆ మహానుభావుఁ డైన శ్రీనాథుని, ఋణలవంబుఁ దీర్ప నెవ్వఁడోపు
కవిత కా దతనిది గంగా ప్రవాహంబు, అతనిసేవ మనకు హితకరంబు.

రాజభక్తి విడిచి రాజిల్లె ధూర్జటి, దైవభక్తి కతన ధన్యుఁ డతడు
అతని కృతులు నిలుచు నజరామరంబులై, అతని శతకరాజ మద్భుతంబు.

చాలఁ జక్కనికవి సంకుసాల నృసింహుఁ, డనుపమానుఁ డబ్బయార్యు డల్లె
కొఱవి గోపరాజు గోవిందభక్తుఁడు, అమరి రిట్లు మనకు విమల కవులు.

రమ్య భక్తియుతుఁ రామాయణ కవీంద్రు లందఱును మహాత్ము లనవరతము
వారి సంస్మరణము సారస్వతంబును, అమితలాభదాయకములుమనకు.

భారతంబు మనకు బంధురాజంబగు భాగవతము ముక్తిభాజకంబు
రమ్యఫలదమౌను రామాయణం బది, వీని మించలేవు వేఱుకృతులు.

పూర్వ పుణ్యఫలము భోజరాజీయము, సర్వ దివ్యకథల సంపుటంబు
పింగళికులసుకవి విశ్వకవీంద్రుఁడు, పద్యనవల లెల్ల వానికృతులు.

భట్టుమూర్తి కవిత భవ్యేంద్రజాలంబు, చేమకూరసుకవిసోమమహిమ
మెన్నఁదరమె యింక నెందఱో సుకవులు, ఆంధ్రభూమిఁ బూర్వ మలరఁగనిరి.

ఈసుకవి జనులది వ్యాసంగ మెంతయు, లాభదాయకం బిలాతలమున
ఆంధ్ర భారతి మన యద్భుతభాగ్యము, వందనమ్ములామెపాదములకు.

# కొత్త మనిషి

డా॥ ముకురాల రామారెడ్డి

ఎవరవోయీ నీవు, ఏ వూరు మీది ?
ఈడ నిలబడ్డావు ఏ దారినీది ?
పొరమబ్బు విడిచె కరకర పొద్దు పొడిచె,
వీధి మేడలు జిలుగు వెలుగులో మెరిసె,
సందు సందున మంది సందడే బలిసె,
ఐన, నీ ముఖముపై మౌనమే నిలిచె
ఎవరవోయీ నీవు, ఏ వూరు మీది ?
ఇట కూలబడతావు ఏ దారి నీది ?

అవయవాలా సొంతమరిగి పోయినవి,
నలభయేండ్లకె నీకు నడుమువంగినది,
ముసురుపట్టిన రాత్రి ముడిగి ఈ గుడిలో
పండుకొంటివె నిద్రపట్టినా లేదా ?
ఎవరవోయీ నీవు, ఏవూరుమీది ?
ఇట కూలబడ్డావు ఏ దారినీది ?

మన భాగ్యనగరమనె, మన భాగ్యమిదనె
రేడియోపాట ఆలించినటులేదు,
చెదరు దృష్టికి ఓర చెయిపెట్టి, ఏమో
ఎదిరి చూచెద వెట్లొ బెదిరి చూచెదవు,
పరిచయస్తుల ఇంటి చిరునామ మరిచి
పట్నమే అడవియై పస్తువండితివా ?
ఏవూరు ఐతేమి, ఎవరవైతేమి,
వస్తవా మాయింటి వరకు ఈ పూట.

కలలోన తోచినది కనులచూడంగా
ఆశపడి, తీరా నిరాశపడినావా ?
పెద్దబతుకే బతికి పేదవైనావా ?
ధర్మానికే నిలిచి దగులు పడ్డావా ?
పరిసరాలే నిన్ను పరిహసించినవా ?
కాలమే పగబట్టి కరిచి పోయిందా ?
మాయ మతములు పోటి మాటలే చెప్తే
మాట్లాడతోచక మౌనివైనావా ?

కులము కులమొక వేరు కూటమే పెడితే
తంట కులమును రోసి ఒంటివైనావా ?
ఏవూరు ఐతేమి, ఎవరవైతేమి,
వస్తవా మాయింటి వరకు ఈ పూట

దిక్కు దిక్కునచూస్తి, దేశాలుచూస్తి,
చోటిచ్చె నీవంటి చుట్టమేనాకు;
పల్లె పల్లెనచూస్తి, పట్నాలుచూస్తి,
కలిసేది నీవంటి బలగమేనాకు;
ఏవూరు ఐతేమి, ఎవరవైతేమి,
వస్తవా మాయింటివరకు ఈ పూట

ఇంతకాలము నీవు ఏగిన సొదలు
మా పాపలనుచూచి మరిచిపోదువులే
కలిగింది పెట్టించి కంచమొడ్డిస్తా
దేశవార్తలుచెప్పి దినము గడిపిస్తా
అనుమాన పడతావు అట్లచూస్తావు
వస్తవా మాయింటివరకు ఈ పూట

కొత్తమనిషిని నమ్మగూడదనేటి
పాత సామెత మీద పా యెనా మనసు
పాత లోకమువారి వచ్చింది కొత్త,
సంప్రదాయము కొత్త చట్టాలు కొత్త,
కని విని ఎరుగని కాలమిది కొత్త,
పాత సందేహాల పట్టూడగొట్టి
పాత నినాదాలు పడగొట్టె కొత్త,
పాత నిరాశను పాతేసె కొత్త,
మారేటి మనుషుల మనసులే కొత్త,

మనిషి మనిషిని కల్పు మమతలే కొత్త,
మావీధిలో నేటి మర్యాద కొత్త,
వస్తావ, నిజముగా చూస్తావుకొత్త
ఇదిగో ఇదిగో చూడు ఇది కొత్తబాట
వచ్చిపో మావీధి వరకు ఈపూట

నిరుటి చింతలు ఏవో నెమరు వేస్తావు
మా యింటి వరకురా మారిపోతావు;
'ముట్టరాకు' అనేటి మునుపటి తేడా
మావాడ చూస్తివా మరిచిపోతావు;
'మా' అనక 'మీ' అనక మాయలోపడక
మనము మనమనుకొనే మార్గమే మనది
మాయగాళ్ళను రోసి, మర్మాలు రోసి,
మనమంది సరికొత్త మనుషులైనారు.

ఇదిగో ఇదిగో చూడు ఇది కొత్తబాట
వచ్చిపో మన వీధి వరకు ఈపూట

వంచక పక్షాల వాదాలు వినరు
తమ నిశ్చయములో స్వతంత్రులైనారు,
మునుపటి తంటాలు మూలకు తన్ని
మనవాళ్లు సరికొత్త మనుషులైనారు,
తగవులాటలు పెట్టు తంటాలు అన్ని
తెలుసుకొనేపాటి తెలివైనవారు,

మనిషివలె మాట్లాడు మనిషియే వస్తే
కుశల వార్తలు అడిగి కుర్చీవేస్తారు;
మనిషివలె కనిపించి మైదు చూపిస్తే
మెడలపై చెయ్యేసి వెడల గొడతారు

మాయగాళ్ళనురోసి, మర్మాలు రోసి,
మనమంది సరికొత్త మనుషులైనారు

మనవాళ్ళ విశ్వాస మహిమలే కొత్త
మన వాళ్ళు మెచ్చిన మతము ఓ కొత్త,
భ్రమల వలలను తెంచి బైట పడ్డారు,
నామధారులచూచి నమ్మకున్నారు,
వేషధారుల ముసుగు విడిపించినారు,
చీకటి పల్లిలో చిన్న సందులలో
వెలుగు తోరణములు వెలిగించినారు,

ఇదిగో ఇదిగోచూడు ఇది కొత్తబాట
వచ్చిపో మా వీధి వరకు ఈ పూట

శ్రీ పుచ్ఛా పరబ్రహ్మశాస్త్రి

# భారతీయ ముఖ్య దర్శనములు

విశ్వము నందు పలబ్ధమగుచున్న వస్తుజాలముయొక్క తత్త్వము లేక యథార్థ స్థితిని గూర్చి తెలుసుకొనుటకై మానవుడు తన మనోబలము నుపయోగించి అతి ప్రాచీన కాలము నుండి చేయుచు వచ్చిన కృషి ఫలితముగ అనేక మతము లుద్భవిల్లినవి. భారతీయ శాస్త్రములలో వీటిని 'దర్శనము' లందురు. అంటే మానవజీవితమునకు పరమార్థమును చూపు మార్గములని యర్థము. ఇట్టి దర్శనములు శంకరాచార్యునికి పూర్వముకూడఅనేకములుండెను. శంకరుని కాలమునుండి మనకు ఆరు మాత్రమే ఆస్తిక దర్శనములుగ స్వీకరించబడుచున్నవి. అవి—న్యాయ, వైశేషికములు; సాంఖ్య; యోగములు; పూర్వోత్తర మీమాంసలు. ఇవి వేద ప్రామాణ్యమును స్వీకరించు దర్శనములుగా ప్రసిద్ధి నొందెను. శంకరునికి పూర్వము కూడ ఆరు ఆస్తిక దర్శనములు ప్రసిద్ధములై యుండెను. అవి బౌద్ధము, జైనము, న్యాయము, వైశేషికము, సాంఖ్యము, జైమినీయము (మీమాంస). ఇందు బౌద్ధ, జైనములు వేదప్రమాణము నంగీకరించకున్నను బుద్ధునిబౌద్ధులు,జినుడిని జైనులు దేవతలుగా స్వీకరించుటవలన ఆ రెండు మతములు కూడ ఆస్తికమతములే నని వారు చెప్పుకొనెడివారు. ఇంతేగాక పరలోకగతి, పుణ్య పాపములు అను ఆస్తిక సాధర్మ్యము కూడ వీరికి కలదు. వీటిని షడ్దర్శనములుగ జెప్పుచు హరిభద్ర సూరి యను జైనవిద్వాంసుడు 'షడ్దర్శన సముచ్చయమను' నొక సంక్షిప్త గ్రంథమునురచించెను. అందు అతడు మూల సిద్ధాంత భేదముల ననుసరించి దర్శనములు ''బౌద్ధం నైయాయికం, సాంఖ్యం జైనం వైశేషికం తథా, జైమినీయం చ నామాని దర్శనా నామ మూన్యహో'' అని వక్కాణించి చెప్పెను. ఈ హరి భద్రుడు అయిదవ శతాబ్దికి చెందినవాడని చెప్పుదురు. అంటే శంకరునికిపూర్వుడు. అప్పుడు వేదాంతమతము జైమినీయముతో అంతర్భావము నొందెనో లేక దానిని ప్రత్యేకించి చెప్పుట కిష్టము లేక హరిభద్రుడు తన గ్రంథములో మానుకొనెనో తెలియదు. పదునాలుగవ శతాబ్దియందు మాధవాచార్యుడు 'సర్వదర్శన సంగ్రహమను గ్రంథమును రచించెను. అందు చార్వాకము, బౌద్ధము, జైనము, విశిష్టాద్వైతము, ద్వైతము, పాశుపతము, శైవము, ప్రత్యభిజ్ఞ, రసేశ్వరము, వైశేషికము, న్యాయము, జైమినీయము, పాణినీయము, సాంఖ్యము, యోగము, శాంకర వేదాంతము అను పదహారు దర్శనములను గూర్చి వివరించెను.

ఈ వ్యాసమునందు కొన్ని ముఖ్య దర్శనములను గూర్చి స్థూలముగ జెప్పుదును ప్రతి దర్శనమందును శాఖాభేదములు, సిద్ధాంత భేదములు కలవు. వాటిని సాకల్యముగ వివరించుట ఇచట ఉద్దేశము కాదు.

## I బౌద్ధ దర్శనము

దీని ప్రవర్తకుడు గౌతమ బుద్ధుడు (క్రీ. పూ. 563 – 483). ఇది ముందు మత ధర్మముగ ప్రచారమునొంది తదుపరి దర్శనముగ ఆధ్యాత్మిక వాదమును సంతరించుకొనెను. బౌద్ధులు వేదప్రామాణ్యము నంగీకరించరు. బుద్ధుని దైవముగ స్వీకరింతురు. అతడు నాలుగు ఆర్య సత్యముల నుపదేశించెను. అవి—దుఃఖము, సముదయము, మార్గము, నిరోధము అనునవి. తత్త్వములు మూడు. అవి—ఆత్మ, మనస్సు, పాంచభౌతికశరీరము. ప్రత్యక్షము, అనుమానము అను రెండే ప్రమాణములు. మొదటి ఆర్య సత్యమగు దుఃఖము అయిదు స్కంధములుగ జెప్పబడెను. విజ్ఞానము, సత్పదార్థమెల్ల క్షణికమని తెలిసికొనుట విజ్ఞానము స్కంధము. జన్మాంతర సంపాదితములైన పుణ్య పాపములే సుఖ దుఃఖములకు మూలమని తెలిసికొనుట వేదన యను రెండవ స్కంధము. ఈ దృశ్య ప్రపంచమంతయు సంజ్ఞా మాత్రమేగాని పరమార్థముకాదని యెరుగుట సంజ్ఞయను మూడవ స్కంధము. పూర్వ జ్ఞానమును బట్టి కలుగు స్మృతి సంస్కార మనబడు నాల్గవ స్కంధము. పరమాణుసముదాయమే రూపమని యెరుగుట అయిదవ స్కంధము ఈ యైదు స్కంధములు దుఃఖమనబడు మొదటి ఆర్య సత్యము. రాగద్వేష మూలమున జనించు స్వకీయ పరకీయ భావము దుఃఖమూలమని యెరుగుట సముదయ మనబడు రెండవ ఆర్య సత్యము. దుఃఖ నిరోధమునకు మార్గము మూడవ ఆర్య సత్యము. దుఃఖ నిరోధమే మోక్షము. ఇది నాలుగవ ఆర్య సత్యము. అనగా సర్వ క్షణికత్వ సర్వ నైరాత్మ్య (శూన్య) వాసనా రూపమగు నిరోధము మోక్షము.

బౌద్ధము హీనయానమని, మహాయానమని రెండు శాఖలుగ విడిపోయెను. హీనయానము మరల సౌత్రాన్తికము, వైభాషికము అని రెండు తెగలుగను, మహాయానము కూడ మాధ్యమిక మనియు, యోగాచారమనియు రెండువిధములుగ విడిపోయెను. హీనయానులు సర్వాస్తివాదులు. మహాయానులు శూన్యవాదులు. జ్ఞానియైనపిదప కూడ తోటి మానవుల నుద్ధరించుటకు పూనుకొనవలెనని వీరి సిద్ధాంతము. అట్టివారు బోధిసత్త్వు లనబడుదురు. హీనయానమున బుద్ధుడు విశేషజ్ఞాన సంపన్నుడైన సామాన్య మానవుడు. మహాయానమున బుద్ధుడొక దైవముగ పూజింపబడును.అజ్ఞానము వలన కలిగిన జన్మ మృత్యు రూపమగు సంసారమును సచ్ఛీలము, ప్రజ్ఞానము సత్సమాధుల ద్వారా నిరోధించి మోక్షము నొందుట ఈ శాఖల వారందరికి సామాన్యమే. బౌద్ధులు వేదప్రామాణ్యము నంగీకరించరు. కర్మ సిద్ధాంతమును నిరసించెదరు.

## II జైన దర్శనము

దీని ప్రవర్తకుడు మహావీర వర్ధమానుడు. ఇంచుమించు బుద్ధునితో సమకాలమువాడు. ఈ మతమునందు జీవుడు, అజీవము అని రెండే తత్త్వములు. జీవుడు చైతన్య లక్షణుడు. జ్ఞానాది ధర్మములకంటె భిన్నుడుగను, అభిన్నుడుగను ఉండును. అనంతుడు కర్మబద్ధుడు. అజీవమనగా కర్మ. జైన దర్శనమున జీవుడు, అజీవము రెండును నిత్యము, నిరపేక్షకములు. అజీవము అయిదు విధములు. పుద్గలము (ద్రవ్యము), కాలము, దేశము, ధర్మము, అధర్మము. ద్రవ్యమంతయు నేక రూపాణు నిర్మితము. అణు సంస్థాన భేదమును పురస్కరించుకొని ద్రవ్యభేద మేర్పడెనందురు. జైన దర్శనమున జ్ఞానమే పరమార్థము. జ్ఞానము స్వయం ప్రకాశకము. అట్టి జ్ఞానము రెండు విధములు. ప్రత్యక్షము, పరోక్షము. వీటిలో ప్రత్యక్షము మరల ముఖ్య ప్రత్యక్షము, వ్యావహారిక ప్రత్యక్షము. పరోక్షముకూడ అనుమానము, శబ్దము అని రెండు విధములు. బౌద్ధులవలె వీరును వేదములను, యజ్ఞాది క్రతువులను నిరసింతురు. కర్మకూడ పరమాణు నిర్మితమైన పదార్థమందురు. అది స్వతంత్రమై ప్రవర్తించును. జైనులు శ్వేతాంబరులు, దిగంబరులు అని రెండు శాఖలుగ విడిపోయిరి. జీవితముయొక్క పరమార్థము ఇంద్రియములచే పరిమితమైన ప్రత్యక్షాది జ్ఞానమునుండి భిన్నమైన పూర్ణజ్ఞానమును పొందుట. ఈ మతమున పరస్పర విరుద్ధ ధర్మములతో కూడియున్న యీ ప్రపంచమునంతను సత్యమని భావింతురు. దీనిని సప్తభంగీనయ మందురు. 1. స్యాదస్తి (వస్తువు వున్నది కావచ్చును); 2. స్యాన్నాస్తి (వస్తువు లేనిది కావచ్చును); 3. స్యాదస్తినాస్తిచ (వస్తువు వున్నది లేనిదికూడ కావచ్చును); 4 స్యాదవక్తవ్యం (వస్తువు చెప్పబడలేనిది); 5. స్యాదస్తి అవక్తవ్యం (వుండికూడ అవక్తవ్యము); 6. స్యాత్‌నాస్తి వక్తవ్యం (లేకున్నను వక్తవ్యము కాదగును); 7. స్యాదస్తి, నాస్తి, అవక్తవ్యం (ఉన్నను, లేకున్నను అవక్తవ్యముకూడ) అని యిన్ని వికల్పములతో ప్రపంచముయొక్క సత్యమును చెప్పుదురు. అందుచే దీనిని స్యాద్వాదమని చెప్పుదురు. మరొక విధముగ జీవుడు, అజీవము, కర్మ, బన్ధము, సంసారము, నిర్జర, మోక్షము అనునవి యేడు జైనసిద్ధాంతములు. మోక్షమనగా జీవుని అనంత జ్ఞానసంపన్నునిగను, అఖండ శాంతియుక్తునిగను, అఖండ శక్తిమంతునిగను జేసికొనుట. ఇట్టిస్థితి సమ్యగ్దర్శనము, సమ్యక్ జ్ఞానము, సమ్యక్ చరితము అను రత్నత్రయము నారాధించుట మూలమున పొందగలుగునని జైనసిద్ధాంతము.

## III న్యాయము-వైశేషికము

న్యాయదర్శన ప్రవర్తకుడు అక్షపాదుడను నామాంతరము గల గౌతముడు. వైశేషిక దర్శన ప్రవర్తకుడు కణాదుడు. కొద్ది భేదముతో ఈ రెండు దర్శనములు సమానముగ నుండును. ఈ రెండు దర్శనములు తర్కశాస్త్రమని కూడ చెప్పబడును. ఇందు ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య (జాతి), విశేష (భేదజ్ఞాన హేతువగునది), సమవాయ (సంబంధము), అభావము అని యేడు పదార్థములు. వీటిలో తిరిగి అనేక భేదములు కలవు. జైనులు భౌతిక పరమాణువు లన్నియు నొకే విధముగ నుండునందురు. వీరు వాటిని వేరువేరుగ జెప్పుదురు. అంటే పృథివీ పరమాణువులు ఇతర భూతముల పరమాణువులనుండి వేరుగ నుండును. అట్లే మిగిలిన పరమాణువులుకూడ పరమాణువులు నిత్యము. ఈశ్వర ప్రేరితమై కర్మానుగుణముగ అణువులతో సృష్టి యేర్పడు చుండునని వీరి మతము. అణు భేదమునుబట్టి పదార్థ భేదము కలుగుచుండు నందురు. లేని పదార్థమే నూతన ధర్మములతో వుట్టుచుండునందురు. అందుచే వీరిది అసత్కార్య వాదమని చెప్పుదురు.

పరమాత్మ జీవాత్మ అను రెండు విధములుగ ఆత్మ ఉండు ననియు పరమాత్మ ఏకము, సర్వజ్ఞుడుకాగా జీవాత్మ అనేకము, అల్పజ్ఞుడు. నైయాయికులు ప్రత్యక్ష, అనుమాన, శబ్ద, ఉపమానములనెడి నాల్గు ప్రమాణములను అంగీకరించుదురు. కాని వైశేషికులు ప్రత్యక్ష అనుమానములను మాత్రమే స్వీకరించుదురు. ఈశ్వరునినుండి వెడలినందువలన వేదము వీరికి ప్రమాణము. ధర్మము, అర్థము, కామము, మోక్షములను నాలుగు పురుషార్థములను వీరు చెప్పుదురు. మోక్షములేక అపవర్గమనగా సుఖదుఃఖములనుండి విముక్తినొందుట. వీటిలో శరీరము, ఆరు ఇంద్రియములు, ఆరు విషయములు, ఆరు బుద్ధులు, సుఖము దుఃఖము అని మొత్తము 21 విధములగు దుఃఖములను చెప్పుదురు. ఇవి అన్నియు నివర్తించినగాని మోక్షము కలుగదని అర్థము అంటే శరీర ధారణకు మూలమగు కర్మక్షయము కావలెను. విరాగము వలనను, అధ్యయనము వలనను, తత్త్వము నెరుగుట వలనను కర్మక్షయము తన్మూలమున శరీర రాహిత్యము కలిగి ముక్తి ప్రాప్తించునందురు.

## IV సాంఖ్యము-యోగము

కొలది భేదముతో నివియు నొకే సిద్ధాంతమును బోధించును. కపిలుడు సాంఖ్యదర్శన ప్రవర్తకుడు. పతంజలి యోగదర్శనమును ప్రవర్తింపజేసెను. న్యాయ వైశేషికములందువలె ఈ దర్శనములందు కూడ పదార్థము, జీవుడు నిత్యములు. అనంతములు. దృశ్య ప్రపంచమున కంతటికి ప్రకృతియను నొకదానిని చెప్పుదురు. దీనిని ప్రధానమనియు, అవ్యక్తమనియు కూడ నందురు. ఇది సత్త్వ రజస్తమోగుణములయొక్క సామ్యావస్థ. ఈ గుణములు వరుసగ ప్రసాదము, సంతోషము, దైన్యము అను అనుభవ విశేషములచే నెరుగబడును. ఈ దర్శనములందు 25 తత్త్వములు చెప్పబడెను. అవి, పురుషుడు, ప్రకృతి, మహత్తు లేక బుద్ధి, అహంకారము, మనస్సు (=5), జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, భూతతన్మాత్రలు 5, భూతములు 5, మొత్తము 25 తత్త్వములు. అహంకారమునుండి మనస్సు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు జనించును. ఇది శరీరము. అట్లే అహంకారమునుండి మిగిలిన పది భూతతన్మాత్రలు, స్థూలభూతములు జనించును. ఇది దృశ్యప్రపంచము. మొదటి తత్త్వమగు పురుషుడుకాక మిగిలిన 24 తత్త్వములు ప్రకృతియొక్క పరిణామములు. పురుషుడికి

బంధము, మోక్షము, సంసరణము అనునవిలేవు. ఇవి ప్రకృతి యొక్క అవస్థలు మాత్రమే.

"ప్రకృతిః కరోతి, ప్రకృతిర్బధ్యతే, ప్రకృతిర్ముచ్యతే
పురుషః అబద్ధః,పురుషోముక్తః" అనిన్నీ
"అమూర్తశ్చేతనో భోగీ నిత్యః సర్వగతోఽక్రియః।
అకర్తా నిర్గుణః సూక్ష్మః ఆత్మా కాపిలదర్శనే" అనిన్నీ
"అన్యస్త్వకర్తా విగుణస్తు, భోక్తా తత్త్వంపుమాన్
నిత్యచిదభ్యుపేతః"

అని పురుషుడు అకర్త, సత్త్వరజస్తమోగుణరహితుడు. భోగియు నిత్య చైతన్యశక్తి యుతుడనియు చెప్పబడెను. పురుషుడు శుద్ధుడైనను బుద్ధియందు ప్రతిభాసించి తద్గతమగు గుణత్రయజనిత మాలిన్యముచే మలినుడుగ భాసించును. ప్రకృతినుండి పురుషుడు వేరగుటయే మోక్షము. సాంఖ్యులు ప్రత్యేకించి దైవమును చెప్పరు. ఉత్కృష్ట పురుషుడే దైవమందురు. కాని యోగదర్శనమున పురుషునికంటె వేరుగా దేవునికూడ అంగీకరించుదురు. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి యుక్తమగు అష్టాంగయోగము వలన అపవర్గము పొందవచ్చునని చెప్పుదురు.

# V పూర్వమీమాంస

వేదములోని కర్మకాండకు సంబంధించిన మంత్ర బ్రాహ్మణ భాగములకు ప్రయోగాత్మక వివరణము తెలుపుచు జైమిని ముని సూత్రములను రచించెను. అందుచేత నీ దర్శనమును జైమినీయమని కూడ వ్యవహరించెదరు. ఆ సూత్రములకు శబరస్వామి భాష్యము రచించెను. కుమారిలభట్టు, ప్రభాకరుడు కొన్ని సిద్ధాంత భేదములతో విపులముగ వివరణ గ్రంథములను రచించిరి. జైమినీయములో జీవుల కనేకత్వమంగీకరింపబడును. అట్లే భౌతిక ప్రపంచరూపమగు పదార్థముయొక్క బాహుళ్యము కూడ చెప్పబడును. కుమారిలుడు ఆరుతత్త్వముల జెప్పెను. అవి, ద్రవ్యము, గుణము, కర్మ, సామాన్యము, తాదాత్మ్యము, అభావము అనునవి. ప్రభాకరుడు మొదటి నాలిగింటినే జెప్పెను. ప్రమాణములనుకూడ కుమారిలుడు ప్రత్యక్షము, అనుమానము, శబ్దము, ఉపమానము, అర్థాపత్తి, అభావము అనుపలబ్ధి అను ఆరింటిని జెప్పెను. ప్రభాకరుడు చివరి ప్రమాణమును చెప్పడు. సర్వజ్ఞాది విశేషణ యుక్తుడగు దైవమును దేని అంగీకరించరు. కాని వేదము అపౌరుషేయము నిత్యము. అదియే పరమ ప్రమాణమందురు. అందు చెప్పబడిన కర్మలు, వాటికి సంబంధించిన అధిదైవములు, పదార్థతత్త్వము అన్నిటివి యథాతథముగ ప్రమాణమందురు. అందుచే వేదము నభ్యసించి అటుపైన ధర్మజిజ్ఞాస చేయదగును; ధర్మాచరణము చేయవలెను. కామ్యకర్మను క్రమముగ పరిత్యజించి నిత్యకర్మను మాత్రమే ఆచరించుచు శారీరక అనర్థములనుండి విముక్తి నొందుటయే మోక్షమని వీరిసిద్ధాంతము.

# VI వేదాంతదర్శనము

వేదములయొక్క చివరి భాగములందు ప్రతిపాదించబడిన తత్త్వమును ఉపనిషన్మతము, వేదాంతము అని అందురు. ఉపనిషత్తులు, వ్యాసరచితములగు బ్రహ్మసూత్రములు, మహాభారతమందలి భగవద్గీత వేదాంత దర్శనమునకు మూలగ్రంథములు. శంకరుడు వీటికి అద్వైత పరముగను, రామానుజుడు విశిష్టాద్వైత తత్త్వముగను, మధ్వాచారుడు ద్వైతముగను భాష్యములు రచించిరి. ఈ భాష్యముల కనేక వ్యాఖ్యానములు, పాఠప్రవచనాది ప్రచారములు జరుగుచు వేదాంతదర్శనము మిగిలిన దర్శనములకంటె బహుళముగ ప్రచారములోనున్నది. జీవుడు సర్వజ్ఞత్వాదివిశిష్టుడగు బ్రహ్మతో నైక్యమునొందుట మోక్షమని అద్వైతులు చెప్పుదురు. జీవుడు భక్తి ప్రపత్త్యాదుల వలన విష్ణులోకప్రాప్తినొంది నిత్యసుఖము నొందుటయే మోక్షమని విశిష్టాద్వైతులుచెప్పుదురు. భక్తిద్వారాఅవిద్యా నిర్మూలనమొనర్చి పరమాత్మయగు నారాయణ తత్త్వమును తెలిసికొనుటయే ముక్తియందురు. వైరాగ్యము, శమదమాదులు, శరణాగతి, గురుసేవనము, పరమాత్మయందు భక్తి, సర్వాత్మ సమర్పణము మున్నగునవి పరమాత్మ తత్త్వమును తెలిసికొనుటకు ముఖ్య సాధనములు. అద్వైతులు చెప్పు జీవన్ముక్తిని విశిష్టాద్వైతులు, ద్వైతులు అంగీకరించరు. వేదాంతదర్శనమును వివరించుట కీ పరిమిత వ్యాసమున సాధ్యముకాదు.

# VII శైవ సిద్ధాంతము

భారతీయ దర్శన సంప్రదాయములలో శైవముకూడ అతి ప్రాచీనమైనది. కామికాగమము, కారణాగమము, వాతూలాగమము మున్నగు 28 శైవాగమములు ఈశ్వర ప్రోక్తములనియు అవియే పరమ ప్రమాణ గ్రంథములనియు వీరు చెప్పుదురు. లకులీశు లేక నకులీశుడు శైవదర్శన ప్రవర్తకుడు ఇందు తత్వములు మూడు. 1 పశువు [జీవుడు] 2. పతి [శివుడు] 3. పాశము [భౌతిక ప్రపంచము]. పతి యనబడు శివుడు పరమ దైవము. సర్వ స్వతంత్రుడు. జీవుల కర్మానుగుణముగ విశ్వమును సృజించును సృష్టి, స్థితి, సంహార, లయ, అనుగ్రహములయందు సద్యోజాత వామదేవ, అఘోర తత్పురుష ఈశాన అను అయిదు విశేష శక్తులను కలిగియుండును. పశువు అనగా జీవుడు. క్షేత్రజ్ఞుడనికూడ అందురు 'పాశ' విముక్తుడై జీవుడు ముక్తుడగును. అట్టి స్థితిలోకూడ 'పతి'యగు పరమశివుని యధీనములోనే యుండును. వీరిని విద్యేశ్వరులందురు. పాశమను మూడవ తత్త్వము సంసార బంధము. అది నాలుగు రూపములు అవి—మల, కర్మ, మాయ, రోధశక్తియనునవి. మలమనునది జీవుని జ్ఞాన కర్మ శక్తులను తిరోధాన మొనర్చును. మిథ్యా జ్ఞానము, అధర్మము, రాగము, చ్యుతి, పశుత్వమూలము అనునవి మల దోషములు. ఈ పాశము సాంఖ్యుల ప్రకృతివంటిది. కాని జీవునితో దీని సంబంధము శాశ్వతము కాదు. చర్య, క్రియ, యోగము, జ్ఞానములద్వారా జీవుడు పాశమునుండి విముక్తుడగును. ఇందు భక్తి ప్రధానము. శైవము అనేక శాఖలుగ నుండెను. పాశు

పతము, కాలాముఖము, మహావ్రతము, ప్రత్యభిజ్ఞ కాపాలికము మున్నగునవి శైవములోని భేదములు.

## ఉపసంహారము

దర్శనములింకను కొన్ని గలవు. వీటిలో సాంఖ్యయోగములు, న్యాయవైశేషికములు, జైమినీయము, పాణినీయము మున్నగునవి శాస్త్రములుగనే యున్నవి. కాని బౌద్ధము, జైనము, శైవము, అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము. ఇట్టివి రానురాను సాంఘిక మతములుగ పరిణమించి అప్పుడప్పుడు పరస్పర ద్వేషములకు కారణమగుచున్నవి. నిజమునకు వాటి ప్రవర్తకుల ఉపదేశములందు అట్టి భేదములకు తావున్నట్లు తోచదు. ఉదాహరణకు జైమినిముని వేదమునకు దర్శనత్వము చెప్పినవాడు ఉపనిషత్తులను త్రోసిపుచ్చెనని చెప్పలేము. వేదము అంతయు వారికి ప్రమాణమే కదా! కనుక వేదాంతమును అంగీకరించకపోదు. కాని ఖిలమైపోవునను భీతితో పూర్వభాగమునకు మాత్రమే ప్రాధాన్యమునిచ్చి తన మీమాంసా సూత్రములను రచించెను. అట్లే అద్వైతులు వేదోక్త కర్మను త్యజించుటకాని, ద్వైతపరముగ భక్తిని మానుటగాని చెప్పరు. వీరి మిథ్యావాదము బౌద్ధములోని మాధ్యమికుల శూన్యవాదమును పోలియుండుటనుబట్టి వీరిని 'ప్రచ్ఛన్న బౌద్ధులని' కొందరు దూషించుదురు. మూల సిద్ధాంతమునందు భేదమున్నను కొన్ని ప్రాథమిక తత్త్వములు, ప్రమాణములు చాల దర్శనములందు పోలియే యుండును. సాంఖ్య యోగములందు చెప్పబడు పురుషుడు శైవమందు పశువు లేక జీవునితోను, ప్రకృతిని పాశముతోను స్థూలముగ సరిపెట్టవచ్చు. ఇంతకు సామాన్యులలోనే మతము వారికిని వారి దర్శనమును గూర్చిన ముఖ్య సిద్ధాంతములుగాని వాటితో నితర దర్శనముల సిద్ధాంతములకుగల భేదమెక్కడ యని యోచించుకొను శక్తిగాని చాలదు. కాని సాంఘిక మతపరముగ నొకరి నొకరు ద్వేషించుకొందురు. అర్థము తెలియని మూఢవాదులనవలె నట్టివారిని. అహింస, సత్యము, దయ, శమదమాదులగు సత్త్వసంపన్న లక్షణములు మానవజాతికే సామాన్యము. అవి ఒకరి దర్శనములోనే కలవు. మరొక దర్శనములో లేవనజాలము. ప్రాథమికావస్థలో అభ్యాసకునికి సచ్ఛీలముతో గూడిన శమదమాదులు అవశ్యాచరణీయములు. కనుక నిజముగు మోక్షార్థికి మతద్వేషములుండనే యుండవు. డాంబికాచారులకు మాత్రమే అట్టి ద్వేషములు. కనుక అది దర్శనదోషము కాదు.

# జ్యోతిర్గమయ

### సీరపాణి

బ్రతుకలేని దీపాలు
కడుపుకాల్చు కొంటున్నవి
చమురు లేక పసి వెలుగులు
కమురు కంపు కొడుతున్నవి.

తల్లి నొసట తిలకమదే
తల్లడిల్లు దీపకళిక
తండ్రిగుండె గూడుచూడు
పగల పొగిలి పొగ చూరెను

హోరుపెట్టి తలుపు తట్టు
చెడుగాలులు సుడిగాలులు
ఈ వెలుగుల దారాలను
త్రుంచేసే లాగున్నవి

పంచలోన పొంచియున్న
నీడల పీడల కూడలి
మినుకుమనే మా బ్రతుకుల
ముంచేసే లాగున్నది

ఇంటిమీద రాబందుల
ఇకిలింపులు సకిలింపులు
చూరులలో గబ్బిలాల
బారులు [illegible]రలు సాచెను

ఎవరి బ్రతుకు కూల్చామని
ఈ పోటులు ఈ పాటులు
ఎవరి కొంప కాల్చామని
ఈ దెబ్బలు ఈ బొబ్బలు

కనుపాపలు చీకటిలో
కరగి కలసిపోకముందె
మలిగి పోవనున్న జ్యోతి
వెలిగింపుము మహా ప్రభో!

# ఉద్యోగులారా! ఇది శ్రద్ధగా చదవండి.

# సమయానికి మీ అవసరాలను ఆదుకునేందుకు




# 'కుటుంబ బడ్జెట్ పథకం'లో చేరండి

మీ అవసరాలను ముఖ్యంగా ఉద్యోగస్తుల అవసరాలను దృష్టిలో ఉంచుకుని రూపొందించిన పథకాన్ని మీకు సమర్పిస్తున్నాము.
ఈ పథకం మీకెన్నో లాభాలను సమకూరుస్తుంది—నిరాటంకంగా మీరు ఆదా చేసేందుకు తోడ్పడుతుంది. మీరు ప్రతినెలా ఇంటికి తీసుకువెళ్ళే జీతంలో కనీసం 5% ఒక రికరింగ్ డిపాజిట్ ఖాతాకు జమకట్టబడుతుంది. దానిపై మీరు ఆకర్షణీయమైన వడ్డీని ఆర్జించవచ్చు.
ఇది మీ అవసరాలకు ఆదుకునేందుకు, భీమా ప్రీమియమ్ కట్టేందుకు, ప్రయాణాలకు, ఆస్పత్రి ఖర్చులకు, ఇంకా మీరు ఎదురుచూడని ఖర్చులకు—తోడ్పడుతుంది. మేము ఈ పథకం ద్వారా ఒక నెలకు ఇంటికి తీసుకువెళ్ళే జీతంగానీ లేక రూ. 1500/- రెంటిలో ఏది తక్కువైతే అది, కావలసినప్పుడు ఋణంగా తీసుకునే అనువును సమకూరుస్తాం.
ఈ విధంగా, మీరు ఆదాచేసిన సొమ్ము చెక్కుచెదరదు. వడ్డీ అందుతూనే ఉంటుంది. అంతేగాక, మీ అవసరాలను ఆదుకునే అనువుకూడా ఉంటుంది.

**మీరు ఈ 'కుటుంబ బడ్జెట్ పథకం' ఖాతా వివరాలు మా ఏ బ్రాంచీలోనైనా సరే తెలుసుకోండి.**

**బ్యాంక్ ఆఫ్ బరోడా**
(భారత ప్రభుత్వ యాజమాన్య సంస్థ)

**నేటికీ, రేపటికీ మీ అవసరాలను ఆదుకునే అనువైన సదుపాయం**

BOB

కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు

# తెలుగులో స్త్రీ వాచకములు

తెలుగులోని స్త్రీ వాచకములను గూర్చి యింతవరకు రెండు వ్యాసములు మాత్రమే వెలువడినవి.[1] కేవలము భాషా విషయిక దృష్టితోడనేగాక, సాంఘిక దృష్టితోడను నీ పరిశీలన జరుగదగి యున్నది. స్త్రీ పురుషు లిద్దరును సాంఘిక వ్యవస్థకు మూలము అందు పురుషునివలె స్త్రీయూ ప్రాధాన్యత వహించినది. అమర కోశమున అమరసింహుడు దీనిని గుర్తించియే పురుషునికి అయిదు పర్యాయ పదములు చెప్పి, స్త్రీకి నూట నలుబది నాలుగు పర్యాయ పదములు వివరించినాడు. వానికి వ్యుత్పత్త్యందే కలవు కాన నవి సాంఘికముగా నెట్లు మన కుపయోగపడినవి తెలుసుకొనవచ్చును.

తెలుగున స్త్రీ వాచకములు [2] తత్సమములు, తద్భవములు, దేశ్యములు అని మూడు విధములు. వీనిలో తత్సమములగు స్త్రీ వాచకములను గూర్చి తెలుసుకొనుట సులభమే.

తద్భవ దేశ్యముల స్త్రీ వాచకము లట్లుగాదు. అందలి స్త్రీ వాచకముల వ్యుత్పత్తి తెలియుట కష్టము.

అచ్చ తెలుగు నిఘంటువులలో దేశ్య వాచకములగు స్త్రీ పర్యాయ పదము లుండును. కాని కావ్యములలో నిఘంటువు వలె గుది గ్రుచ్చి క్వాచిత్కముగా కనబడును. అట్టి కావ్యములలో సింహాసన ద్వాత్రింశిక యొకటి.

## సింహాసన ద్వాత్రింశిక

క్రీ. శ. 1430 ప్రాంతమున నున్న కొఱవి గోపరాజు తన సింహాసన ద్వాత్రింశికలో నలువది స్త్రీ పర్యాయ పదములను నొకే సీస పద్యములో నిచ్చినాడు. ప్రస్తుత వ్యాసమున కది ప్రాతిపదికగా గ్రహించుచున్నాను.

## స్త్రీ పర్యాయ పదములు

సీ. ఎలనాగ (1) తొయ్యలి (2) యింతి (3) ముద్దియ (4)
నాతి (5) ప్రోయాలు (6) పొలంతుక (7) పువ్వుఁ
బోఁడి (8) చెలువయు (9) కలకంఠి (10) చేడియ (11)
నెలతుఁక (12) మగువ (13) మెఱుఁగుఁబోడి (14)
మచ్చెకంటి (15) యుగ్మలి (16) యాబిడ (17)
యువిద (18) వాలుంగంటి (19) యన్ను (20)
చిగురుఁబోఁడి (21) యతివ (22) పడఁతి (23)
లేమ (24) క్రాల్గంటియు (25) జాను (26)
పొలంతుక (27) కొమ్మ (28) తీఁగబోడి (29)
మడఁతి (30) తెఱవ (31) బోటి (32)

ఆ. వె. వెలఁది (33) ముదిత (34) గొంతి (35) మెలతుఁక (36)
పడతుక, (37) నెలఁత (38) యిగురుఁబోఁడి (39)
తలిరుఁబోఁడి (40) యనఁగ సతుల పేర్లు తెనుఁగున

నలువది వెలయుచుండు నిట్లు విక్రమార్క (4–221).

పై పద్యమున ఆడువారి పర్యాయ పదములు 40 గలవు. సీసము నకున్న ఎత్తు గీతి కూడ ఆట వెలదియే.

పర్యాయ పద ప్రసక్తి నిఘంటువులది కాని పద్య కావ్యము లది కాదు. అయినను, గోపరాజు ప్రథమముగా తెలుగు సాహిత్య మున, పద్య కావ్యమున దీనిని ప్రవేశపెట్టినాడు. భాషా శాస్త్ర పరి శోధన కిది యెంతయో దోహదకారి యగుచున్నది.

## సింహాసన ద్వాత్రింశిక

స్త్రీ పర్యాయ పదములు అకారాది—

1. అతివ, 2. అన్ను, 3. ఆబిడ, 4. ఇంతి, 5. ఇగురుఁబోఁడి, 6. ఉగ్మలి, 7. ఉవిద 8. ఎలనాఁగ 9. కలకంఠి [3] 10. క్రాల్గంటి, 11. కొమ్మ, 12. గొంతి 13. జాను, 14. చిగురుఁబోఁడి, 15. చెలువ, 16. చేడియ, 17. తలిరుఁబోఁడి, 18. తీఁగెబోఁడి 19. తెఱవ, 20. తొయ్యలి 21. నాతి, 22. నెలఁత, 23. నెలఁతుక, 24. పడఁతి 25. పడఁతుక, 26. పువ్వుఁబోఁడి, 27. పొలఁతి 28. పొలఁతుక, 29. ప్రోయాలు, 30. బోటి, 31. మగువ, 32. మచ్చెకంటి, 33. మడఁతి, 34. ముదిత, 35. ముద్దియ, 36. మెఱుఁగుఁబోఁడి, 37. మెలఁతుక, 3[illegible]. లేమ, 39. వాలుంగంటి, 40. వెలఁది.

## 1 అతివ [4]

అతివ– వి: స్త్రీ ఆఁడుది. భార్య. ఆం. భా. 2–104.

అతివయ పాయముం బొరయునప్పుడు– భార. విరా. 3–41 (1సం. 124 పుట)

ఆం. భా. అనగా – ఆంధ్రభాషార్ణవము–అచ్చ తెలుగు నిఘంటువు. కాన ఇది అచ్చతెనుగు పదము.

అతివ శబ్దమునకు–తిక్కన ప్రయోగమీయబడినది. కాని అంతకుముందు ప్రయోగములు గలవు.

నన్నయలో 5 ప్రయోగములు గలవు. 1. అయ్యతివతలో దరింగనియె. ఆది 3–36.. 5–81, 8–157–8–171. 4-127.

| | | | | |
|---|---|---|---|---|
| నన్నెచోడకవి | 1. | అతివ వాకడ | కు. సం. | 6–160 |
| | 2. | అతివమేను | ,, | 7–78 |
| | 3. | క్రేళ్ల మూచు నతివ | ,, | 8–6 |
| పాలకురికి | | అతివలు | పండి. మహిమ | 408పుట |
| సోమనాథుడు | | | | 472పుట |

# వ్యుత్పత్తి

పై శబ్దమునకు వ్యుత్పత్తి యీయబడలేదు. తమిళ కన్నడములసాజాత్యశబ్దమునీయబడలేదు. కావున నిదిఅచ్చతెనుగు. తమిళ కన్నడములు సాజాత్యములు గలవి. కవిప్రయుక్తములు దేశ్యములు. ఇది—అతి + వాయి—అతివ; నలువాయి— నలువ. చెలువాయి—చెలువ; చిలువాయి చిలువవలె నేర్పడినది. 'అతి'అనగా అనుకూలముగామాట లాడుట అని అర్థము. "అతికినగాని కతగదు" అని సామెత.

ఎదిరికి అతికినట్లుగా మాట్లాడునది అని అర్థము. ఇది సూచన మాత్రమే. విచారణీయము.

# 2. అన్ను

అన్ను 3. (క. అణ్ణు—త. అణంగు మదవతి; ఆడుది.

అన్నుల తిన్నని నవ్వులు కు. సం. 11–26
(1 సం. 196 పుట)

ద్రవిడపద సాజాత్యము వలన వ్యుత్పత్తి స్పష్టము. మదించిన స్త్రీ. యువతి. ఇది దేశ్యము.

అన్ను అనగా మదము. ఇది తెలుగున అన్ను కొను, అన్ను కొలుపు అను క్రియలలో గలదు.

అన్నిన మదించిన—అను క్రియగలదు.

"అన్నినయట్ల నిమ్మని సురాధిపులం జెడనాడుచున్న } కు. సం. 2–28

అన్నిన షట్పద మంజుగీతి 4–102.

పై రెండు పట్టుల—అన్నిన మదించిన, మత్తిల్లిన అని అర్థము.

'అన్ను' క్రియగా సూ.ని. లో పై ప్రయోగములున్నవి కాని అన్ను స్త్రీ వాచకముగా కు. సం. నుండి ఒకే ప్రయోగ ముదాహరింపబడినది. ఇంకను గలదు.

హొవ్వరసమన్నులు......9–108

సూ. ని. లో అన్నుక్రింద నింకను–6–702, 2–163 అచి ఆకరము లీయబడినవి.

పూ. ము. 6–702 అనగా. 6–45.

శబరగామినులన్ని—ఇది క్రియయే.

2–163. ద్వితీయాశ్వాసము 163 పద్యమను—అన్నిన యట్ల 2–28. ఇచ్చటను క్రియయే.

అన్నెక్కు స. క్రి.మదించు: మత్తెక్కు.

"నిన్ను నీ వెల్గక యన్నెక్కి క్రొవ్వి"
పండి. పురా. 434.

సూ. ని లో నీ ప్రయోగములేదు.

# 3. ఆబిడ

సూ. ని. ఆబిడ సం. (ఆ + బిడ్డ) ఆమె.

చ...ఆ, బిడమొగమట్టె కన్గొని కుబేరుని

ఉ. రా. 4–226...(1 సం. 423 పుట.)

ఇచట ఉ. రా. అనగా—ఉత్తర రామాయణము-కంటిపాప రాజుది. 17వ శతాబ్ది.

దీనికంటె గోపరాజు ప్రయోగము. పూర్వముది. సూ. ని.లో సింహాసన ద్వాత్రింశిక చేకొనబడినది గాని పై పదము నిఘంటువులో లేదు.

ఆబిడి పదము నేటికిని వ్యవహారములో నున్నది.

ఆబిడ< > ఆవిడ< >ఓవిడ. ఇది అచ్చతెనుగుపదము.

గణపవరపు వేంకటకవి'ఆంధ్రకౌముది'లో దీనిని దేశ్యముగా తెలిపినాడు. ఆబిడ నిరుడు నయ్యాటంబు నెమ్మోము బొమ్మెర పుట. 2.

# 4. ఇంతి

సూ. ని: ఇంతి వి. (సం. స్త్రీ: ప్రా. ఇత్థి అ. ఇత్థి)

1. ఆదుది—స్త్రీ.

ఉ ఇంతుల నేచు పాతక మదింతట వసు (4–28.)

2. భార్య ఇల్లాలు

సీ. తానింతియై యుండగా నొరునర్థించి హరివేడె లక్ష్మి మహత్మ్య మెంత.

కు. సం. 7.7 (7.958) (1 సం. పుట 499)

నన్నయ. ఇంతి ఆది 3–42, 6–62, 6–166 8-138, 8–144 అం. 2-44-2-151.

7 ప్రయోగములు. ఇవి యన్నియు స్త్రీ అను మొదటి యర్థముననే యున్నవి.

నన్నెచోడుడు— 2వ యర్థమున పై ప్రయోగమున్నను రెండవ యర్థమున 6 ప్రయోగములున్నవి.

(ఆ యింతి, 5–61, 5–75, 5–168, 6–160, 8–16 యింతికి. 7–7.)

ఇంతి శబ్ద వ్యుత్పత్తి సూ. నిని బట్టి ప్రాకృత తద్భవముగా చూపబడినది. (ప్రా. ఇత్థి అ.) ఇది శౌరసేనీ ప్రాకృతమని గిడుగు వారి సంస్కరణ.

ఇత్థి నుండి 'ఇంతి' వచ్చిన దనుట తద్భవ సంప్రదాయము ననుసరించి సరిగాలేదు.

ఇత్థి — ఇంతి — అగుచో,

సంహస్త్రిప్రా : హత్తి — తెలుగులో 'హంతి'కాలేదు. హత్తి గానే నిలిచినది.

ఇట్లే, తకార ద్విత్వములు బిందు పూర్వకములు కాలేదు. శక్తి—సత్తి, భక్తి—బత్తి, ముక్తి—ముత్తి.

కేతన — ''నొసలింతి తేఁటి'' అని 'ఇంతి' శబ్దమును దేశి తెలుగుగా నిచ్చినాడు. ఆం భూ. 23 ప. ఇది అచ్చ తెలుగు శబ్దము.

ఇల్ + తి — ఇంతి — ఇంటిలో నుండునది. ఇల్లాలు. ఇల్ శబ్దము ఔప విభక్తిక రూపము. ఇంటి.

తెలుగున స్త్రీ వాచక ప్రత్యయము. 'తి' ఇత్థిలోని 'తి' కాదగును.

## 5 ఇగురుఁబోఁడి

సూని. ఇగురుఁబోఁడి (ణి) వి($\sqrt{\ }$ ఇగురు 1) (ఇగురు + పోడి) చిగురువలె మనోజ్ఞురాలగు ఆఁడుది. ఆఁడుది.

సీ. ఏ పదార్థంబు నా యెదుటఁ బెట్టకమున్న
యెవ్వారి కొసగఁడో యిగురుఁబోఁడి.
పారి 1–94 (1సం. 509 పుట)

ఇగురుఁబోఁడికి తిమ్మన ప్రయోగము కన్న గోపరాజు ప్రయోగము పూర్వముది.

## 6 ఉగ్మలి

సూని. వి. ఆఁడుది; స్త్రీ నిర్వ. 8–75.

గీ. తిరిగె నింటింట...
నొట్టుపెట్టిన భంగినే యుగ్మలియును. కాశీ. 7–135.
(సం. 1–585 పుట)

నన్నెచోడఁడీ పదము రెండు పరియాయములు ప్రయోగించి నాడు.

ఏమి కారణమొ ? యుగ్మలి. 4–59.
ఒక యుగ్మలి వచ్చె. 8–56.
పాల్కురి సోమనాథుడు
ఆయ్యుగ్మలి యెటేఁగి పండి. పర్వ. 510 పుట.

ఇది అచ్చ తెలుగు పదమే. కాని ఇందు పదమధ్య సంయుక్తాక్షరమున్నది అచ్చ తెనుగున పద మధ్యమున సంయుక్తాక్షరము లుండవు. కావున వ్యుత్పత్తి అన్వేషణీయము.

కన్నడమున 'ఉగిసు' అను ధాతువున్నది. 'ఉగిసు' అనగా 'భయపడు' అని అర్థము.

అట్లయిన 'ఉగ్మలి' అనగా భయపడు స్వభావము గలదియని యర్థమగును

సంస్కృతమున స్త్రీ పర్యాయపదము 'భీరువు' కలదు. ''భయం శీలమస్యా ఇతి భీరూః'' వెఱపు స్వభావముగా గలది. (అమరము)

## 7 ఉవిద

ఉవిద వి. (సం. యువతి)

1. స్త్రీ : ఆఁడుది ''ఉవిద కన్నుంగవ మొగిచి.
భార. ఆది. 4–253.

2. భార్య

ద్వి. అవనీశ ! దమయంతి యనియెడు కాంత
మవిదఁ జేసెద నీకు నొగి నన్ను విడువు
(ద్వి. నల. 1–374. సూని 1 సం. పుట 708)

నన్నయలోమటి మూడు చోట్ల ఉవిదకు ప్రయోగములు గలవు (4–123. సభా 1–217 ఆరణ్య 2–17 2–165)

నన్నెచోడకవి

| | |
|---|---|
| ''ఉవిద మానసమున నుప్పొంగి | కు. సం. 5–127 |
| ఒక్కవలననైన ఉవిదమోము | 9– 63 |
| పదమువ్వురు విదల | 1– 74 |
| ఉవిద లింపు మిగుల | 4– 89 |

ఇది తద్భవము.

కేతన దీనిని దేశి తెలుగుగా దెల్పినాడు.
నెల్లి కొలఁకుట వీచోపు లల్లము విద. ఆం. భూ 23 ప.

## 8 ఎలనాఁగ

సూని. వి ($\sqrt{}$- ఎల') యువతి : స్త్రీ.
ఎలనాఁగ పైఁబడనేల నిలుచు భార. విరా. 2–335.
అయ్యెలనాఁగ యసంభ్రమ మంబుజ్. భార విరా 2–155
ఆం. భా. 2–104. (825 పుట)

ఎలనాఁగకు నన్నిచోడని ప్రయోగములు 3 కలవు.

| | |
|---|---|
| ఎలనాఁగ కరి బొమల్ | కు. సం 5– 36 |
| ఎలనాఁగ నా మీఁద | 6–160 |
| వనకేళి సల్పి రెలనాఁగలు | 9–110 |

ఇది సమాస పదము. ఎల+నాగ

వ్యుత్పత్తి.

మూని. ఎల' విణ (క. ఎళె. త. ఇళై.)

(దీనికి వృత్తిలోనే ప్రయోగములు కనఁబడుచున్నవి.) లేఁతది; కోమలము.

ఈ పదము సమాసపదము. ఎల+నాగ.

నాగ శబ్దమునకు పూర్వ రూపము—నంగ.

నంగ శబ్దము సూ. ని. లో లేదు. కాని, 'నంగనాచి' అని పదమున్నది.

సూ. నిలో నంగనాచి పదమునకు కనంగనాచి 'వడ్లచిలుక' అను నర్థమీయబడినది. చూ. సం. 4–502 పుట.

దీనికి కవి ప్రయోగములు 16 వ శతాబ్ది నాటివి కలవు పూర్వకవి ప్రయోగములు లేవు.

'నంగ' తో కూడిన మఱియొక పదము గలదు అది —టినంగ.

మూని. మాటినంగవి. (మాటిన+నంగ) త. మాదు ఎంగై 1. కాముకి.

మకరకేతను నర్పించు మాటినంగ కాశీ. 3–171.
2. ముగ్ధ. అవిదగ్ధ.
మాటాడ నేరని మాటినంగవు నీవు. కాశీ. 3. 62
(6వ సం పుట 221)

ఇట్లు రెండుపదముల కూడికచే నేర్పడినది. ఎలనాగ 'ఎల'' లే'గా మారుట సార్వత్రికము.

ఎలదీగ—లేదీగ, ఎలప్రాయము—లేబ్రాయము, ఇత్యాది కాని, ఎలనాగకు 'లేనాగ' అను రూపాంతరము కన్పట్టదు.

1914 లో కవిగారు కుమార సంభవము ద్వితీయభాగము అనుబంధమున 307 ఎలనాగ=యువతి. (ఎల=లేత నాగ=స్త్రీ) ద్రవిడమున ''అనంగై'' అని వ్రాసినారు.

కేతన దీనిని దేశి తెనుగుగా దెల్పినాడు.
ఎలనాగ ముద్దియ చెలువ. ఆం. భూ. 24 ప.

## 9 కలకంఠి

ఇది సంస్కృత పదము. అయినను తెనుగున పర్యాయపదముగా నీయబడినది.

గీ. సంస్కృతములయ్యు తెనుగులై సాగుకొన్ని
శబ్దములు వాని చందంబు జను నెఱుంగఁ
బనసపండును గుండ లోపల ననంగ
కంద దుంపలు నా జీరకఱ్ఱ యనంగ
(కావ్యా. వ్యా. 9–138)

దీని ననుసరించి కలకంఠి తెనుగుగా పరిగణితమైనది.

"కలకంఠి కంట కన్నీ
రొలికిన సిరి యింట నుండ నొల్లదు సుమతీ." 38 ప.

## 10. క్రాల్గంటి

క్రాల్గంటి. వి. (క్రాలు+కన్ను+ఇ) చలించునట్టి కన్నులుగల ఆఁడుది; ఆఁడుది.

నన్నయ "కలికి క్రాల్గన్నుల తెలివును" (1–3–27)
కూచిమంచి తిమ్మకవి
"చను కట్టులుగడు బలిసెనపుడు క్రాల్గంటులకున్"
(అచ్చరా. బాల. 79, నీలా 3–36)

క్రాల్గంటి—సం. తరళేక్షణ —

## 11. కొమ్మ

కొమ్మ. వి. (త. కొంబు).

తిక్కన "బొమ్మపొత్తిక లడిగితివి కొమ్మ" వి 5,304, అ 283.

"కూర్చుగుమ్మలెవ్వరీ కొమ్మలందు." కు.సం. 6–27.

## 12. గొంతి

గొంతి. వి. (సంకుంతీ) స్త్రీ.

ద్వి. కోపించి యాతఁడు గొంతి కిట్లనియె—
బస. 3. ఆ. 575పం. (బ్రౌ).

ఇది కుంతి శబ్దమునకు తద్భవముగా భారతమున ప్రయుక్తమైనది. (ఆశ్ర. 2–72.) దీనిని స్త్రీ పర్యాయపదముగా పాల్కురికి సోమనాథుడు బసవపురాణమున వాడియున్నాడు. కావున నిది తద్భవమున స్త్రీ పర్యాయ పదమైనదని మనము గ్రహింపవచ్చును.

## 13. చామ

చామ. వి. (సం. శ్యామా ప్రా. సామాక. చామత చామి)

1. యౌవనము గల స్త్రీ: యువతి స్త్రీ ఆదుది. భార్య.
చామరో.........పారి 4–16.
చామ, చాన...... ఆం. భా. 2–104.
చామతోఁగూడి... ద్వినల 1–136 పంక్తి.
(సూ. ని. 3 సం. పుట 98).

ఇది తద్భవము.

శ్యామయనగా మధ్య యౌవనము గలది.

"తన్వీశ్యామా.శిఖరిదశ నాపక్వబింబాధరోష్ఠీ. ఉ.మే.21.
శ్యామా యౌవన మధ్యస్థా మల్లినాథ వ్యాఖ్య.

కావున చామ యనగా నడిమి యౌవనము గలది. లేత యౌవనము దాటినది.

చామ శబ్దమునకు తిక్కనలో ప్రయోగము గలదు. (అను 2–310)

## 14. చిగురుఁబోఁడి

చిగురుఁబోఁడి. వి. (చిగురు+పోఁడి) చిగురువలె మనోజ్ఞురాలగు నాఁడుది. ఆఁడుది.

చిగురుంబోఁడి – కళా. 3–131.

చిగురుఁబోడులు – విక్ర. 1.74. (సూని 3 సం. పుట 123.)

కాని తిక్కనలో (అను. 5–167) గలదు.
వ్యుత్పత్తి స్పష్టము.

కేతన – దీనిని దేశి తెలుగుగా దెల్పినాడు. ముద్దియ, చెలువ, చిగురుబోఁడి—ఆం. భా. 24ప.

## 15. చెలువ

చెలువ-(ల్వ) వి. (చెలువు+అ) 1. అందముగలది; స్త్రీ ఆఁడుది.

చెలువమోము. నైష. 2–13; 5–108.
(సూ. ని 3 సం. పుట 272)

నన్నయ ప్రయోగములు. చెలువ (ఆది. 4–51, 5–17 7–223, సభ–2–166.) చెలువ శబ్దమునకు నన్నెచోడ పద ప్రయోగసూచికలో 6 ప్రయోగము తీయబడినవి. (5 130 5–135, 6–17, 7–19, 8–65, 12–195) (పుట–194). కొన్ని విడువబడినవి.

చెలువకు శీతల క్రియలు (5–136)
చెలువలు చూచిరి (8–53)
కొలని దన్ని చెలువలు (9–76)

పై గ్రంథములో (12–195) "చెలువ వోలె" అని చెలువక్రింద ఊహాయబడినది. కాని—ఆ శబ్దము చెలువకాదు.[5]

## 16. చేడియ

చేడియ (డె). వి. (సంచేటికా) 1. స్త్రీ. ఆఁడుది.
ఇట్టి చేడియలు గలరె. భార. విరా. 2–27.

2. భార్య. ఆతని చేడియ మెడ్రతాడువోసి.
హరి. పూ. 2–40.

(సూని 3. సం. పుట 292) చేడియకు నన్నిచోడని కృతిలో ప్రయోగము గలదు. చను చేడియఁ గల్గిన. 4–43.

## 17 తలిరుఁబోఁడి

తలిరుఁబోఁడి (ణి) వి. V తలిరు లేత చిగురువంటి మనోజ్ఞురాలైన ఆఁడుది. ఆఁడుది.
సీ. పా. తల్లియేగాక యీ తలిరుఁబోఁడి హర. 4.64.

ఒక్క తలిరుఁబోఁడి— (నైష 6. 63. సూ. ని. 3. సంపుట 742) తలిరుఁబోఁడికి నన్నెచోడని ప్రయోగము గలదు.
సీ పా. సాధ్యమ్ముచేసెగదమ్మ

తలిరుఁబోఁడి 5–136.

తలిరుఁబోఁడి—ఆం. భూ—24.

(ఆంధ్రభాషా భూషణము)

ఈ శబ్దమును కేతన దేశి తెలుగుగా చెప్పినాడు.

## 18. తీఁగబోఁడి

తీఁగఁబోఁడి. వి. తీఁగ + పోఁడి తీఁగయొక్క పోఁడిమికలది; చక్కని యాఁడుది: ఆఁడుది ఎలదీఁగ బోఁడి కృపయించుకగాల్కల్. హరిశ్చ. 4.87

ఇందు సింహాసన ద్వాత్రింశిక—యీయబడినది.

తీఁగబోఁడి మడఁతి తెఱవబోటి ద్వా. 4–203.

**పూర్వప్రయోగము** సూ. ని. 3. సం. 853 పు.

రాగమంజరి యనియెడి తీగబోఁడి. దశకు 6–28

## 19. తెఱవ

**తెఱవ**—వి. (త. తెఱవై) తెఱ + వాయి=రహస్యము దాచనేరనిది—అని చి. ని.) 1. ఆఁడుది భార్య.

తెఱవపిండు. **భార.** విరా. 2.335

**తెఱవల** చుట్టములు—భార. ఆర. 4-295 (సూ. ని. 4 సం. పుట 37.)

తెఱవ—నన్నెచోడకవి ప్రయోగములు—తెఱవ నీలేతమై 5–139, 6–116, 10–48: కేతన దేశి తెలుగుక్రింద ఇచ్చినారు [230 పుట]

తెఱవ తలిరుఁరుబోఁడి. ఆం. భూ. 23 ప.

అచ్చతెనుగు రీతిగా నిట్లు వ్యుత్పత్తి చెప్పవచ్చును:

తెఱ + వ: పరిమళించు నోరుగలది

తెఱలు=అ. క్రి. (వాసన) బయలు వెడలుట. (శ. ర.)

## 20. తొయ్యలి

తొయ్యలి. వి . (త. తైయల్) తోయలి : స్త్రీ
తొయ్యలిఁజూచి యెవ్వతెవు. దశకు. 3.27

తూలు సమస్త ధర్మములు తొయ్యలి. మను చ. 2.53 [సూ.ని. 4–106 పుట].

తొయ్యలి వీరె దేవతలు. నైష, 5–21.
ఇది దేశ్యము.

తొయ్యలి. దేశితెనుగు.
భాగు తొయ్యలిబోటి ప్రన్నన సరిజోడి ఆం. భూ. 23 ప.

## 21. నాతి

నాతి=నాతుక—వి. (క. నాతి. త. నాటి) స్త్రీ—ఆఁడుది.

నాతులు నవమాసమ్ములు నిండుడు. భార. ఆర. 3.216.

నాతుల కారించుట. భార ఉద్యో. 2–86. ( సూ. ని. 4 సం. 621 పుట)

నన్నయ- అన్నాతి వీక్షించి. ఆది 3–159– పండి వాద– 629 పుట.

ఇదియు దేశ్యమే.

## 22. నెలఁత

నెలఁత—నెలఁతుక. వి. 1. స్త్రీ. ఆఁడుది.

ఈ నెలఁతఁగన్న మన్మథుఁడైన భార. విరా. 2.28.

నెలఁత నీవెవ్వరు—రం. రా. ఆర. 177 పా.

దైత్యులన్ గన్ననెలంత ఉ. రా. 2–229. 4 సం. పుట 670.

**తమిళ** కన్నడ భాషలలో దీనికి సాజాత్యపదము లేకపోవుట చేత ఇది అచ్చ తెనుగు పదము.

నన్నెచోడకవి
నెలఁతల పరిమళ నిశ్వాస పవనంబు. 4–111.
సరోవరంబు నెలఁత సొచ్చిన. 5–117.
నెలఁతలు కొందఱు క్కొలని నీళుల 9–83.
పుట 259.

**ఈ** నెలంత లలాటంబు లేనెలంత. విజ. 1.132.

నెలఁత అంటే నెల తప్పేది అని గిడుగు సీతాపతిగారి చమత్కారము—

నిఘంటువుల వ్యుత్పత్తిలేదు.
నెలఁత — నెలతో సంబంధించినది.
నెల (తనిలా) చంద్రుఁడు, సూని. 4 సం 869 పుట.

నెలయనగా ఋతుకాలము. ఋతుకాలమునకు చంద్రునకు సంబంధము గలదు.

నెలఁ గలనైన నన్ను గరుణింపఁడు శుక. 2–112
నెలఁత—అనగా రజోదర్శనము గలదియని వ్యుత్పత్తి.

## 23. నెలంతుక

నెలంతుక మాటలు. భార. విరా. 2–295.

నెలంత రూపాంతరము.

## 24. పడంతి

పడంతి=పడంతుక పణంతి. మడంతి. వి. (క. పడతి) స్త్రీ=ఆడుది.

పడంతుల సంతోషమేల నాకు. భార. విరా. 4–59.

పడంతీ! ఇవి శిశువు నం దడంగిడు హరి. **పూ.** 5.224.

పడంతు లాద–నీలా 2–110 (5 సం. పుట 104).

నన్నెచోడకవి ప్రయోగములు అయిదు గలవు.

పడతులు. 4–86, 5–74, 9–14, 9–91, 9–115.

పడంతర్పుష్య పణ్యముల్. పండి. మహి. 135 పు.

## 25. పడంతుక

పొగడిరెల్ల పడంతు కలును. హరి. పూ. 5–165.

ఇది దేశ్యము. వ్యుత్పత్తి :

పడ + తి = పడుధాతువు నుండి పడుచు ఏర్పడినది. యౌవనవతి యర్థమున్నది. పడుపుగత్తె అనునది ఈ యర్థమందే గలదు.

అప్పుడు పడంతి అనగా యౌవనవతి అని వ్యుత్పత్తి. పడు ధాతువు పడుక. పడకతో సంబంధించినది. తెలుగున 'పడ్డ' అని మఱియొక పదము గలదు.

''అది పడ్డలాగ పెరిగింది. పెండ్లిచెయ్యాలి'' అని నానుడి.

పడ్డ అనగా మొదటిసారిగా చూలుకు వచ్చిన ఆవు. తొలి చూలు ఆవు. శ. ర.

పడ్డ—పడ—పడ + తి=పడంతి.

## 26. పువ్వుంబోణి

పువ్వు(వు)ంబోఁడి (ణి) వి. పువ్వు + పోఁడి. బ.

పువ్వుంబోఁడులు :

పువుంబోఁడులు.

పువ్వువలె మనోజ్ఞురాలగు ఆఁడుది; ఆఁడుది.

పువ్వుంబోఁడ్లు. దశా. 3.23. 5 సంపుట 550.

(సం. కుసుమ కోమల). దీనికి పూర్వ ప్రయోగము కలదు.

పువ్వుంబోఁడుల హృదయంబు లెవ్వఁడెఱుఁగు.

నైష–7–162.

ఇది అచ్చ తెనుగు. సమాస పదము.

## 27 పొలంతి

పొలంతి (లి) వి. (క. పొలంతి) స్త్రీ: ఆఁడుది

పొలంతికి విగళద్భూరి స్తన జనిత పయోధారలు.

భార. ఆది. 6–20

పొల్తి భవత్సుతులైన పాండవుల్. సభా. 2–214.

ఎన్నయ పొలంతులు. ఆది. 1 – 119, 4 – 151, 7 – 73, 7–198. (5. సం పుట 814)

సభా. 2–268.

నన్నెచోడ కవి ప్రయోగములు.

పొలంతి. 5–135, 7 – 22, 8 – 64. పొలంతుల 6–116. (పుట 292)

ఈ క్రింది ప్రయోగము విడిచి పెట్టఁబడినది.

అప్పొలంతి కురులు. 3- 70

పొలంతి చాకలదేవి. పండి. పర్వ. 471 పుట

## 28 పొలంతుక

పొలంతు (ల్తు) క. వి. (పొలంతి + ఉక, స్వార్థమున) స్త్రీ : ఆఁడుది.

పొలంతుక నొక్కర్తు భార. అర. 3–266.

పొల్తుక. కాశి. 3–45

పొల్తుక పొందు. 2-117ల్తు (యతి)

పొల్తుక శబ్దమునకు కాశీ ఖండము కన్నను పూర్వప్రయోగములు కలవు. నన్నెచోడకవి.—

పొల్తుక గళమునఁ బూసికొనుచు 8– 66

రాగంబుతోడ పొల్తుక 8–101.

పొలుంతుకకు పొలంతుక — అను రూపము గలదు.

వెతలంతూలు నేల పొలంతుక–అచ్చ. రా. కిష్కిం. 62 (17 వ శతాబ్ది)

పొలుంతి.

పొలంతి శబ్దమునకు 'పొలుంతి' అను రూపాంతరము.

కుమార సంభవమున మూడు పట్టుల కన్పట్టుచున్నది.

I పొలుంతు లన్నింటికిని పోలుపొందు గాఁగ (9–10)

II గీ............కర్ణ

పూరసులువెట్టి తూఁగాడు పొలుఁతు లొండ్లు (9–13)

III బుద్ధీంద్రియంబుల పొలుఁతులు నాఁజాలు (12–220)

పై మూడు చోట్లను సరియైన రూపము పొలఁతులుగాని పొలుఁతులు కాదు.

(I) (II) ఈ రెండును పార్వతికి పెండ్లి యలంకారము చేయు సందర్భములోనివి.

9–10 దీనికి సంబంధించిన సీస పద్యమున పై నాలుగు పాదములలోను —

చందన మలంది
విరులమర్చి
అంజనము నమర్చి
వన్నె వూన్చి

సీ. పొలుఁతు లన్నింటికిని బోలు పొందుగాఁగ
నెఱయఁ గైసేయు నెపమున మఱువుసేసి
మేల కగ్గలమై పర్వు మెఱుఁగులెల్ల
వరుస నలఁతికిఁ దెచ్చిరి వెరపు మెఱసి

ఇచట పొలఁతులు — అనియే యుండవలెను.

రెండవ పద్యమున (9–13)
పొలుఁతు లొండ్లు అనుచూ
పొలఁతు లొండ్లు (ఇతర స్త్రీలు) అనియే యర్థము.

పొలుఁత,పొలుఁతులు ఈ రూపములు నిఘంటువు గ్రహింప లేదు. ''పొలుఁతి'' శబ్దమునకు ఉన్మధ్యముగా యతి స్థానమున ప్రయోగము లభ్యము కాలేదు.

నన్నెచోడ పదప్రయోగ సూచికలో నీమూడును చూపబడినవి. నిఘంటువున లేనందున త్యాజ్యములు 'పొల్తుక'–నుండి 'పొలుఁతుక' ఏర్పడవచ్చును. కాని అది 'పొలఁతి + ఉక' ప్రత్యయము చేర్చిన తరువాత ఏర్పడిన రూపము. కావున 'పొలుతి' రూపము లేదు.

పొలింతి

పొలింతి వదన లీలఁ బొలిచె — 9–64. ముద్రితము నీ రూపము గలదు. నిఘంటువులు దీనిని గ్రహింపలేదు.

కవిగారు కుమార సంభవము. ప్రథమ ముద్రణమున 2 వ భాగము(1914)న నిట్లు పై శబ్దమును గూర్చి వ్రాసినారు. 6

''పొలింతి=స్త్రీ — ప్రోలుచునది కావున పొలింతి.

''లీలకు గావరిల్లిన — పొలింతులతో నడయాడి.

అర్థ. 4-263.

గ్రంథనామ సంకేతములలో (పుట 64)

పూరసులువెట్టి తూగాడు పొలుతు లొండ్లు (9–13)

III బుద్ధీంద్రియంబుల పొలుతులు నాజూలు (12–220)

పై మూడు చోట్లను సరియైన రూపము పొలంతులుగాని పొలుతులు కాదు.

(1) (11) ఈ రెండును పార్వతికి పెండ్లి యలంకారము చేయు సందర్భములోనివి.

9–10 దీనికి సంబంధించిన సీస పద్యమున పై నాలుగు పాదములలోను —

చందన మలంది
విరులమర్చి
అంజనము నమర్చి
వస్త్రు పూన్చి

పొలుతు అన్నింటికిని బోలు పొందుగాగ
నెఱయం గై సేయు నెపమున మఱువుసేసి
మేల కగ్గలమై పర్వు మెఱుఁగులెల్ల
వరుస నలంతికిం దెచ్చిరి వెరపు మెఱసి
ఇట పొలంతులు — అనియే యుండవలెను.

రెండవ పద్యమున (9–13)
పొలుతు లొండ్లు అనుచూ
పొలంతు లొండ్లు (ఇతర స్త్రీలు) అనియే యర్థము.

పొలుతి, పొలుతులు ఈ రూపములు నిఘంటువు గ్రహింప లేదు. "పొలుతి" శబ్దమునకు ఉన్మధ్యముగా యతి స్థానమున ప్రయోగము లభ్యము కాలేదు.

నన్నెచోడ పదప్రయోగ సూచికలో నీమూడును చూపబడి నవి. నిఘంటువున లేనందున త్యాజ్యములు 'పొల్తుక'—నుండి 'పొలుతుక' ఏర్పడవచ్చును. కాని అది 'పొలంతి + ఉక' ప్రత్యయము చేర్చిన తరువాత ఏర్పడిన రూపము. కావున 'పొలుతి' రూపము లేదు.

పొలింతి

పొలింతి వదన లీలం బొలిచె — 9–64. ముద్రితము నీ రూపము లేదు. నిఘంటువులు దీనిని గ్రహింపలేదు.

కవిగారు కుమార సంభవము. ప్రథమ ముద్రణమున 2 వ భాగము (1914) న నిట్లు పై శబ్దమును గూర్చి వ్రాసినారు.[6]

"పొలింతి = స్త్రీ — ప్రోలుచునది కావున పొలింతి.

"లేంకకు నారకిల్లిన — పొలింతులతో నడయాడి.

అర్థ. 4–263.

గ్రంథనామ సంకేతములలో (పుట 64)

అరనేమి చంద్రుని అర్ధనేమి పురాణము అని కలదు. అర్ధనేమి పురాణము కన్నడముననే యున్నదిగాని తెలుగున లేదు. కవిగా రుదాహరించిన పాదము స్పష్టముగా తెలుగు ఉత్పలమాల పాదమని — లీలకు, గాతరిల్లిన అను ప్రత్యయ క్రియా రూపముల వలన ఆ పాదము కన్నడముగాక— తెలుగేయని స్పష్టపడుచున్నది. ఇంకొకటి.

కన్నడమున యతిలేదు.

"కన్నడకై యతి యిల్లె, కోణంగి మతియిల్లె" అని కన్నడమున సామెత గలదు.

పై పద్య పాదమున యతి స్పష్టముగా గాన వచ్చుచున్నది. ఇంకను విచారణీయము.

వ్యుత్పత్తి.

పాల శబ్దమునకు రజస్రావము గలది యనియర్థము.

పాలపాడు — క్రీడించు అను క్రియ దీనికి సంబంధించినది.

## 29 ప్రోయాలు

ప్రోయాలు. వి. ప్రోపు+ఆలు (ప్రోలు+ఆలు అని శ. ర) ఇల్లాలు; భార్య; స్త్రీ,

వేల్పుప్రోయాలు - రామా. 1-8

జవ్వని బిత్తరి చానప్రోయాలు ప్రబంధ. 267

గుజ్జుప్రోయాల — పారి. 3-38

అచ్చరప్రోయాలో—విజవి. 2-47 (5సం. పుట1008)

పురులు=అనగా సౌభాగ్యము, పురులు+ఆలు=అలు అనగా స్త్రీ. పురులు—ద్రవిడ భాషలో పురుళ్. అప్పుడు పురుళ్ + ఆలు పురుళాల్ ప్రోయాలు కాదగును.

## 30. బోటి

బోటి=బోటి కత్తియ. వి. 1. ఆడుది=స్త్రీ. భార్య. బ. బోటులు బోంట్లు — ఇది సానుస్వారమని — చిని నిరనుస్వారమని శ. ర. ఈ క్రింది రంగనాథ రామాయణాది ప్రయోగములు సానుస్వారమనుటకు నిర్ధారకములు. నిరనుస్వారమనుటకు గొన్ని ప్రయోగములు కానవచ్చుచున్నవి. అయినను బోంట్లు—అను బహువచన రూపమును బట్టి సానుస్వారమనుట యుక్తమని తోచెడిని. ఇంకను విచార్యము.

ద్వి. తేటి యిచ్చటం దమ్మితేనె గ్రోల్కరణి
బోటి కెమ్మోవి నెప్పుడు గ్రోలువాడ

రం. రా. కిష్కిం. 198—పా.

బోటి మదికింపు గాదయ్యె నాట పాట—నైష. 2-113.

ఇందు సింహాసన ద్వాత్రింశిక ప్రయోగము చూపఁబడినది. నాటి సాహసమున నిట్టి బోటి గలిగి 2-144. 5 సం. పుట 1170.

వ్యుత్పత్తి సూ. ని.లో వ్యుత్పత్తిలేదు.

బోటి దేశి తెలుగు.

బాగు తొయ్యలిబోటి ప్రన్నన. సరి జోటి

ఆం. భూ. 23 వ.

## 31. మగువ

మగువ—వి. (క. మగువు, త, మగవు=బిడ్డ మగువు+అ?) 1. స్త్రీ: ఆఁడుది.

మగువల భార. విరా. 2-261.

మగువ గలదె విక్ర. 1-119

మగువను వ్రాయించి నైష. 1-74.

6 సం. పుట 55.

నన్నయ మగువఁలులోమ—ఆది 1-130, 2-84. సభా. 2-85—అర. 2-119 అర. 2-89.

నన్నెచోడకవి మగువశబ్దము ప్రయోగించినాడు.

మగువ 8-62, 9-162, మగువలకు 9-126.

మగువలు—4-118;7-136.

సూ. ని.లో మగువు+అ? ప్రశ్నార్థకమున్నది.

వ్యుత్పత్తి. మగు+వ. పరిమళించు నోరుగలది.

మగిసు—పరిమళించు-కన్నడ ధాతువు.

ఇది చెలువ గణములోనిది.

క. మృగమద సౌరభ సార
ద్విగుణిత ఘనసార సాంద్రవీటీ గంధ
స్థగితేతర పరిమళమై
మగువ పొలుపు దెలుపు నొక్కమారుత మొలసెన్

మను—2.

ఈ ప్రయోగము సూ. ని.లోలేదు. ఇచట మగువ శబ్దము సరసముగా సార్థకముగా ప్రయోగింపబడినది.

పై పద్యమున నన్నియు పరిమళ ద్రవ్యములే.

మృగమద—కస్తూరి.

ఘనసారము—కర్పూరము

వీటీగంధము—పై రెండు నుపయోగించిన తాంబూలము.

పై మూడును పరిమళములైనప్పుడు — 'మగువ' అను పదము పరిమళయుక్తముగా నుండుట విశేషము—మగు + వ. పరిమళించు నోరుగలది.

అర్థ ధ్వని మనుచరిత్ర టీకలలోలేదు.

నాల్గవది మారుతము—ఇది పరిమళ యుక్తమైనదే.

మారుతమునకు శైత్య, సౌరభ్య, మాంద్యములు లక్షణములు. వాయువునకు గంధవహుడు అనిపేరు.

గంధస్యవహో గంధవః గంధం వహతీతి గంధవాహ; వహ ప్రాపణే—గంధము—సౌరభము—వహించువాడు. (అమరము)

సౌరభమిచ్చు గంధవహు చందమునన్. నిర్వ. 1–5.

## 32. మచ్చెకంటి

మచ్చెకంటి. వి. మచ్చెము + కన్ను సం. మీన నేత్ర.. చేపవంటి కన్నులుగల స్త్రీ.

చూ మది మచ్చెకంటి. హరి. పూ. 2–5. సం. మీన నేత్ర. (6 సం. 62 పుట.)

## 33. మడంతి

మడంతి=మడంది. వి. క, మడదిత. మడంద్ర 1. స్త్రీ: ఆడది.

ద్వి. మడంతి యీతండె. గడచన్న బసవ 2–91 పం. (6 సం. 76 పుట.)

నేటికి లభ్యమైన అచ్చతెలుగు నిఘంటువులలో మడంతి లేదు. ఇది 'మడంది'గా 15వ శతాబ్దివఱకు ప్రయుక్తము. శైవ వాఙ్మయమున నీపదమునకు ప్రయోగములు గలవు.

| | |
|---|---|
| మడంది | శి. వసా. 185 436 |
| ,, | కు. సం. 6–116, 8–67, 9–61. |
| ,, | బసవు. 2–91 పం. |
| ,, | బసవు. 6–140 పం. |

చూ. ని.లో నిచ్చిన బసవపురాణ ప్రయోగమున మడందియే గలదు. కావున శబ్దము మడంది.

మడంతి—మడంది రూపాంతరము కావచ్చును.

పడంతి వెనుక మడంతి పొగడ పొన్నతో సమాన.

రగడఅను — ప్రాసతో నున్నది. వరాహ. 3–92.

మడంతుక రూపము గలదు.

మడంతుక అచ్చరా. సుం. 138.

## 34. ముదిత

ముదిత. వి. 1. స్త్రీ: ఆడుది.

ముదిత దుమురు నేసెను ఉ. హరి. 1–122.

ముదితలార. నైష. 1–126. (6 సం. పుట. 408)

నన్నయ—ఆది. 4–166, 5–186, 8–106, సభా 1–146.

నన్నెచోడకవి. ముదిత. 7–15, 8–14, 8–86, 9–124.

ముదిత. సంస్కృత శబ్దమున్నది. సం. వి. అ. స్త్రీ. ఆనందము. స్త్రీ—ఆనందము కలిగించునదే గాన ఈ శబ్దము సంస్కృతమయ్యెను. సంతోషము. పుట 408.

తెలుగున ప్రయుక్తము కావచ్చును.

ఇది అచ్చ తెలుగు నిఘంటువులలో గలదు.

ముగుద వగలాడి సింగారి ముదిత యువిద. సాంబ. మా. 20.

## 35. ముద్దియ

ముద్దియ 'వి (V ముద్ద[2]) స్త్రీ=ఆడుది

పలుకు ముద్దియ భార. విరా. 1–315.

ముద్దియ. కాశీ 6–21.

ముద్ద[2]. విణ (సం. ముగ్ధా, ప్రా. ముద్ధ) ముగ్ధ — అమాయకురాలు; గోల (చూ. ముద్దరాలు). (6, సం. 413–415 పుటలు)

ఎలనాగ ముద్దియ చెలువ చిగురుంబోడి.

దేశి తెలుగుగా ఆం. భా. 24 ప:

## 36. మెఱుఁగుఁబోఁడి

మెఱుఁగుఁబోఁడి (ణి) వి. మెఱుఁగు + పోఁడి

మెఱుపువలె మనోజ్ఞురాలగు ఆఁడుది; ఆఁడుది.

మెఱుఁగుఁబోఁడి నయనముల్. నైష 3.164. (6 సం. పుట 536.)

తెలువ చిగురుఁబోఁడి మెఱుఁగుఁబోఁడి అని దేశి తెలుగు. (ఆం. భా. 24 ప.)

## 37. మెలంత

—మెలంతుక—

మెలంతుక—వి. (మెలంత + ఉక) స్వార్థములన. ఆడుది. స్త్రీ.

"మెలంతు కలప్పరి." పిశకలం 1–73.

మెలంతుక మిన్న. నీలా. 2–36.
(సం. 6. 540 పుట)

మెలంత నన్నయ. సభా. 2–19. ఆర్. 2-77.
నన్నెచోడకవి.

పూర్వ ప్రయోగములు మెలంతక 5-65, 6-85, 6–86, 7–11, 5–137, 4–75, 8–158.
ఇది అచ్చతెనుగు.

మెల—మెలి ధాతువులకు పెనగొను అనునర్థము గలదు. మగవానిని పెనగొనునది అల్లుకొమనది అని అర్థము వచ్చును. మెలియు ధాతువునకు మార్దవము సౌకుమార్యము అను నర్థము లున్నవి.

మెలంత, సుకుమారవతి అని వ్యుత్పత్త్యర్థము వచ్చును.
(సూ. ని. 6. 543–544 పుటలు)

## 38. లేమ

లేమ. వి. సు. రామా. స్త్రీ.

ఆ లేమ పొలసిన—భార. విరా. 2–86

లేమ యొకర్తు నైష 3–98. (సం 6. పుట 969)

నన్నెచోడని ప్రయోగము—అమరలేమ—8–127.

శౌరసేనీ భాషలో రామాశబ్దము లేమగా మారినదని ప్రాకృత వ్యాకరణములు చెప్పచున్నవి. అప్పడిది తద్భవమగును.

కాని అచ్చతెలుగుగా దీనిని సాధింపవచ్చును.

ఎల + మెయి <> ఎలమై <> లేమ—లేతయైన శరీరము గలది.

## 39 వాలుంగంటి

వాలుగ(ల్గ)ంటి. వి. (వాలు + కన్ను) 1. దీర్ఘములైన కన్నులుగల ఆడుది=ఆడుది.

వాలుంగంటెక—హరిశ్చ 3–164.

వాలుగంటి యయా 4–57.

వాల్గంటి. హర. 2–98. (సం. 7–225 పుట)

వాలుంగంటి—దీనికి పూర్వ ప్రయోగముగలదు.

ఆ లోకింపం గదు చోద్యమైన యది వాలుంగంటి
(దశకు 5–75)

వాలుంగంటి=ఆం. భూ. దేశి. (24)

## 40 వెలంది

వెలంది – విణ (త. వెళిదు) 1. నిర్మలము 2. తెల్లనిది; ధవళము 3. మేలైనది 4. ప్రసన్నము; సంతోషభరితము 5. విశదము; స్పష్టము. అని విణగా తొలుత నర్థములీయబడినవి.

ఆ వెనుక – వి. 1. చక్కని యాడుది. ఆడుది : భార్య అని 7 ప్రయోగము లీయబడినవి.
(సూ. ని. 7 సం. 486–487 పుటలు)

వెలంది ప్రథానారోపముగా గ్రహించి పెద్ద యక్షరములతో ముద్రింపదగినది. కాని అట్లు లేదు. ఇది నిఘంటు పద్ధతికి విరుద్ధము.

వెలంది స్త్రీ పరమున 7 ప్రయోగములలో

"వెలంది జూదంబు" భార. ఉద్యో. 2–44.

అను తిక్కన ప్రయోగముప్రాచీనము. కాని అంతకుముందు వెలంది ప్రయోగము లున్నవి.

నన్నయ.

వేద జదుని బొంద వెలంది రోసి ఆది. 4–284.

నన్నెచోడకవి

వెలంది నీవ కుం. స.5–135, 6–3, 8–6, 6–74, 6–48.

తెలుగున స్త్రీ పర్యాయ పదములలో వెలంది శబ్దమునకు నధిక ప్రచారమున్నది. తెలుగు ఛందస్సులో 'ఆట వెలంది'యున్నది. అది సీసమున కెత్తు గీతిగా గాక, ప్రత్యేకముగా వాడుకలో నున్నది. వేమన వ్రాసినవి వేలకొలది ఆటవెలందులు.

వెలంది శబ్దము అర్థానుస్వార ఘటితము. నిఘంటుకారులు చూపలేదుగాని, పూర్ణానుస్వార ఘటితప్రయోగము గలదు.

'ఈ వెలంది ప్రైడిలో వెలంది' విజ. 1–62.

# అథోజ్ఞాపికలు

1 కోరాడ రామకృష్ణయ్య, ద్రావిడ భాషాపద చరిత్ర. విజయనగర మహారాజ కళాశాలా పత్రిక. 1922

2 తిరుమల రామచంద్ర—తెలుగున స్త్రీ వాచక ప్రత్యయములు 'భారతి' – అక్టోబరు 1952.

3 కలకంఠి మహా ప్రాణాక్షరమైనను తెనుగున గ్రహింపవలసియున్నది. ఇది కఱకంఠ శబ్దమువంటిది.

4. ఈ పదముల ప్రయోగములన్నియు సూర్యారాయాంధ్ర నిఘంటువు. (సూ. ని.) 6 సంపుటములనుండి గ్రహింపబడినవి. సంపుట సంఖ్య, పుట సంఖ్య ఉదాహరింపబడినవి. అందు తెలుగంకెలుగలవు. ఇప్పటివారికనుకూలముగ వాడుక సంఖ్యలలో నిచ్చినాను.

5 గీ. అమర ధేనువుల్ సురపురి కరిగి తమను
దార యరిమిటలోఁ జేసి తనువు మిగుల
నభిమతార్థముల్ గురిసె దేవాలిమీద
నెలమినొద కలి యాడెడు చెలువువోలె. [12–195]

కుమార విజయమున కామధేనువు దేవతలపై నాట్యమాడిన రీతిగా పాలు కురిసినది అని పై పద్యభావము.

ఇవార్థకముపై ఇవార్థకము నన్నెచోడకవి ప్రయోగించును. అట్లుపోలె, భంగివోలె, రమణవోలె – ఇట్టిదే చెలువువోలె సూ. నిలో. చెలువు + ఆ అని వ్యుత్పత్తి ఉదాహరింపబడినది. కాని దీనికి మఱియొక విధముగా వ్యుత్పత్తి చెప్పవచ్చును. 'వ' అంతమందుగల పదములు. వాయి, వా హ్రస్వ రూపములు.

నలు + వ—నాలుగు నోళ్ళు గలవాడు. బ్రహ్మ.
చిలు + వ—విషము నోటియందు గలది. పాము.
"తలనుండు విషము ఫణికిని
వెలయంగా తోఁకనుండు వృశ్చికమునకున్"
పలు + వ—పెక్కు నోళ్ళు గలవాడు. పెక్కు మాటలు గలది.
"అడచు పలువలే చిలుకుల పలువడలు".

కు. సం. 8–6

తులు + వ—(తూలు + వాయి) మత్తుచే తూలి మాట్లాడువాడు. తుంటరి. (తులువ మాటలు. భార భీష్మ. 3–156.) ఇట్లే—

చెలు + వ—మనోహరమైన నోరుగలది. స్త్రీ.

సోమనాథుడు. చెలువలకు. పండి. మహి. 135, 211, 473 పుటలు.

కేతన. దేశి తెలుగుగా చెప్పినాడు.

ముద్దియ చెలువ చిగురుంబోడి.

ఆం. భా. 24 ప.

6 మానవల్లి కవి రచనలు—పుట 51.



శ్రీ ఇంగువ కార్తికేయశర్మ

# దేవతల మధురం

ఉత్తర భారతమున మహాభారత రచనా కాలమునకే మధుర మహా పవిత్ర స్థలముగా నుండినది. మధురా నగరము, శ్రీకృష్ణ పరమాత్మ, గోవులు, గోపికలు, యమునాతీరము తలపుకు వచ్చినంతనే మనోజ్ఞమైన భావములు రేకెత్తించును. ప్రాచీనముగ కూడ నీ ప్రదేశము వివిధ మత సాంప్రదాయముల కాలవాలమై శిల్ప కళారీతులకు మాతృకగా షుమారు రెండువేలయేండ్లు సుదీర్ఘమైన చారిత్రక నగరముగా పెక్కు రాజ వంశములకు, దేవతల కధివాసమై విరాజిల్లినదీ మధురాతి మధురమైన 'మధురవనము'.

మొట్టమొదటగా 1836లో నీ స్థలమున కల్నల్ స్టాసీ కొన్ని ప్రాచీన శిల్పముల కనుగొనెను. ఆ తర్వాత అలెగ్జాండర్, కన్నింగ్‌హాము, గ్రౌసీ, ఫూరర్ మొదలగువారు త్రవ్వకములు సాగించి పెక్కు శిల్పముల పొందుపరచిరి. ఇవన్నియు స్వదేశముననున్న మధురా, లక్నో, పాట్నా, కలకత్తా, ఢిల్లీ (నేషనల్ మ్యూజియము) మొదలుగాగల భండాగారములందే గాక విదేశములందలి జర్మనీ, పారిస్, లండను, న్యూయార్క్ మ్యూజియములలో ప్రదర్శితము లైనవి. ఈ శతాబ్దపు మొదట్లో వొగెల్, రాధాకృష్ణ, వాడింగ్‌టన్‌లు మధుర చుట్టుపట్ల స్థలాన్వేషణలు గావించిరి. వీరందరి శ్రమఫలితముగా మధుర చరిత్ర వెలుగులోకి వచ్చినది. కాని సశాస్త్రీయంగా పురావస్తు పరిశోధనలు జరుగలేదు. ఈ కొరతను తీర్చునుద్దేశ్యముతో శ్రీ వేంకటరామయ్య మరియు శరణ్ 1954–55లలో 'కట్రయపవిహార' యను స్థలమున త్రవ్వకములు గావించిరి. పాటిమట్టి దిబ్బల చుట్టును కోటగోడలు బయల్పడినవి. ఐదు వివిధ కాలములకు చెందిన పురావస్తు సంపద క్రీ. పూ. 6వ శతాబ్దినుండి, క్రీ. శ. 6వ శతాబ్దివరకు వెలుగులోనికి వచ్చెను. ఆ తర్వాత 1973–74 నుండి 1976–77 వరకు శ్రీ జోషి మధుర చుట్టుపట్ల, ముఖ్యముగా 'అంబరీషతిల' యనుచోట త్రవ్వకములు చేసెను. పైన లభించినట్లుగనే ఐదు కాలములకు చెందిన పురావస్తు సముదాయము లభ్యమయినది. ముఖ్యముగ కుషానులపూర్వ కాలమునకు చెందిన యపురూప శిల్పములు, మట్టిబొమ్మలు — వొరల బావులు, యిటుక కట్టడములు లభ్యమైనవి. వీరితో బాటుగనే, మధురకు 30 కిలో



చిత్రము–2 వేదిక స్తంభములు




చిత్రము—1 మధుర ప్రాంతము ప్రాచీన స్థలములు

మీటర్ల నైఋతి దిశగానున్న ప్రాచీన స్థలమైన 'సోంఖ్' యను చోట బెర్లిన్ మ్యూజియము డైరెక్టరుగానున్న హెర్బర్ట్ హార్టల్, అతనియనుచరులు సర్వశ్రీ అవాన్ మ్యూలర్, జిమ్మర్‌మన్, మరియు గ్రీసల్ పెద్దపెట్టున త్రవ్వకముల గావించిరి. మౌర్య కాలమునకు పూర్వమునుండి—జాట్‌ల పరిపాలనవరకు దాదాపు 37 స్తరములలో మధుర చరిత్రను వెలికితీసిన ఘనత శ్రీ హార్టల్‌కు దక్కినది.

మధురలో కుషాను కాలమునాటి శైవ—వైష్ణవ దేవాలయములు, అపురూపమైన కంచు, రాగి విగ్రహములు నాగపూజ ఆచారములో నున్నటుల తెలియుచున్నది. ఇప్పట వ్యాపించిన మధుర దాని చుట్టు

చిత్రము—1

పట్లనున్న ప్రాచీన స్థలములను చూపుచున్నది. ఈ వ్యాసమున పలుచోట్ల లభ్యమయిన ముఖ్య పురావస్తు విశేషములగూర్చి వివరింతును.

## క్రీస్తుపూర్వపు మధుర

పార్శ్వహేము, మహోలి, అంబరీషతీల, కట్రాపోంఘ్, భూతేసర మొదలగుచోట్ల గావించిన త్రవ్వకములవలన, క్రీ. పూ. 6వ శతాబ్దినుంచి— నాల్గవ శతాబ్దివరకు (కాలము—1), మధుర చిన్న పల్లెగా నుండినటుల తెలియుచున్నది. నునుపైని తెల్లని పాత్రలు, నలుపురంగు చిత్రములు గల్గినవి లభించెను. ఇట్టి కుండలు మహాభారత కాలమునాటి ఉజ్జయినీ, హస్తినాపురము, కౌశాంబి నగరములలో లభించినవి.

ఆ తర్వాత కాలమున (2), అనగా క్రీ. పూ. నాల్గవ శతాబ్దినుండి—రెండవ శతాబ్దివరకు మౌర్యుల కాలమున మధుర నగరమైనది. కోటగోడలు, పెద్ద యిటుక కట్టడములు నిర్మింపబడెను. మౌర్యకాల కృతములైన మృత్తిక బొమ్మలు, రాగి నాణెములు, శోభాయమానమైన యెరుపు—నలుపు బంగారు వర్ణములతో నున్న మట్టిపాత్రలు (N. B. P. ware), బౌద్ధ,జైన యవశేషములు, శిల్పములు పెక్కులు లభించినవి. యక్షపూజ, నాగపూజ ప్రచారమున నుండినట్లు తెలియనగును. పర్ఖహేములో లభించిన మణిభద్ర యక్షశిల్పము, తదితర యక్షమూర్తులు, మధుర భండాగారములోనివి, బరోడా గ్రామమున లభ్యమయిన కుబేర, హారీతి ప్రతిమలు ఈ కాలమునకు చెందినవి.

క్రీ. పూ. 1వ శతాబ్ది చివరి వరకు (కాలము – 3), కుషాను రాజుల పూర్వయుగముగా పేర్కొనవచ్చును. ఇండో—గ్రీకురాజుల కంచు—రాగి నాణెములు, మధురను పాలించిన శుంగ మరియు మిత్ర వంశజుల కృతములు, స్తూపారామములు తరవాతి కాలపు నిర్మాణముల క్రింద మరుగుపడి శిథిలములుగా కానవచ్చినను, అప్పట శిల్ప శాసనములు చాల ముఖ్యమైనవి.



చిత్రము—3 మట్టి దేవాలయ నమూనాలు



చిత్రము–4 బుద్ధవిగ్రహము : కుషానులకాలము

'భూతేసర' లో లభ్యమయిన వేదిక స్తంభములు (మధుర మ్యూజియమున నిక్షిప్తములు), వానిపై నున్న చక్కని స్త్రీ మూర్తులు సాలభంజికలు, యక్షివృక్షికలు, దంపతులు, మధుర

చిత్ర — 2

శైలి యక్ష ప్రతిమలు నున్నగునని స్తూపముల నెంతచక్కగా నలంకరించినవో తె యుచున్నది. గజపృష్ఠాకారముగ నొక యిటుక దేవాలయము నాగపూజ కాలవా మైసటుల హార్ట్‌ల్ తెలుపుచున్నాడు. ఈ కాలమునకు చెందినదేయైన యొక కాల్చిన యెఱ్ఱమట్టి ఆలయ చిత్రఫలకము సొడుగుపాటి శాలవలెనున్న దేవాలయి

చిత్రము– 3

వాస్తురీతిని తెలుపుచున్నది. ఈ కాలమునాటి రాతి శిల్పములు, బర్హుత, సాంచి స్తూపములనున్న వానిని బోలియున్నను, మధుర ప్రాంతపు చుక్కల–యిసుక రాతితోనే గావింపబడినవి. క్రీ పూ. 1వ శతాబ్దిని క్షహరాత క్షాత్రపులు షుమారు అర్ధ శతాబ్ది మధురను పాలించినట్లు తెలియుచున్నది. వీరిలో ముఖ్యుడైన రాజవుల, అతని పుత్రుడు షోడశ, సప్తర్షితీలయందు గుహావిహారమును, మహాస్తూపమును నిర్మించెను. వీరొసగిన శాసనము శిలాస్తంభముపై కలదు. ఇచ్చటనే నీలపు రాతితో చెక్కబడిన స్త్రీమూర్తి శకక్షాత్రప సామ్రాట్టు రాజవుల రాణి కంబోజికగా నిర్ణయింపబడినది. క్షాత్రపుల అనంతరము మరల శుంగనృపులు —



చిత్రము—5 శిల్ప ఫలకములు : కుషానుల కాలము

గోమిత్ర, విష్ణుమిత్రులు (క్రీ. పూ. 57–20 వరకు), పాలించినటుల వీరి నాణెములు, శిక్కాలవలన తెలియుచున్నది. వీరు బ్రాహ్మణ మతస్థులైనను, బౌద్ధ జైనములకెట్టి యవాంతరము కలుగలేదు.

## కుషానుల మధుర

క్రీ. శ. 1నుండి 178 వరకు (కాలము—4), మంగోలు కుషానులు రాజ్యము గావించిరి. వీరి సామ్రాజ్యము వుత్తరమున మధ్య ఆసియా, దక్షిణమున మధురా నగరము, తూర్పున మగధ—ఉత్కళము వరకు వ్యాప్తిచెందెను. ముఖ్య రాజధాని పెషావరు (యిదియే పురుషపురము). ఈ వంశజులలో ముఖ్యులు — మొదటి కాడ్‌ఫీసు, రెండవ కాడ్‌ఫీసు, కనిష్క, హువిష్క మరియు వాసుదేవులు. వీరి కాలమున మధుర చరిత్ర స్వర్ణయుగమనియే చెప్పనగును. వివిధ మతముల కూడలియై, ప్రాచీన శిల్పకళా పీఠముగా ప్రపంచమున శాశ్వత కీర్తి నార్జించెను.

శిల్పకళలో కొన్ని నూతన ప్రక్రియలు చేయబడెను. ముఖ్యముగ మానవాకృతిని బుద్ధప్రతిమ — మధురలో మొట్టమొదటగా సృష్టింపబడినది. ఈ మూర్తి కళ భక్తిమార్గమునకు గట్టిగా పునాదుల వేసినది. వైదిక తత్త్వమునకే మాత్రము తీసిపోలేదు. ఆరాధన కవసరమైన దేవతామూర్తులు విరివిగా చేయబడెను. మతమెట్టిదైనను, శాఖ లెన్ని యుద్భవించినను, బౌద్ధ — జైన—హిందూ శిల్పకళలో పెక్కు సామ్యములుండెను. ఈ కాలమున దేవతా మూర్తులు యే శాఖలకు చెందినవో, మహారాజు కనిష్కునికే గుర్తింప కష్టమాయెనని అశ్వఘోషుడు 'సూత్రాలంకారమున' చమత్కరించినాడు.



చిత్రము—6
కార్తికేయ విగ్రహము

మహాయాన బౌద్ధము ప్రబలినది. బుద్ధుని విగ్రహ రూపమున నిశ్చలమైన భక్తి ప్రపత్తులను పులకింప జేయునట్టి ప్రభావితమైన సమ్మోహన స్వరూపముగా శిల్పులు తీర్చిరి. ఇట్టి పరిణామములకు మూలకనాటిన వ్యక్తి మహా విద్వాంసుడు, గురువు, స్నేహితుడు అయిన అశ్వఘోషుడు, కనిష్క చక్రవర్తిపై చిరస్మరణీయమైన ముద్రవేసినాడు. ఈ అశ్వఘోషుని కృతమైన సౌందరనంద కావ్యము రసవత్తరమైన మహాయాన బౌద్ధ సాంప్రదాయమునకుదర్పణమైనది ఇదియునుగాక కనిష్కుని ప్రభావితుని గావించిన విద్వత్‌సంపన్నులు



చిత్రము—7 దేవతా విగ్రహము

ఆచార్య నాగార్జునుడు, వసుమిత్రుడు, సర్వాస్తివాదకర్త పార్శ్వ, ధర్మత్రాత మరియు ఘోషక ఆ తరము వారే.

మధుర కృతములైన బుద్ధ, బోధిసత్వప్రతిమలు సారనాథు,

చిత్రము—4

సాంచి, బుద్ధగయ, శ్రావస్తి, కుశినగర, కౌశాంబి మొదలగు పవిత్ర స్థలములకు చేరినవి. అమరావతి, నాగార్జునకొండ, గుమ్మడిదుర్రు, గోలిలో లభ్యమగు ప్రతిమలయందు కూడ నీ మధురశైలి ప్రేరణ కొట్టవచ్చినట్లు కాననగును.

కుషానుల రాజ్యము చాల విశాలమైనది. అట్లే వారి మత సామరస్యత, శిల్పశైలులు కూడ. వారి రాజ్యములోని గాంధార దేశమున చేయబడిన బుద్ధ ప్రతిమల శరీర సౌష్ఠవమున, వస్త్ర భూషణములయందు, గంభీర భావముతో గ్రీకు రోమను యోధులను బోలియుండెను. కాని మధురలోని బుద్ధులు నిర్దుష్టమైన భారతీయ సాంప్రదాయమునకు చెంది, ప్రాచీనమైన యక్ష—కుబేర ప్రతిమలనుబోలి, మహాపురుష లక్షణములతో విలక్షణమైన భక్తిభావమున సాక్షాత్కరించినవి. ఒకే కాలమునకు చెందినను, విభిన్నరీతుల సృష్టించబడినవీ బుద్ధ ప్రతిమలు. ఈ కళను పోషించిన కుషానుల నుదారతకు తార్కాణములుగా నిలిచిపోయినవి.

మరియొక విశేషమేమన మధుర బుద్ధులను నాలుగే ముద్రలలో చూపిరి—అనగా ధ్యాన, అభయ, భూమి స్పర్శ, ధర్మచక్ర ప్రవర్తన; వరదముద్ర యెక్కడను కానరాదు. శిల్పములలో

మరొక నూత్నశైలి– సామాజిక జీవితమును చూపు ఫలకములు; విరివిగా స్తూప విహారముల నలంకరించుట. ముఖ్యముగ తోరణ ద్వారముల, వేదిక స్తంభములపైని స్త్రీ మూర్తులు, సాల భంజికలు, యక్ష ప్రతిమలు దంపతులు వివిధ చేష్టలలో చూచుట కానంద దాయకములుగ తీర్చిరి. ఇక జాతక కథలు, బుద్ధుని జీవితగాథల తెలియజేయు శిల్పములు, కిన్నర – గంధర్వ– సుపర్ణ, అప్సరసలు స్తూపమును కొలుచుచున్న అర్థశిల్ప ఫలకములు దృశ్య కావ్యములు.

చిత్రము–5

మథుర కుత్తరమున 12 కిలోమీటర్ల దూరములో 'మాంట్' అనుచోట కుషానురాజుల దేవకులముండినది. ఇందొక రాజద్వారమును బోలిన శిల్పశాల యుండెను. ఇచ్చట లభించిన శిల్పములు మహారాజులైన విమకాడ్ఫీసు, కనిష్క, హువిష్కచష్టణ మొదలగు శకనృపుల నిజరూపములకు ప్రతీకలు (Portrait figures) ప్రపంచఖ్యాతి గాంచినవి. ఇట్టి శిల్పశాలయే ఆఫ్ఘనిస్థానములోని 'సుర్ఖ్‌కోటల్' అను ప్రాచీన నగరమున కలదు.



చిత్రము–8 అ విష్ణువు : కుషానుల కాలము



చిత్రము–8 ఆ మాతృక. కుషానుల కాలము

కనిష్కుని కాలమున వెలసి వికసించిన స్తూపారామములు గుహా విహారము, మిహిర విహార, ప్రావారిక విహార, యశవిహార, ఖండ విహార, రోషిక విహార, శ్రేష్టకీయ విహార, నాకతికా విహార, చేతియ విహార, శ్రీ విహార, స్వర్ణకాక విహార మరియు హువిష్క కృతమైన మహారాజ దేవపుత్ర విహారము చాల ఖ్యాతికి వచ్చెను.

## జైనము

మథుర కుషానుల కాలమున వివిధ మతముల కాలవాలమైనది. 'కంకలితీల' త్రవ్వకములలో జైనమూర్తులు దాదాపు వెయ్యి లభించినవి. ఆయక పటములు, శాసన స్తంభములు, శిల్పములు దాన శాసనముల వివరించుచున్నవి. ఒక ఆయక పటమును ఫల్గుయశయను నాట్యకారుని భార్య శివయశ కావించెను. దీనిపై చక్కని స్త్రీ మూర్తులున్నవి. తోరణ ద్వారమున యక్ష ప్రతిమలు కలవు. ఇచ్చటనే లభించిన ఆర్యవతి దేవి, సరస్వతి విగ్రహములు అపురూపములు. లక్నో మ్యూజియమున భద్రములు.

## శైవ - వైష్ణవములు

సోంఖ్ యనుచోట శ్రీ హార్ట్‌ల్ గావించిన త్రవ్వకములు కుషాను కాలమునకు చెందిన శైవ–వైష్ణవ దేవతామూర్తులు,

ఆలయ శిథిలములు విదితమైనవి. హిందూశిల్పమునగూడ మథురకు ప్రత్యేకస్థానము నార్జించినవి. మొదటి వాసుదేవ, మూడవ కనిష్క రాజుల కాలమునాటి యిటుక, యిండ్లు, వానిలో వేరుగా పూజా గృహ ముండుట గనునింపదగినది. అట్టిచోట్ల రాగి — కంచు

చిత్రము—6

విగ్రహములు ముఖ్యంగా కార్త్తికేయ, పురుషుని ప్రక్కనే సింహ ముఖియై బిడ్డనెత్తుకొనియున్న మాతృక; విష్ణువు, సూర్య,

చిత్రము —7 చిత్రము—8 అ .

అగ్ని, కామదేవ, లక్ష్మి సరస్వతుల శిలాప్రతిమలు దొరికినవి. ఇవి గాక దుర్గ మహిషమర్దిని, స్కంద, మాతృక చాల యరుదైన

చిత్రము—8 ఆ

శైవ—శాక్త సాంప్రదాయ విగ్రహములుకూడ నుండెను. ఒక దేవాలయ సముదాయమున గర్భగృహము గజపృష్ఠాకారముగనుండి విశాలమైన ముఖమండపము, చుట్టును 15 గుండ్రని స్తంభ

చిత్రము—9

ములుగల విశాలమైన ఆవరణము గల్గియున్నది. ఈ దేవాలయపు తూర్పు ముఖద్వారము, నాగ—నాగిణి శిల్పములతో నలంకరింపబడిన ప్రాకార తోరణ శిలలు చాల యరుదైన పూర్వవాస్తురీతిని తెలుపు చున్నవి. తదుపరి యిప్పటనే నాగపూజ యాచారము గూడ వచ్చినది. ఈ నాగపూజ వివిధ రీతులనుండెను. పెద్ద నాగశిల్పము (2.5 మీటర్లయెత్తు), 'చార్‌గాం' యనుచోట లభించినది. యేడుతలల పాము పడగనైనున్న యీ ప్రతిమ హువిష్క చక్ర వర్తి కృతము. దధికర్ణనాగ, భూమినాగ శిల్పములు కూడ లభించినవి.

క్రీ. పూర్వమునుండియే యున్నను కుషానుల కాలమున మరింతగా అన్ని మతశాఖలతోబాటు నాగపూజ యాచారమైనట్లు కన్పట్టుచున్నది. కృష్ణ భగవానుని అన్న బలరాముడు శేషనాగుని యవతారము, విష్ణువు శేషశయనుడు, నాగులు జైన తీర్థాంకరులైన పార్శ్వనాథుడు, సుపార్శ్వునకు చిహ్నములు. బుద్ధుని రక్షించి నటి నాగముచిలిందుడు. నాగజాతివారైన నంద — ఉపనందులు గౌతముని పురిటిస్నానము గావించునట్లు పెక్కు శిల్పములే తెలుపు చున్నవి. ఇప్పుడుకూడ నీ ప్రదేశమున నాగ దేవాలయ ముండుట సజీవమైన సాంప్రదాయమునకు నిదర్శనము. గాంధార శైలిలో



చిత్రము—9 ఇటుక దేవాలయము : క్రీ. శ. 1 వ శతాబ్ది



చిత్రము—10
మధురబుద్ధుడు: గుప్తకాలము

పంట్లాము, బూట్లువేసుకుని సప్తాశ్వ రధారూఢుడైన సూర్య భగవానుని శిల్పము — కనిష్కుని ప్రతిమను బోలియున్నది.

## గుప్తకాలపు మధుర

వీరి కాలమున (క్రీ. శ. 3–4 శతాబ్దినుండి 6వ శతాబ్ది వరకు), సాంచి, సారనాధము, ఉజ్జయినీలవలె మధుర ఖ్యాతిలో నుండెను. శైవ—వైష్ణవముల కాదరము లభించినను, బౌద్ధ జైనముల కెట్టి యాపద కలుగ లేదు. కాట్ర యనుచోట పెద్ద వైష్ణవాలయ ముండెడిది. చంద్రగుప్త విక్రమాదిత్యుడు గావించిన బుద్ధ విగ్రహము మహత్తర శిల్పశైలికి పరిపూర్ణత నిచ్చినది. ప్రతిమా లక్షణమున మణిపూసగా, ఉదాత్తమై, భక్తిభావ స్ఫూరక మైన కళామూర్తిగా భాసించుచున్నది.

చిత్రము—10

కంకలితీల యందలి జైనాలయము మిక్కిలి ప్రచారములో నుండెను. ఇప్పటనే శిధిలమైయున్న శివాలయము గుప్తరాజుల కృతమే. పలురీతుల ముఖలింగములు (ఏక, త్రిముఖ, చతుర్ముఖ, అష్టముఖ), లభించినవి. లకులీశ, అర్ధనారీశ్వర, మున్నగు శిల్పములు మ్యూజియములో ప్రదర్శితములు. అట్టివియే నరసింహ, వరాహవిష్ణు శిల్పములుగూడ. మహావిష్ణువు, విశ్వరూప విష్ణువు,

చిత్రము—11

త్రివిక్రమ శిల్పములు ప్రపంచ ప్రసిద్ధములు. విష్ణు భగవానుని ఆయుధములను వేరువేరు పురుషరూపముల మొట్టమొదటగా నిప్పటనే చూడనగును.

ఇంతటి ప్రాచీన చారిత్రక వైభవమును, పలు మత సాంప్రదాయములను, శతాబ్దులుగా చవిచూచిన మధుర యిప్పుడు శిధిలమైన దిబ్బల రూపమున కనిపించుచున్నది. ఇన్ని దేవతల ఆలయాలు, విహారములు కేవలము పురావస్తు అవశేషముల ద్వారా ప్రదర్శన శాలలో చూడవలసి వస్తోంది.

శ్రీకృష్ణ భగవానునితో పెనవేసుకుపోయిన ఐతిహాసిక మధురను తలపుకు తెచ్చుకొని విశ్రామఘట్టమునుండి తెప్పలో యమునా తీరమునంటి ప్రయాణం చేస్తుంటే, యిప్పటి కట్టడాల మధ్య మరుగుపడిపోయి, శిధిలావస్థలోనున్నను, మధుర నానుకొని యున్న బృందావనము, దేవాలయాలు, ఆశ్రమాల యేవో తన్మయత్వాన్ని కల్గిస్తాయి.



చిత్రము—11
మహావిష్ణువు: గుప్తకాలము.

## ఉపయుక్త రచనలు


1 మధుర, Marg, vol XV no. 2. (Bombay, March, 1962).

2 త్రవ్వకములగూర్చి. ఇండియన్ ఆర్కియాలజీ—ఏరెవ్యూ. 1966–67, pp. 40–43; 1968–69, p. 40; 1969–70, pp.42–43; 1970–71, pp. 39–40; 1971-72, p. 48. మరియు హెర్బర్ట్ హార్టెల్, "Some Results of the Excavations at Soukh" German Scholars on India, Vol II (Bombay, 1976), p. 69 ff.

3 M. C. Joshi, "Pre-Kushana Mathura: A study" seminar papers, (New Delhi, 1977):

శ్రీ గుండు సుబ్రహ్మణ్య దీక్షితులు

# శక్తి

నరసాపురం నుంచి విజయవాడవెళ్లే బస్సు తాడేపల్లిగూడెం కాలవ గట్టు స్టాపులోకి వచ్చి ఆగింది.

డ్రైవరు దిగాడు. కండక్టరు కూడా దిగుతూండగా ఎవరో "ఇక్కడ బస్సు ఎంతసేపు ఆగుతుందండీ?" అని అడిగారు. కండక్టరు, "పది నిముషాలు ఆగుతుంది. కాఫీ తాగి రావచ్చు" అని చెప్పి దిగాడు. బస్సు ముందువైపుకునడిచి, రోడ్డుదిగి, గుడిసెల్లోకి వెళ్లి మాయమయ్యాడు.

కాఫీ తాగాలనుకున్న ప్రయాణీకులు ఓ అరడజను మంది కూడా దిగారు. వాళ్లు దిగీ దిగ్గానే ఓపది పన్నెండుమంది కొత్తగా లోపలికి ఎక్కారు. ఆ ఎక్కిన వాళ్లలో వయస్సు వచ్చిన ముగ్గురు ఆడపిల్లలు **కూడా** ఉన్నారు.

కండక్టరు చెప్పిన పది నిముషాలవ్వగానే దిగిన వాళ్లంతా ఒక్కొక్కరుగా వచ్చి బస్సు ఎక్కారు.

ఇంకొంచెంసేపటికి కండక్టరువచ్చాడు. వస్తూనే టిక్కెట్ల హేండిల్ అందుకొని, "టికెట్, టికెట్" అంటూ సీట్లమధ్యకు వచ్చాడు. అంటూనే హడావుడిగా ముందుకు నడుస్తూ మళ్లీ, "టికెట్ ప్లీజ్, టికెట్" అన్నాడు.

కొత్తగా ఎక్కిన వాళ్లు చాలామంది చిత్రంగా ఏలూరు, ఆపై ఊళ్లకు వెళ్లే వాళ్లే! వాళ్లలో చాలామంది ఐదు, పది రూపాయల నోట్లు తీసారు. కండక్టరు ఒక్కొక్కళ్లనీ ఊరడుగుతూ, అందరి దగ్గరా డబ్బు తీసుకున్నాడు. పోగయిన నోట్లు పట్టుకొని, తన సీట్లో కూర్చుని, జేబులు తడుముకొని, ఆశ్చర్యం ప్రకటిస్తూ లేచి నుంచుని, "అరెరె, ఆయన దగ్గర పంచ్ పుచ్చుకోవటం మర్చిపోయానే!" అంటూ టిక్కెట్ల హేండిల్‌ను రాక్‌లో పడవేసి, లేచి, దిగబోయాడు.

వెనకాల నుంచి ఎవరో, "మాకు టిక్కెట్లిచ్చి వెళ్లిపొండి" అన్నారు. కండక్టరు, "మళ్లీవచ్చి ఇస్తాను. పంచి తెచ్చుకోవాలి" అంటూ దిగి వెళ్లిపోయాడు.

పది నిముషాలు గడిచాయి. డ్రైవరూ, కండక్టరూ వచ్చి బస్సు ఎక్కారు. కండక్టరు టిక్కెట్లహేండిల్ తీసుకుని, "టికెట్, టికెట్" అంటూ లోపలికి నడిచాడు.

కండక్టరు సీటు వెనకాల సీట్లో కూర్చొనున్న ఇందాకటి యువకుడు, "మీరే మాకు టిక్కెట్లివ్వాలి" అన్నాడు.

"డబ్బులిత్తియ్యండి, ఇస్తాను" అన్నాడు కండక్టరు.

"అదేంటి, ఇందాకన అందరి దగ్గరా డబ్బులు తీసికెళ్లి నప్పుడు మళ్లీవచ్చి టిక్కెట్లిస్తానన్నారు గదా మీరు."

కండక్టరు మొహంలో చిరాకు తొంగిచూసింది: "ఏంటండీ మీరు చెప్పేది? మీరు ఎవరికిచ్చారు? ఎవరు తీసుకెళ్లారు? కాఫీ తాగి ఇప్పుడే కదా నేను వస్తోంది! బాగా జ్ఞాపకం తెచ్చుకోండి, ఎవరికిచ్చారో...టిక్కెట్‌ప్లీజ్,టికెట్...డ్రైవరుగారూ,పోనివ్వండి, పోనివ్వండి," కండక్టరు పంచితో బస్సు కడ్డీమీద చప్పుడుచేశాడు.

యువకుడు తెల్లబోయాడు. అతను ఏదో మాట్లాడేలోపల వెనకాల సీట్లల్లో నుంచి ఇద్దరు స్థూలకాయులు, తాము కూడా అంతకుముందే పదేసి రూపాయలిచ్చామనీ, ఆ వచ్చిన కండక్టరు కూడా అచ్చం ఇతనిలాగానే ఉన్నాడనీ,మళ్లీవచ్చి టిక్కెట్లిస్తానన్నాడనీ, అతని దగ్గర కూడా 'కాష్ బాగ్' ఉన్నదనీ అన్నారు.

కండక్టరు చిరాగ్గా చూస్తూ "మీరు ఎవరికో డబ్బిచ్చి నన్ను టిక్కెట్లిమ్మంటే ఎట్లా ఇచ్చేది? మీరు చేసిన పొరబాటుకు నా చేతి చమురు వదలాలంటారా ఏంటండి?"

వాళ్లిద్దరూ మొహాలు మొహాలు **చూ**సుకుంటూ కూర్చుండి పోయారు.

బస్సులో కలకలం బయల్దేరింది. తను టిక్కెట్ తీసుకొని డబ్బిచ్చి ఉండవలసిందని ఒకరూ, ప్రపంచంలో మోసం, అన్యాయం పెరిగిపోయాయని ఒకరూ, ఎవరోవచ్చి మోసంచేస్తే ఈ కండక్టరుకు శిక్ష వెయ్యటం అన్యాయమని ఒకరూ, ఇట్లా రకరకాలుగా వ్యాఖ్యానించటం మొదలు పెట్టారు.

"టికెట్, టికెట్" అని అరుస్తూ కండక్టరు చెయ్యి చాచాడు. మళ్లీ డబ్బివ్వక తప్పదనుకున్నారు కాబోలు, వెనకాల సీట్లల్లో వాళ్లు నలుగురు డబ్బులిచ్చారు. టిక్కెట్లు పుచ్చుకున్నారు.

కండక్టరు ఆడవాళ్ల సీట్లవైపు తిరిగి, ముందరి సీట్లోకి కొత్తగా వచ్చి ఎక్కిన ముసలమ్మను, "మామ్మా, టికెట్!" అన్నాడు.

అరవై ఏళ్ల ఆ ముసలమ్మ కండక్టరువైపు చూసి "ఇందాకనే గదూ నాయనా టిక్కెట్టుకు ఐదు రూపాయలిచ్చాను!" అంది.

"నా కెక్కడిచ్చావు? ఎవడికోఇచ్చుంటావు. తియ్, తియ్!" అన్నాడు కండక్టరు.

ముసలమ్మ గొంతులో దీనత్వం చోటుచేసుకోగా అంది : 'నాయనా, అట్లా అనకు బాబూ! నా దగ్గరింక డబ్బుల్లేవు. కావాలిస్తే పది పైసల్తీసుకో. నన్ను మాత్రం దింపెయ్యకు.''

''డబ్బుల్లేవంటేఎట్లా? లేకపోతే దిగాల్సిందే! దిగు, దిగు'' అంటూ కండక్టరు, ఆ వెనక సీట్లో కూర్చునున్న ముగ్గురు అమ్మాయిల దగ్గరకు వచ్చి చెయ్యి చాపాడు.

వాళ్ళల్లో ఊలీ—ఊలీ చీరలో అందంగా, అధునాతనంగాఉన్న అమ్మాయి, ''ఇందాకనే మా ముగ్గురికీ కలిపి ఇరవై కాగితం ఇచ్చాను. టిక్కెట్లివ్వటం ఆలస్యం మీదే'' అన్నది.

''మళ్లీ మొదలా, మీరెవరికిచ్చారో నాకు తెలీదు. ఇప్పుడు నాకిస్తే ఇవ్వండి. లేకపోతే దిగిపొండి!'' కండక్టరు కంఠంలో కరుకుదనం ధ్వనించింది.

ఆ అమ్మాయి బతిమాలుతున్న ధోరణిలో అంది: ''అదేం బండి, ఉట్టప్పుడల్లా మీరు 'ప్రజాసేవ' చేస్తున్నట్టు చెప్పుకుంటారుగదా, ఇప్పుడు వాడెవడో ఇంతమందినీ మోసంచేసి డబ్బై, ఎనభై రూపాయలు పట్టుకెళ్లిపోతే మీరు మాకు సహాయం చెయ్యరా? ఆచూకీ తీసేందుకు ప్రయత్నించరా? మీకేం పట్టనట్లు 'డబ్బుల్తియ్యి, తియ్యి' అంటే ఎక్కడ్నుంచి తీస్తాం చెప్పండి! పైగా మేం స్టూడెంట్లం. ఇవ్వాళ మా కాలేజీ హాస్టల్లో ప్రెజెంట్ కాకపోతే మేము చాలా నష్టపోతాం. మా దగ్గర డబ్బులూ అంతంత మాత్రంగానే ఉన్నాయి.''

''ఏంటమ్మా మీరు చెప్పేది? నన్ను ఈ ఉద్యోగం మానేసి ఇంకో ఉద్యోగం చెయ్యమంటారు, అంతేనా? అసలు నాకూ వాడికీ సంబంధమేమిటి? చాలు చాల్లేవమ్మా!......పోనీవయ్యా డ్రైవరు గారూ, ఇప్పటికే పావుగంట ఆలస్యమయింది.'' కండక్టరు మళ్లీ పంచితో చప్పుడు చేసాడు.

ఆ అమ్మాయి వదిలిపెట్టలేదు. కొంచెం తీవ్ర స్వరంతోనే అడిగింది. ''సంబంధం లేకపోవట మేమిటండి, అతనూ మీ చొక్కా లాంటి కాకీచొక్కానే వేసుకున్నాడు. ఈ బాగ్‌లాంటి లెదర్ బాగ్‌నే తగిలించుకున్నాడు. అతను వచ్చి డబ్బడిగితే మేము ఎట్లా ఇవ్వక పోవాలి ?''

కాకీ చొక్కాలూ, లెదర్‌బాగ్‌లూ వందలకొద్దీ దొరుకుతాయి బజార్లో. అవన్నీ నావేనంటారా? చాల్చాలు. మీరెట్లాగూ టిక్కెట్లు కొనేటట్లు లేరు, దిగండి.

ఇంతవరకూ ఈ భాగోతం ఏమీ అర్థంగాక అయోమయంగా చూస్తూ కూర్చున్న డ్రైవరు బస్సు స్టార్ట్ చేసాడు.

ఆ అమ్మాయి హఠాత్తుగా "డ్రైవరుగారూ!" అని పిలిచింది.

డ్రైవరు వెనక్కు తిరిగి చూసాడు.

"ఇట్లా ఒకసారి రండి."

డ్రైవరు 'ఏమిటి?' అన్నట్లు తల ఎగరవేసాడు.

"ప్లీజ్, ఒకసారి రండి!"

డ్రైవరు ఇంజను ఆపుచేసి, లేచివచ్చాడు.

మెరుపులాగా ఆ అమ్మాయి అతన్ని దూసుకుని వెళ్ళిపోయి డ్రైవరు సీట్లో స్టీరింగు చక్రానికి వెన్ను ఆనించి కూర్చుండిపోయింది. అంది: మా ముగ్గురికీ విజయవాడ టిక్కెట్లు కొట్టిస్తేనేగాని బస్సు కదల్నియ్యను."

కండక్టరు ఉగ్రుడైపోయాడు. "ఏవమ్మోయ్, తమాషాగా ఉందేమిటి? కుర్రతనం పన్లుమానేసి బస్సు దిగు. నీ కసలు చస్తే టిక్కెట్టివ్వను."

"నేను దిగను. నేను మీకు డబ్బిచ్చాను. టిక్కెట్లివ్వండి... అయినా, కుర్రతనం అంటారేంటి? మాటలు జాగ్రత్తగా రానీండి. కొరివితో తల గోక్కోవటం మీకు మంచిదికాదు. మేము పాతకాలపు ఏడుస్తూ కూర్చునే ఆడపిల్లలం కామనీ, మోరోవర్, స్టూడెంట్లమనీ జ్ఞాపకముంచుకోండి."

కండక్టరు మొహం కోపంతో కందగడ్డలాగా అయింది. విసురుగా డ్రైవర్‌తో, "బీట్ కానిస్టేబుల్‌ను తీసుకురండి," అన్నాడు.

డ్రైవరు బస్సుదిగి వెళ్ళాడు.

బస్సులో కొత్త కలకలం సన్నగా మొదలైంది. వెనకాల సీట్లోంచి ఒక వయస్సు మళ్ళినాయన, "ఏంటమ్మాయ్, గోల! మాకు మాత్రం డబ్బులు పోలేదా ఏంటి? ఏదో సర్దుకుపోవాలి. ఎన్నో అన్యాయాలు జరుగుతున్నాయి. అవన్నీ మనం సర్దుబాటు చెయ్యగలమా? చూసీ చూడనట్టు వాటిని భరిస్తూ పోవాలి. అంతే" అన్నాడు.

అమ్మాయి అతనివంక అనునయంగా చూసింది. అంది: "పెద్దవారు మీరే అట్లా అంటే ఎల్లాగండి! వాడెవడో వచ్చి మనల్నందర్నీ ఫూల్స్‌చేసి వెళ్ళిపోయాడు. ఈయన కనీసం ఎంక్వయిరీ అయినా చెయ్యకుండా తనకేం పట్టనట్టు ఊరుకుంటున్నాడు. పైపెచ్చు హడావుడిగా 'బస్సు పోనీ, పోనీ' అంటున్నాడు. మీరు కూడా ఆయన్నే సపోర్టు చేస్తున్నారు. ఒకవేళ నా ప్రాణానికే హాని జరిగి ఉండినా ఇంతే గదా, ఇంతమందిలోనూ ఎవరూ పట్టించుకొనేవారు కాదుగదా!"

ఆ వయసు మళ్ళినాయన మాట్లాడలేదు. మొహం వంచేసాడు.

కండక్టరు తాలూకు ఎగశ్వాస దిగశ్వాసల్లో ఆవేశం తీవ్రమైంది. అందరివైపూ చూస్తూ అన్నాడు: "చూసారా, చూసారా, ఎవరెవరో వచ్చి ఆవిడమీద పడిపోయినట్టు ఎట్లా మాట్లాడుతోందో! అసలీ అమ్మాయి మగనాలిగాని ఆడమనిషి కాదండి,"

ఎవరో సన్నగా నవ్వారు.

గొంతులో పౌరుషం ఉట్టిపడగా అమ్మాయి అంది: "ఆఁ, ఆఁ, రైట్, మగాళ్ళు మగతనం వదిలేసుకున్నప్పుడు ఆడాళ్లయినా మగాళ్ళు కావద్దా? అది ఆనందించవలసిన విషయమే గదా!"

కొంతమంది మొహాలు మొహాలు చూసుకున్నారు.

ఇందాకటి యువకుడు అమ్మాయితో అన్నాడు: "మీ మాటలు చూస్తే ఈ కండక్టరే ఈ మోసం చేసాడని మీరనుకుంటున్నట్టు తెలుస్తోంది. అంతేనా?"

"ఇతనే చేసాడని అననుగానీ, చూడగా చూడగా ఇతనికి తెలియకుండా మాత్రం అది జరిగి ఉండదనిపిస్తోంది. ఎందుకంటే, ఇదే లెదర్ బాగ్,...

హఠాత్తుగా కండక్టరు అందుకున్నాడు: "అనుమానాలతో కేసులు నడవ్వు. ఋజువు, ఋజువు చెయ్యాలి."

యువకుడు అన్నాడు: "నిజమే, దీంతో ఈయనకి సంబంధముందని మీరు ఋజువు చెయ్యగలరా?"

"మాష్టారూ ఇది మన అందరికీ సంబంధించిన విషయం మనందరం తలుచుకొంటే నిజాన్ని బయటకు తియ్యటం కష్టం కాదు. నన్నొంటరిదాన్నిచేసి ఋజువు చెయ్యమంటే ఎట్లా?... అయినా ప్రయత్నిస్తాను," అని అంటూ రుమాలుతో ఒకమాటు మొహం తుడుచుకొని, అందరివైపూ చూస్తూ అంది: "మాష్టారూ మీరెవరైనా ఇందాకన మీరిచ్చిన నోట్లను గుర్తుపట్టగలరా?"

అందరూ మొహాలు మొహాలు చూసుకున్నారు.

నెమ్మదిగా ఒకాయన లేచి నుంచున్నాడు. ఆయన బహుశా వ్యాపారి అయ్యుండవచ్చు. ఆయన అన్నాడు: "నా దగ్గర ఇందాకన ఐదు కొత్త పది కాగితాలు ఉన్నాయి. అవి పొద్దున బాంకు వాళ్ళిచ్చినవే. వాటిల్లో ఒకటితీసి టిక్కెట్టుకు ఇచ్చాను. చూస్తా నాగండి," అంటూ తన లాల్చీ జేబులోంచి పది రూపాయల కాగితాలు తీసాడు. అవి నాలుగు. అన్నీ కొత్తవీ, వరస నెంబర్లవీను! "వీటిల్లో పై నెంబరుదో కింది నెంబరుదో అయ్యుండాలి అది" అన్నాడు.

అమ్మాయిలేచి కండక్టరు దగ్గరికి వచ్చింది. వ్యాపారి కూడా వచ్చాడు. యువకుడు లేచి నుంచున్నాడు. "డబ్బు తియ్యండి" అన్నాడు కండక్టరుతో.

కండక్టరు ముగ్గురివంకా కొరకొరగా చూసాడు. లెదర్ బాగ్‌లోనుంచి నోట్లబొత్తిని తీసాడు. వ్యాపారి టక్కున తన కొత్త నోటును గుర్తుపట్టి, "అదిగో, ఆ నెంబరే!" అన్నాడు.

కండక్టరు చటుక్కున "అది ఇందాకన హోటల్లో నేను ఇరవై రూపాయలనోటు మార్చినపుడు నా చేతిలోకి వచ్చిన నోటు. మీదెల్లా అయింది. చాలు, చాలు పదండి," అన్నాడు.

ముగ్గురూ నిర్ఘాంతపోయారు.

డ్రైవరూ, పోలీసూ వచ్చారు. బస్సెక్కారు.

కథ ఇక్కడ గమ్మత్తుగా కొత్త మలుపు తిరిగింది.

ఇందాకటి ముసలమ్మ ఒళ్లో కూర్చొనున్న ఆరేళ్ల కుర్రాడు కండక్టరు తొడుక్కున్న కాకీ చొక్కావైపు చూపిస్తూ "మామ్మా, అదిగో చీమిడి" అన్నాడు.

ముసలమ్మ ముందుకువంగి, కండక్టరు వీపువైపు చొక్కాకు అంటుకుని చిక్కగా, ఇంకా తడిగా ఉన్న చీమిడిని చేత్తో తియ్యబోయింది.

కండక్టరు ఆ స్పర్శకు వెనక్కు తిరిగాడు. "ఏంటది?" అన్నాడు.

కుర్రాడు "నా చీమిడి, ఇందాక నువ్వొచ్చావూ, అప్పుడు మామ్మ నా ముక్కు చీమిడి తీసి పారేసింది" అదుగో అక్కడ పడింది. నువ్వెళ్లిపోయావుగా. అందుకనే...తియ్యలేదు," అన్నాడు.

కండక్టరు: "ఇందాకన నేను వచ్చానా? ఎవడ్రా నువ్వు రాస్కెల్!"

కుర్రాడు : "నువ్వే, నువ్వే. అది నా చీమిడే."

యువకుడు, అమ్మాయి మొహాలు మొహాలు చూసుకున్నారు.

హఠాత్తుగా అమ్మాయి డ్రైవరువైపు చూస్తూ అతన్ని అడిగింది: "డ్రైవరుగారూ, ఇందాకన మీరు ఈయనతో కలిసే కాఫీ తాగారా?"

డ్రైవరు అయోమయంగా చూసాడు. "లేదే, నేను ఒక్కణ్ణే సెంటర్లోకి వెళ్లి కాఫీ తాగాను. ఈయన రోడ్డుకింది టీకొట్టువైపు వెళ్లినట్టున్నాడు. సరిగ్గా చూళ్లేదనుకోండి. అయినా ఇప్పుడా విషయం ఎందుకులెండి."

అమ్మాయి ఆనందంతో అరిచింది: "ఆఁ తెలిసిపోయిందండి. కండక్టరుగారు ఒంటరిగా చాటుకు ఎక్కడికోవెళ్లి తన పోలికలున్న వాడికెవడికో తన చొక్కా, లెదర్‌బాగూ ఇచ్చి పంపించాడు. వాడువచ్చి మనల్ని మోసం చేసాడు. ఆ లాభాన్ని ఇద్దరూ పంచుకొని ఉంటారు."

కండక్టరు, నూతిలోనుంచి వస్తున్నట్లున్న హీనస్వరంతో "అబద్ధం, అంతా అబద్ధం" అన్నాడు.

అమ్మాయి, జరిగిందంతా పోలీసుకు చెప్పింది. పోలీసు, బస్సును ఆపళంగా పోలీసు స్టేషనుకు తీసుకువెళ్లాలన్నాడు.

ఎవరో ఇద్దరు, అప్పటికే చాలా ఆలస్యమైందనీ, స్టేషనుకు వెళ్లటం అనవసరమనీ, విషయాన్ని అక్కడితో వదిలేసి బస్సును బయల్దేరదీయటం మంచిదనీ అన్నారు.

అమ్మాయి అంది: "మాష్టారూ, ఇంతసేపు ఓపిక పట్టారు ఇంకొంచెంసేపు పట్టలేరా? అన్యాయం జరుగుతున్నదని తెలిసి, దాన్ని కనిపెట్టిన తరవాత కూడా మనం ఉపేక్షించటం ఎంతవరకు సమంజసం? కొన్ని నిమిషాలకిందట ఈ కండక్టరు మనల్ని నీచంగా డబాయిస్తోంటే అతన్ని ఎదుర్కోనలేకపోయాము. కారణం, మనలో ఎవరికీ, అన్యాయాన్ని ఒంటరిగా ఎదుర్కొనే శక్తి లేకపోబట్టేగిదా! ఇప్పుడితను దొరికిపోయాడు. కనీసం ఇప్పుడయినా మనందరం కలిసి సామూహిక శక్తిని ప్రదర్శిద్దాం రండి. ప్రభుత్వాన్నే మార్చగలిగిన మనం సామూహికంగా సాక్ష్యం ఇచ్చి నేరస్థుడికి బుద్ధి చెప్పించలేమా? మన డబ్బూ మనకు వస్తుంది కద!...దయచేసి నామాట కాదనకండి. బస్సును పోలీసు స్టేషనుకు పోనిద్దాం పదండి"—అందరికీ చేతులు జోడించి నమస్కారం పెట్టింది అమ్మాయి.

యువకుడు ఆలోచనల్లోంచి తేరుకొని నెమ్మదిగా అన్నాడు : "యస్, యస్, మీరన్నదీ పాయింటే. మనందరం తలుచుకుంటే చెయ్యలేందేముంది ? స్టేషనుకే పోనియ్యండి."

మిగతా ప్రయాణీకుల్లో కొందరు "అవునవును" అన్నారు.

కానీ ఎవ్వరూ ఒద్దనలేదు. అంతకుముందు వద్దన్నవాళ్ళు కూడా కింనాస్తిగా ఉండిపోయారు.

రెండో నిముషంలో బస్సు వెనక్కి తిరిగి, ఓవర్ బ్రిడ్జి ఎక్కి, పోలీసు స్టేషన్‌వైపు దూసుకుపోతోంది!

ఎవరో ప్రయాణీకుడు ఇంకొకరితో అంటున్నాడు: నిత్యమూ మనకు తటస్థపడే సమస్యల్లో కొన్నింటి విషయంలోనైనా మనం సమూహశక్తిని ప్రదర్శిస్తే, ఇంక తెగని సమస్య లేముంటాయి?"

శ్రీ హెచ్. ఎస్. బ్రహ్మానంద

# భారతదేశంలో భాషాశాస్త్రం

భాషాశాస్త్రం 'Philology, Linguistis' అన్న రెండుపేర్లతో పాశ్చాత్య పరిపాలనలో భారతదేశంలో ప్రవేశించింది. అంతకు ముందు సశాస్త్రీయమైన భాషా పరిశోధన జరగలేదని ఎవరూ అనరు కాని భాషను గురించిన మీమాంస ఒక ప్రత్యేకమైన పరిధిలో సాగటం గత రెండు శతాబ్దాలుగా మాత్రమేనని అటు పాశ్చాత్యులూ ఇటు భారతీయులూ ఈనాడు గుర్తించారు. అంగీకరించారు. ఈ వ్యాసంలో భారతీయంగా చెప్పదగిన భాషాపరిశీలనను గురించి స్థూలంగా సమీక్షించడం జరుగుతుంది. ఈ సమీక్ష మూడు అంశాలకింద విభజింపబడింది.

1. భాషా నిర్మాణం. 2. భాషోపయోగం, 3. భాషా తత్త్వం. మొదట గుర్తించదగిన అంశం ఒకటుంది— అది భాషను గురించి ప్రాచీనులు ఎందు కాలోచించారనడం. అన్నిటిని గురించీ భారతీయులు ఒకే విషయం రాబట్టడం కోసం ఆలోచించారు— అది తత్త్వం. అంటే 'వేదాంత'మన్న స్థూలార్థంలో కాదు. వ్యక్తమైన శబ్దమూ, గుప్తమైన అర్థమూ ప్రవర్తించే పద్ధతిని కనుక్కోవడమని అర్థం.

## 1. భాషా నిర్మాణం

చత్వారి శృంగా... (4–58–3) ఇత్యాది ఋక్కులు భాషా నిర్మాణాన్ని,తత్త్వాన్ని వ్యాఖ్యానిస్తున్నాయి. సంకేతముఖంగా భాషా నిర్మాణాన్ని వ్యక్తీకరించడం వీరి పద్ధతి. ఎప్పటివో తెలియని మాహేశ్వర సూత్రాలు పదునాల్గు. శబ్ద ప్రపంచం అఇఉణ్ ... ఇత్యాదిగా వుందని తెలిపింది. సంస్కృతానికి మాత్రమే పరిమితమైనా అనేక భారతీయ భాషల్లోనూ అజ్ఝల్వి భాగానికివే మూలరూపాలు. అష్టాధ్యాయి మార్గం ప్రత్యక్షంగా మార్గదర్శకం కాకపోయినా అందులోని సూత్ర నిర్మాణాది వ్యాకరణప్రక్రియభారతీయ భాషలన్నిటా వ్యాపించివుంది. వర్ణ – సంధి – నామక్రియా పద–కారక సమాసాది వ్యాకరణ విభాగ విభజన సాంప్రదాయకమైపోయింది. శిక్ష ధ్వన్యుచ్చరణాది వర్ణ విషయాలను, వ్యాకరణం పద ప్రత్యయాది స్వరూపాలను విశ్లేషించాయి. వాక్యాన్ని గురించిన మీమాంస ప్రత్యేకంగా వ్యాకరణం చెయ్యలేదు. తార్కికులు వేదాంతులు తమవంతుగా భావించారు వాక్యాన్ని. వాక్యపదీయం నిదర్శనం.

వర్ణం : స్ఫోటకు వర్ణానికి (ధ్వనికి) భేదాన్ని పాటించి వర్ణాలకు ప్రత్యేకార్థం లేదని అర్థవిభేదకశక్తి మాత్రమే వుందని నిర్ణయించినవాడు కౌండభట్టు.

పదం : వర్ణఘటిత రూపం పదమని, పదానికి ప్రత్యేకార్థం వుందనీ సుబంత, తిజంత, ఉపసర్గ, నిపాతాలని నాల్గు విధాలుగా పదం వుంటుందనీ మనవాళ్ళు భావించారు. వాక్యపదీయం మూడవ కాండం పదం వాక్యంతో ఎలాంటి సంబంధాన్ని కల్గి వుంటుందో నిరూపిస్తోంది.

వాక్యం : క్రియా ప్రధానమైంది వాక్యమని, అన్ని వాక్యాలలోను కర్మ ప్రాధాన్యం వుందని, క్రియలేని వాక్యం వుండదని, వ్యక్త వాక్యంలో క్రియారూపం కనిపించకపోతే లుప్తమైన 'భూ' (be) ధాతువు అంతర్నిర్మాణంలో వుంటుందని వాక్యపదీయం సిద్ధాంతీకరించింది (చూ. 2వ కాండం).

సమాసం : కేవలం నామాల్తో మాత్రమే సమాస ఘటన కాదని, ఏకార్థత్వం సమాసానికి నిర్వచనమని— క్రియల్లోనూ సమాస ఘటన వుందనీ వాక్యపదీయం చెబుతోంది. (చూ. 2వ కాండం).

కారకం : కారకం అర్థ సంబంధి. విభక్తి శబ్దసంబంధి. ఈ విభాగాన్ని గుర్తించి కర్తృకారకమని, ప్రథమా విభక్తి అని వ్యాకరణం నిర్దేశించింది.

సంధి : పరస్పరసన్నికర్ష సంహిత అని, సంహితలో వర్ణాలకు జరిగే మార్పుల్ని నిర్దేశించింది. అర్థావగాహన సంధినెలా నియమిస్తోందో కూడా చర్చించింది వ్యాకరణం. పాణిని బుద్ధిస్థమైన స్ఫోటకాధారంగానే సుధ్యుపాస్య మొదలైన రూపాలను సాధించాడు. రూపాశ్రితమైన ప్రక్రియనే వాళ్ళు సూత్రీకరించారు.

భారతదేశంలో వేదపఠన పాఠనాదుల్లో మంత్రోచ్చారణ సాధుత్వ పరిరక్షణకోసం శిక్షాదికాలు పుట్టాయని, అనుశాసన దృష్టి వాళ్ళకి ప్రధానమని చాలమంది గుర్తించారు. కాని వాక్యపదీయాది గ్రంథాల్ని పరిశీలించినపుడు భాషానిర్మాణ రహస్య గ్రథనమే వాళ్ళకి ప్రధానమని గుర్తించక తప్పదు. నిఘంటు నిర్మాణం— ఈ విషయాన్నే స్థాపిస్తోంది.

## 2. భాషోపయోగం

వ్యవహర్త భాషను ఎన్ని విధాలుగా ఉపయోగించుకొంటాడన్నది భాషా పరిశీలనలో మనవాళ్ళ ద్వితీయదృష్టి. పాశ్చాత్య దేశాల్లో ఇటీవల మొదలైన 'Stylistics' ధ్యేయం ఇదే. ప్రాచీనులు భాషకు మూడు ఉపయోగాలున్నట్టు గుర్తించారు. వాటిని

శబ్ద వ్యాపారాలన్నారు. అవి అభిధ—లక్షణ—వ్యంజనలు. సద్యః స్ఫురితార్థం వాచ్యార్థమని, ముఖ్యార్థబాధ కలిగినపుడు సందర్భాది హేతువులవల్ల శబ్దానికి కలిగే మరో అర్థం లక్ష్యమని, ఈ హేతువులతో సంబంధం వుండినా లేకపోయినా వాక్యార్థం మరో వాక్యార్థంగా పరిణమించడం వ్యంగ్యమని మనవారి విశ్లేషణ. వీళ్ళని ఆలంకారికులని లోకం పిలవడంతో వీళ్ళు చేసిన భాషాపరిశీలన మరుగున పడిపోయింది. వక్త, శ్రోత, అనువక్త, అనుశ్రోత వీళ్ళ సంబంధాన్నిబట్టి ఈ వ్యాపారాలు భాషలో భిన్నప్రయోజనాల్ని సాధిస్తూ వుంటాయి. వ్యవహర్త వివక్ష ఎందుకు ప్రధానమో గుర్తించారు కాబట్టే ఇలా విభజించారు. వ్యవహర్త సృజనాత్మకమైన భాషా ప్రతిభ కలవాడని ఈ త్రివిధ వ్యాపారమే ఆ సృజనకు మూలమని వీళ్ళ సిద్ధాంతం. వ్యవహారం వాక్యాలరూపంలో వుంటుంది కాబట్టి వాక్య సముదాయం ప్రతిపాదించే అర్థం అనుభూతి రూపంలో వుంటుందనీ— ఈ అనుభూతినే రసభావమని, వాక్య సమాహార రూపాన్నే కావ్యమని భాషా పరిశీలనను వాక్యదశనుంచి కావ్యదశకు పెంచారు.

ఆలంకారాలని చర్చించిన విషయమంతా ప్రధాన—అప్రధానార్థాలమధ్య మీమాంసే. 'ధ్వని' అని చర్చించిన విషయమంతా భాష కేవలం భావ ప్రదర్శనకే కాకుండా భావగోపనానికి కూడా ఉపయోగపడగలదన్న విషయాన్ని స్థాపించడానికే. అందుకే ఈ భావగోపనం వాక్యదశలో—పదదశలో—వర్ణదశలో ఎలా జరుగుతూందో నిరూపించారు ఆలంకారికులు. ఈనాటి భాషాశాస్త్రంకూడా కొన్ని అంశాలలో ఈవైపు పయనిస్తూండటం గుర్తించదగ్గ విషయం.

## 3. భాషాతత్త్వం

భాష గాలలో ప్రతిచోటా తత్త్వదర్శనం చెయ్యడం భారతీయ సంప్రదాయం. ఓంకారంతో మొదలుపెట్టి మహావాక్యందాకా శబ్దార్థాలు వ్యవహారదశలో భిన్నంగా కనిపిస్తున్నా అనుభవదశలో -అంటే—భావదశలో అవి అభిన్నాలని—ఆ దృష్టితో శబ్దార్థ సంబంధం ప్రకృతి పురుష సమన్వయంలాగా అవిచ్ఛిన్నం—నిత్యం—అని మనవారి ఏకైకమైన సిద్ధాంతం. కాని లౌకిక ప్రయోజనాలకోసమే అర్థస్వరూపమైన శబ్దబ్రహ్మ పదార్థం శబ్దరూపంలో పరిణమిస్తోందని తాత్త్విక వ్యాఖ్యానమూ చేసుకొన్నారు. దీనికి నిదర్శనంగా చత్వారి వాక్పరిమితా పదాని (1–164–45), ఉతత్వః పశ్యన్నదదర్శవాచం (10–71–4) ఇత్యాది ఋక్కులను తీసుకోవచ్చు. శబ్దప్రపంచం కంటె అర్థప్రపంచం చాలా విశాలమైందని వీళ్ళ అవగాహన. అందువల్ల భాషావ్యవహారం శబ్దరూపంలో సాగుతూ అర్థంలో పర్యవసిస్తుందని వీరి సిద్ధాంతం. ఆ పర్యవసితార్థం భావన రూపంలో వ్యవహర్తలో నిలిచి వుంటుందనీ—అది జన్మ జన్మలకూ సాగే స్రవంతి అని వాళ్ళు అంగీకరించారు. అందుకే జన్మ సహజంగా భాషాపరిజ్ఞానం జీవులకుందని భర్తృహరి (వాక్యపదీయం 2వ కాండాంతం).

ఛందస్సు, జ్యోతిషం, ఆయుర్వేదం, శబ్దాలకున్న దైహిక, మానసిక సంబంధాలను, ప్రభావాలనునిరూపించాయి. వర్ణాదులకున్న అసంలక్ష్య క్రమ వ్యంగ్య లక్షణంగా దీన్ని అలంకారశాస్త్రం సూత్రీకరించింది. ఇలా జీవితంలో ప్రతి అంశంలోనూ భాషలోని వాగర్థాల మధ్య సమన్వయం సాధించడానికి ప్రయత్నించాడు భారతీయుడు. ఇలా అతని భాషా పరిశీలన ఒక శాస్త్రంగా కాకుండా అన్ని శాస్త్రాలకు పరచిన విషయంగా తయారుకావడంవల్ల గుర్తింపబడటం కష్టమై పోయింది.

పాశ్చాత్య భాషా సిద్ధాంతం ఈనాడు పై విషయాల్లో చాలా వాటికి సన్నిహితంగా పెరిగినా తత్త్వ విషయంలో మాత్రం అధి భౌతిక విషయ ప్రస్తావన చెయ్యరాదన్న శాస్త్ర నియమంతో భాషా వ్యవహారాన్ని — నూటికి ఎనభై వంతుల్ని వదలిపెట్టి రూపాశ్రిత తర్కంతో, నిరూపణ క్షమత్వ లక్షణంతో తన పరిశీలనకు శాస్త్రత్వం సిద్ధిస్తోందని గిరి గీసుకోక తప్పలేదు. శబ్దార్థాల మధ్య సంబంధం యాదృచ్ఛికమన్న సూత్రం ఈనాడు అవితథంగా అంగీకరింపబడుతోంది. కేవల తర్కంతో తృప్తిపడే నైయాయిక వైశేషికులూ యిలాగే అన్నారొకనాడు. కాని తాత్త్వికులైన మీమాంసకులు ఒప్పుకోలేదు.

స్థూలమైన పై సమీక్షలో గుర్తించదగిన అంశం కేవలం వైయాకరణులు మాత్రమే కాకుండా ఇతర శాస్త్రాల వాళ్ళూ తమ పరిశోధనల్లో భాషా పరిశీలన చేశారనడం. వైదిక ఋషులే ఈ ప్రయత్నం చెయ్యడమూ మరవరాని అంశమే. భాషను ప్రత్యేకంగా నిర్వచించలేదు. వాక్కుకీ భాషకీ భేదం పాటించారు. వాక్స్వరూపాన్ని విశ్లేషించారు. ఛందో వృత్తిగా శబ్ద స్వరూపాన్ని ఆవిష్కరించారు. భావనా వైవిధ్య విలసితంగా అర్థస్వరూపాన్ని విమర్శించారు. ఆనందవర్ధనుడు 'ప్రథమేహి విద్వాంసో వైయాకరణాః' అని వైయాకరణికి నీరాజనం పడితే 'నహి నహి రక్షతి డుకృఞ్ కరణే' అని శంకరుడు కేవలం భాషనుగురించి శాబ్దిక మీమాంస నిరర్థకమన్నాడు.



శ్రీ వంతరాం రామకృష్ణారావు

# ప్రాచీన కావ్యాలు - పాఠపరిష్కరణ

ప్రాచీన కావ్యాలను సాధుపాఠాలతో ముద్రించవలసిన ఆవశ్యకత ఎంతో ఉన్నది. ఉన్నదని గుర్తించి కృషిచేయు సాహితీ సంస్థలు మాత్రము పూజ్యము. తప్పుల తడకలగు ముద్రణముల ననుసరించి పదకోశాలు తయారుచేయించుట మాత్రము జరుగుచున్నది. పదకోశాలు కానీ, నిఘంటువులు కానీ, వ్యాకరణాలు కానీ, నిర్దుష్టముగా, సమగ్రముగా తయారుకావడము, పాఠపరిష్కరణ మీదనే ఆధారపడి న్నది. ఈ వ్యాసములో వ్యాకరణమున కుపకరించు కొన్ని సాధు పాఠాలను నిర్దేశింతును.

## (1) అజ్కృతము

తెలుగులో పరసవర్ణాదేశమును నిర్వహించు ప్రయోగ మొకటి మాత్రమే ఉన్నది. అది ''రక్షానాకప'' అను నరసభూపాలీయమునందలి చక్రబంధ పద్యములో నిబద్ధమయి ఉన్నది. (నరస 4-88) ఈ పద్యములో ''ధీతంద్రదా'' అని పూర్ణబిందు ఘటిత రూపము ముద్రణములో కలదు. దీనినిబట్టి చక్రబంధములో, రామరాజ భూషణుడు ''నారసింహాజ్కృతం'' అని ఇమిడ్చినట్లు చెప్పవలసి వచ్చుచున్నది. ఈ వాక్యము సంస్కృతమన్నచో వాక్యాంతమున 'మ'కారము ండవలెను గాని 'సున్న' ఉండుట లక్షణ విరుద్ధమగును. తెలుగన్నచో 'ముపర్ణక' ముండవలెను గాని 'సున్న' ఉండ రాదు. కనుక లక్షణ నిరోధము తప్పదు. కావుననే ఈ ప్రయోగము పరిగ్రాహ్యము కాదని శ్రీ వజ్ఝల వారిట్లు లేఖాముఖముగ తెలిపి ఉన్నారు. ''రక్షానాకప''అను చక్రబంధ పద్యము కక్కుఅతులతో నిండియున్నది. నారసింహాజ్కృతం అని సంస్కృతమున నవసానమున సున్న మకారమునకు రాదుగదా! ఎట్లు? ఇట్టి మహాకవి ప్రయోగములు గ్రాహ్యములు కానేరవుగదా (శ్రీ వజ్ఝలవారి లేఖ 18-7-1958.) బాలప్రౌఢలకు పూరణ గ్రంథమయిన ''ముక్త లక్షణ కౌముది''లో శ్రీ వజ్ఝలవారి ఆశయమే ఆమోదించుట జరిగినది. కాని పరిశీలింపగా ఈ అనర్థమునకు మూలము ''ధీతం త్రదా'' అన్న ముద్రణమని తరువాత గోచరించినది ఇట, ''ధీతన్త్రదా'' అని పరసవర్ణాదేశ ముండవలెను. అప్పుడు ''నారసింహాజ్కృత మూర్తి కవికృతి''అని చక్రబంధమున ఇమిడ్చినట్లగును. ఈ పక్షమున-''పరసవర్ణంబునకుఁ బూర్ణాను స్వారంబు ప్రాయికంబుగ నగు—నారసింహాజ్కృత మూర్తి కవి కృతి, ధీతన్త్రదా (నరస 4-88) యనునవి ప్రాయిక గ్రహణముచేత రక్షితంబు లయ్యె'' అని సూత్రింపనగును.

## (2) యేయది

నన్నయ భారతములో ''ఏయది హృద్య మపూర్వంబేయది'' (ఆది 1-30) ప్రధాన పాఠముగా ముద్రించబడి ఉన్నది. సంశోధిత ముద్రణ ప్రతిలో ''యేయది'' పాఠాంతరముగ చూపబడి ఉన్నది. ఈ పాఠాంతరమే నన్నయపాఠమని 'చింతామణి'లోని పదాది యకారాంగీకారమువల్ల తెల్లమగుచున్నది. దీనికి వేరేప్రయోగాలు కూడ ఉన్నవి. (ముక్తలక్షణకౌముది. సంజ్ఞా 21)

## (3) బ్రాహ్మండు

''బ్రాహ్మండ నీ వధికారివే మహిన్'' (కు. సం. 7-28) అని నన్నెచోడుని ప్రయోగము. దీనిని ''బ్రాహ్మణ'' అని సవరించి ముద్రించుట జరిగినది. బ్రాహ్మణ శబ్దభవము బ్రాహ్మండు. బసవపురాణాదులలో ఈ రూపము ప్రయుక్తమయి ఉన్నది. కనుక బ్రాహ్మండ—అన్నదే కవి పాఠము. (ము. కౌ.=ముక్తలక్షణకౌముది. సంజ్ఞా 27)

## (4) విన్నాణువు

''బహు విధాలంకారభంగుల విన్నాణములు సూప'' (శాంతి 1-235) ప్రధాన పాఠముగా ముద్రించి ''విన్నాణువులు'' పాఠాంతరముగ ముద్రించినారు. ఇట తిక్కన పాఠము ''విన్నాణువులు'' అన్నదే. విన్నాణువు విన్ననువుగా మారినది. ''వి, న్ననువున నాగమోక్త మథనం బొనరించినఁ గాని యారయన్'' (శాంతి 4-179)—ము. కౌ. సంజ్ఞా 27.

## (5) మంత్ర కాటుక. మొ॥

''బ్రహ్మాండ క, ర్పర ఖండంబున మంత్ర కాటుక దగన్'' (కు. సం. 6-96) అను ప్రయోగములోని మంత్ర కాటుక, ''మంత్ర కజ్జల మొగిన్'' అని వావిళ్ల ప్రతిలో మారిపోయినది. మంత్ర కాటుక — వైరి పదమన్న భ్రాంతియే దీనికి కారణము.

మంత్ర శబ్ద భవము మంతరము. "మంతర కాటుక మఱి చండ వేది" (బసవ 362పు)అని పాల్కురికి ప్రయోగము. మంతరము= మంత్రము అయినది. మంత్రము+కాటుక=మంత్రకాటుక. ఇట్లిది యాచ్ఛిక సమాసమే. మంత్రసాని అను ప్రయోగ మిటువంటిదే. "మరునకుం గు సుమర్తువన్ మంత్రసాని" (ఆముక్త 5–112) మంత్రము – ఆచ్ఛికమనుటకు "జగమంత్ర కాని యాటయుఁ బోలెన్" (అచ్చ. రా. యు. 549 వ.) అను అచ్చ తెనుగు రామాయణ ప్రయోగము పరమప్రమాణము. అమరవేమ (కు. సం 8 – 127) పద్దవనము (కు. సం. 12 – 194) కే సాకేసి (కు. సం. 12-168) వనలచ్చి (కు. సం. 5–123) అను పాఠములు కొన్నింట అమరకాంత, పద్మవనము, కేశాకేశి – అని ముద్రణముల కెక్కినవి. అమరరామ = అమరలేమ. పద్మవనము = పద్దవనము. వనలక్ష్మి = వనలచ్చి. ఇవి సమస్తపద తద్భవాలు.

ఏకసంత (కళా 1–78) కాలగంట (కాలహ 4 – 97) అను పాఠాంతరములు కవి ప్రయుక్తములుగ కన్పట్టుచుండగా, ఏక సంధ, కాలఘంట – ప్రధాన పాఠములుగ ముద్రించబడినవి. నాఁకన్నియ (భాగ. 5 సం. 2–124) అను పాఠము నాగకన్యకగా మార్చబడినది. "ప్రతి దినమ్మును గపుర దీపములు వేయు" (హర 1–10) అను పాఠము కొన్ని ప్రతులలో, "ప్రతి దినమ్మ కపురపు దీపములు లేయు" అని మారినది. "అనేక బారువుల్" (శృ. నై 7–11) అను పాఠము పాఠభేదములలో చేర్చబడి 'అనేక భారముల్ అను సవరణ పాఠము గ్రంథమున కెక్కినది. ఏక సంతలో నగునవి సమస్తపద తద్భవములని గ్రహించకపోవుట ఇట్టి చిక్కులకు కారణము. (ము. కౌ. సంజ్ఞా 30)

## (6) వెండుంగరము

"ఒక యిట్టప్రేలి వెండుంగరంబు" (హర 7–12) అను పాఠముతో కూచిమంచి తిమ్మకవి సర్వ లక్షణసార సంగ్రహములో ఈ హరవిలాస పద్యపాదము నుదాహరించి నాడు. ముద్రణములలో "ఒక్క ప్రేలికి వెండి యుంగరంబు" అని ఈ పద్య పాదము ముద్రితము. వెండుంగరము—అను సంధిని నిర్మూలించుటకువచ్చిన సవరణ పాఠమే యిది. తిమ్మకవి చూపిన పాఠమే పరిగ్రాహ్యము. ఇట్టి సంధు లింకను గలవు. (ము. కౌ. 13 సూ.)

## (7) లతాంతములకుం మొనసి

"కమ్మని లతాంతములకుం మొనసి వచ్చు"అని ఇ, ఔ, క, ట, జ, డ, ద – ప్రతుల పాఠము. (మహాభారత సంశోధిత ముద్రణము) కుమ్మొనసి – అను అప పాఠము ముద్రణముల కెక్కి ఈతప్పు పాఠమునే సాధించు సూత్రములు బయలుదేరినవి. (ప్రౌఢ ఘంటాపథము 298–301 పు) కనుక ప్రయోగానుసారముగ సూత్రింపవలసినదే. (ము. కౌ. సంధి 29)

## (8) నీదు నౌదార్యంబు

"నీదు నౌదార్యంబు లేదుగాన" (కాశీ 2 – 69) అను పాఠము కొన్ని ప్రతులలోను, "ఔదార్యమును నెందు లేదుగాన" అను పాఠము కొన్ని ప్రతులలోను గలదు. నీదు+ఔదార్యంబు – అనుచో నుగాగమ మయినది. ఇదే శ్రీనాథ సమ్మతమగు పాఠము. "తనదు నఖిల రాజ్యము" అను బసవపురాణ ప్రయోగము దీనికి మూలము. కావున "నీదు నౌదార్యంబు"అను పాఠమే పరిగ్రాహ్యము. (ము. కౌ. సంధి 38)

## (9) ఎవ్వండు వఠించును

"ఎవ్వండు వఠించును వాఁడు ధన్యుఁడు ముని ప్రవరా" (కాశీ 6–26)అను పాఠము కొన్నింట "ఎవ్వండు వచించును" అని మారిపోయినది. కూచిమంచి తిమ్మకవి,"ఎవ్వండు వఠించును" అను పాఠముతోనే దీని నుదాహరించినాడు. ఇట్టి నిర్వాహక ప్రయోగములు నన్నయ భారతములో కనబడలేదు. "ఎంతగు మతులు" (ఉద్యో 1–286) అని తిక్కన ప్రయోగించెను. కాగా, తెనుగుల మీది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావన్నది నన్నయ మతము; వచ్చునన్నది తిక్కన మతము.

## (10) దృష్టు

"స్నేహమ్ములు పెడి దృష్టుల్ నిలిపి రయ్యువతి పయిన్" (ఆది 8–106) అని నన్నయ భారతము. సుజన రంజనీ ముద్రణలో, 'దృష్టి నిలిపిరి' అని కలదు. "దృష్టుల్ నిల్పఁగా" (విరాట 4–74) అనుచోట 'దృష్టి' పాఠాంతరముగా కలదు. ప్రయోగాంతరములను బట్టి దృష్టుల్ –అన్నదే నన్నయ తిక్కనల పాఠమని నిర్ణయించవచ్చును. (ము. కౌ. తత్సమ 32)

## (11) వ్రయము

సద్వ్రయము (భీష్మ 3 – 309; కర్ణ 2 – 33) అను పాఠాంతరములు తిక్కన భారతమున గలవు. వ్రయించే (క్రీడా 288) "వ్రయమగు టెఱుంగఁడు వితత జరా వ్యాధులచేన్" (శాంతి 4–345) అనుచో ఇది యతి స్థానగతమై ఉన్నది.

కనుక వ్రయము — అన్నదే తిక్కన పాఠము. వ్యయ శబ్ద ప్రాకృత రూపము 'వ్రయ' శబ్దము. "క్వచిద భూతోపి — అపభ్రంశే క్వచి ద విద్యమానోపి రేఫో భవతి. వ్రాసు — వ్యాసః" (త్రివిక్రమ ప్రాకృత శబ్దాను శాసనము 3–3–6) — ము. కౌ. తత్సమ 52.

## (12) అమ్మన

పాండురంగ మాహాత్మ్యములో "ఇమ్మన వద్య" అను పద్యమున చతుర్థ పాదములో "అమ్మను" అని అన్ని ముద్రిత ప్రతులలోను గలదు. శ్రీ రాళ్లపల్లివారు పరిష్కరించిన అకాడమి ప్రతిలోకూడ ఇదే పాఠము. రాజమండ్రి గౌతమీ గ్రంథాలయము లోని వ్రాతప్రతిలో "అమ్మన" అను పాఠము కలదు. అమ్మన్న— అను స్త్రీ నామధేయములు నేడును గలవు. "అమ్మన" పాఠము పక్షమున ఈ పద్యములో ద్విప్రాసము పాటించి నట్లగును. కాన "అమ్మన" అను గౌతమీ గ్రంథాలయ ప్రతిపాఠమే గ్రాహ్యమనుట యుక్తము. (ము. కౌ. సమాస, 6 సూ.)

## (13) ఇవేళ

"ఆ యాలాపంబ యివేళం బల్కెదు-నిత్యాది కవిప్రయోగ స్యాతీవ దుష్టతేతి ధ్యేయమ్. అవేళ నితి పాఠ ఏవ సాధుః" అని అహోబల పండితీయములో కలదు. ఈ పాఠచర్చ 'మనుచరిత్ర'కు సంబంధించినది. (మను 3–57) ఈ పద్యములో ఇవేళ అను కవిప్రయోగ మత్యంత దుష్టమనియు, అవేళన్ అను పాఠమే సాధువనియు అహోబల పండితుని విమర్శ. దీనినిబట్టి, ఇవేళ—అను కవిప్రయోగము దుష్టమన్న ఆశయముతో అవేళ (న + వేళా) నన్న పాఠము కల్పింపబడెననుట స్పష్టము. ఈ కల్పితపాఠమేముద్రణము లలో కలదు. కాని 'ఇవేళ' అను కవిప్రయోగమును సవరించుట సరికాదు. హరిశ్చంద్ర నలోపాఖ్యానములో "అకళంకి సహజ కళాధి వసతి" (హ. న. అవతారిక) అను ప్రయోగము శ్లేషనిబద్ధమై ఉన్నది.అ + కళంకి=అక్కళంకి. జడ్డలోపము: అ కళంకి=అ కళంకి— అని ఒక పక్షమున అర్థము. న + కళంకి— అకళంకి అని అర్థాంతరము. ఈ జడ్డలోపము హరిశ్చంద్ర నలోపాఖ్యానమున సంయుక్త హల్లుపరమగుచోట్ల రెండుసార్లు కలదు. "అప్రమద; అనుచు నక్షత్రకులసిత" అన్నవి ఆ ప్రయోగములు.కనుక "ఇవేళ" అను మనుచరిత్ర ప్రయోగము నన్యథాకరించుట సరికాదు. ప్రయో గానుసారము సూత్రించుకొనవలసినదే. (ము. కౌ. సమాస19)

## (14) వెఱ్ఱీరు

"వట్టికూడును వేన్నీళ్లుపెట్టి" (పాండు 3-56) అని వావిళ్ల ప్రతి పాఠము. శ్రీ రాళ్లపల్లివారు పరిష్కరించిన అకాడమి ప్రతిలో వేనీళ్ల—అని కలదు. వేన్నీళ్ల—సాధురూపము; వేనీళ్ళు కాదు. శ్రీ వజ్ఝలవారు "ళ్ళు" ఒప్పని, "ళ్ల" తప్పని వ్రాయుట అనాలోచితము. ఇట, "వేనీరు—ప; వర్నీరు—క.త" అని పాఠాంతర ములు చూపబడెను.వర్నీరు—వ్రాత తప్పు. వెఱ్ఱీరు—కవిపాఠము. రాజమండ్రి గౌతమీ గ్రంథాలయపు వ్రాత పతిలో "వెఱ్ఱీరు" అను పాఠమే కలదు. వెఱ్ఱీరు=వెఱ్ఱినీరు "వెఱ్ఱి యెత్తించు నీరు. మద్యము, కల్లు" అని సూర్యరాయ నిఘంటువున వెఱ్ఱినీరు శబ్దము కడ వ్రాయబడెను. "వెఱ్ఱినీరానుకతమున" (శుక 3.32) "వెగ్గలపుంబచ్చి నంజుళ్ల వెఱ్ఱినీళ్ల"(అచ్చ. రా. యు 2–31) అను ప్రయోగములు చూపబడెను. వెఱ్ఱి (ఱి) నీరు=వెఱ్ఱీరు— అని సాధించుకొనవలెను. (ము. కౌ. ప్రకీర్ణక 6)

## 15 మాంధాతృరఘుక్షితీశులు

"క్షత్రియవంశ్యులై" అను ఆదిపర్వపద్యములో "మాం, ధాత్రరఘుక్షితీశులు" అను పాఠమును, కవి సంశయ విచ్ఛేదములో అడిదము సూరకవి చూపినాడు. "ధర ఋకారాంత శబ్దంబు ద్వంద్వమైన, రేఫమగుచుం బ్రవర్తిల్లుదృఢముగాను"అని లక్షణము చెప్పినాడు. (కవి సం 1–132) మాం, ధాత్రురముక్షితీశులు" అప్పకవీయ పాఠము. ఇదే కవిపాఠముగా చలామణి అయినది. "మాంధాత్రరఘు—ఒ.న; మాంధాత్ర భగీరథాదులు—ఔ" అని సంశోధిత ముద్రణములో పాఠాంతరములు చూపబడినవి. "ఉర్ద్వంద్వే రః" అను చింతామణి సూత్రమునకు "మాంధాత్ర రఘుక్షితీశులు" అన్నది లక్ష్యమని స్పష్టపడుచుండగా శ్రీ వజ్ఝల వారు కూడ మాంధాతృపాఠమును గ్రహించుట వింత. మాంధాత్ర అన్నదే నన్నయపాఠము. (ము. కౌ. సమాస 38 సూ.)

అకాడమి వారు తయారు చేయించుచున్న పదకోశములు నిఘంటురచనకు ముడిపదార్థములని అనుచున్నారు. నిఘంటు రచనకు పూర్వరంగముగా పాఠములను సేకరించి, పాఠపరిష్కరణ జరిపించుట అవశ్య కర్తవ్యము. స్వస్తి.

శ్రీ యన్. గంగాధరరావు
శ్రీ కె. రాము నాయుడు

# కన్స్యూమరిజం

"కన్స్యూమరిజం" ఇటీవలనే ప్రచారంలోకి వస్తున్న "వినియోగదారుల ఉద్యమా"నికి ఆంగ్ల రూపమని చెప్పనవసరం లేదు. "కన్స్యూమరిజం" ఇంకా చాలా నిఘంటువుల్లో చోటు సంపాదించని కొత్తమాట.* ఈ మాటకు అర్థం ఏమిటి ? ఎందుకీ ఉద్యమం? ఈ ఉద్యమం పుట్టు పూర్వోత్తరాలు, సాధించిన విజయాలు, మన దేశంలో ఈ ఉద్యమపు తీరు తెన్నులు, మున్నగు విషయాలను స్థూలంగా చర్చించుటయే ఈ వ్యాసం ఉద్దేశం.

## కన్స్యూమరిజం అంటే ఏమిటి ?

ఒకప్పుడు "ఆకాశాన్నంటే ధరలు" అన్న ప్రయోగం అతిశయోక్తిగా వాడబడేది. కాని ఇప్పుడు పెరిగే ధరలను వర్ణించటానికి ఈ ప్రయోగం సరిపోవటంలేదు. ఉప్పెనవచ్చి ఊరు ఏరు ఏకమై, సర్వస్వాన్నీ కోల్పోయి, నిలువ నీడలేని పెను తుపాను బాధితులకు లీటరు కిరసనాయిలు ఆరు రూపాయలకు అమ్మటం కంటే దానవత్వం ఏముంటుంది! ఒక్క సబ్బుముక్క కోసం సూపర్‌బజార్ల ఎదుట వాడకందార్లు గంటల తరబడి క్యూలో నిలబడిన రోజులున్నాయి. ఇంతాజేస్తే రెండు కార్బాలిక్ సబ్బులు కొంటేనేగాని ఒక టాయిలెట్ సబ్బు ఇచ్చేవారు కాదు. తప్పుడు తూకాలవల్ల మన దేశంలోనే వినియోగదార్లు నష్టపోయేది సాలుసరి రెండువేల కోట్ల రూపాయలుంటుందని అంచనా.** వినియోగ వస్తువులు 60 నుంచి 70 శాతం వరకు కల్తీ చేయబడుతున్నవి.[1] ఆహార పదార్థాల్లో కల్తీ 16 నుంచి 66 శాతంవరకు (సగటున 33 శాతం) ఉంటుంది.[2] బియ్యంలో కలుపుటకు సిలుగా రాళ్లు తయారుచేసే మిల్లులున్న దేశం మనది. కందిపప్పులో కేసరి గింజల కల్తీవల్ల వినియోగదార్లు పక్షవాతానికి గురైన ఉదంతాలు ఎన్నో గలవు. ఈ కల్తీవలన ప్రాణం పోయవలసిన మందులు ప్రాణాలు తీసిన సంఘటనలనేకం. అమెరికాలోని వినియోగ వస్తు భద్రతా కమీషన్ (కన్స్యూమర్ ప్రాడక్ట్ సేఫ్టీ కమిషన్) పని చెయ్యటం ప్రారంభించిన మొదటి సంవత్సరంలోనే నాలుగు వందల రకాలయిన వినియోగ వస్తువులు ప్రమాద భూయిష్టమని నివేదించింది. కొంతవరకు అప్రమత్తంగా ఉన్న వినియోగదారులు గల దేశాల్లోనే పరిస్థితి ఇంత దారుణంగా ఉంటే ఇతర దేశాల సంగతి వేరే చెప్పనక్కర్లేదు. ఎంతో మోజుపడి కొనుక్కున్న వస్తువులు మరమ్మతుకు వస్తే వాడకందారు గోడు పట్టించుకునే నాథుడుండడు. విడి భాగాలు దొరకవు. ఒక కంపెనీ విడి భాగాలు మరో కంపెనీ వస్తువులను మరమ్మత్తు చెయ్యడానికి పనికిరావు. మరమ్మతుకు వచ్చిన వస్తువుల్ని ఒక్కొసారి పారేయాల్సి వస్తుంది. వీటికితోడు మభ్యపరచే వ్యాపార ప్రకటనలు, అర్థరాహిత్యమైన వస్తుతారతమ్యాలు (ప్రాడక్ట్ డిఫరెన్సియేషన్) సైజులు, పాకింగ్, గుత్త వ్యాపార వర్తక నిరోధక పద్ధతులు (మానోపలిస్టిక్ ఎండ్ రిస్ట్రిక్టివ్ ట్రేడ్ ప్రాక్టిసెస్) మొదలైన సవాలక్ష సమస్యలతో నిత్యం సతమతమౌతున్నాడు వినియోగదారుడు. సంపన్న దేశాలు—సామాన్య దేశాలు, ప్రజాస్వామ్యం, నియంతృత్వం, పెట్టుబడిదారీవ్యవస్థ—కమ్యూనిస్టు వ్యవస్థ, ధనికులు—దరిద్రులు, పట్టణవాసులు—పల్లె ప్రజలు, నాడు—నేడు అన్న వివక్షత లేకుండా సర్వకాల సర్వావస్థల్లోను ఈ సమస్యలు వినియోగదార్లను వెంటాడుతునే ఉన్నాయి. ఎటొచ్చీ, సమస్యల స్వరూప స్వభావాల్లో కొన్ని తేడాలున్నాయి. "వినియోగదారే సర్వం సహాధికారి" (కన్స్యూమర్ ఈజ్ ది సావరిన్) అనే మాట వాస్తవ జగత్తులో నీళ్లమూటగా మిగిలిపోయింది.

పైన పేర్కొన్న సమస్యలను ఎదుర్కొనుటకు వినియోగదార్లు చేసే ప్రయత్నాలే కన్స్యూమరిజమని సాధారణంగా భావించబడుతోంది. అంటే కొనుగోలుదార్లు వినిమయదార్లతో—న్యాయమైన హక్కులు, అధికారాలకోసం—జరిపే పోరాట మన్నమాట.[3] అయితే వినియోగదార్ల ప్రతిఘటన మాత్రమే కన్స్యూమరిజానికి పూర్తి నిర్వచనమవదు. ఇది వినియోగదార్ల ఉద్యమానికి పరిమితమైన నిర్వచనం అవుతుంది.

మరి విస్తృతమైన నిర్వచనాన్ని పరిశీలిద్దాం. వినియోగదార్ల ప్రతిఘటనతోబాటు వ్యాపార సంస్థలు, ప్రభుత్వం తీసుకునే చర్యలు కూడ కన్స్యూమరిజమే అవుతుంది. అదెట్లో తెలుసుకుందాం. వినియోగదార్ల సమస్యలకు వ్యాపారసంస్థల దుశ్చర్యలే కారణం గనుక వాటిని పరిష్కరించుటకు వ్యాపార సంస్థలే ఉత్తమ సాధనం. వ్యాపార సంస్థలు వినియోగదార్లను తృప్తిపరచవలసిన అవసరాన్ని గుర్తించి వారి సమస్యలను సరిగా అర్థం చేసుకోవలె. ఇట్టి సదవ

---

* ఉదాహరణకు, రాండమ్ హౌస్ ఆంగ్ల భాషా నిఘంటువు (1969 ప్రతి)లో గాని 20వ శతాబ్దపు ఛాంబర్సు నిఘంటువు(1972ప్రతి)లో గాని ఈమాట కనబడదు.

** శ్రీ ఎ. సి. జార్జి (అప్పటి కేంద్ర పరిశ్రమలు, సివిల్ సప్లైల స్టేట్ మంత్రి) ఇచ్చిన సమాచారం (చూడుము: మార్చి28, 1971 సండే స్టాండర్డ్, పుట 6).

గాహన కొరవడిన వ్యాపార సంస్థలకు నిష్కృతి ఉండదు. వినియోగదార్ల ప్రాముఖ్యతను గూర్చి వ్యాపార సంస్థలకు గాంధీజీ ఇచ్చిన సందేశం.

''మనకోసం వచ్చు వారిలో అతిముఖ్యుడు వినియోగదారుడు. అతడు మనపై ఆధారపడిలేడు. మనమే అతనిపై ఆధారపడి వున్నాం. మన పనికి అతడు అంతరాయంకాదు. అతడే మనకు పనిని కల్పిస్తాడు. మన వ్యాపారానికి అతడు పరాయివాడు కాడు. అందులో అతడు అంతర్భాగమే. అతని అవసరాలను తీర్చడం అతనికి ఉపకారం చేసినట్లవదు. అట్టి అవకాశాన్ని కల్పించి అతనే మనకు మేలు చేస్తున్నాడు.'' కనుక వినియోగదార్ల సమస్యలను తీర్చే బాధ్యత వ్యాపారసంస్థల భుజస్కంధాలపై ఉన్నది. ఒకవేళ వ్యాపారసంస్థలు, వినియోగదార్లు ఈసమస్యలపట్ల ఉపేక్షవహించినప్పటికి ప్రభుత్వం మిన్నకుండరాదు. వినియోగదార్లు ఖర్చుపెట్టే ప్రతి రూపాయకు న్యాయమైన వస్తుసేవలను లభింపచేసి వారి జీవన ప్రమాణాలను పెంచటం ప్రతినాగరిక ప్రభుత్వపు కనీసధర్మం.

దీన్నిబట్టి వినిమయ సంబంధాలలో వినియోగదార్ల అసంతృప్తిని నివారించుటకు వ్యక్తిగతంగాను, సమిష్టిగాను వాడకందార్లు, ప్రభుత్వం, వ్యాపార సంస్థలు తీసుకొనే చర్యలే కన్స్యూమరిజం.[4] అంటే వినియోగదార్లకోసం వారు మాత్రమేగాక వ్యాపార సంస్థలు, ప్రభుత్వం కూడ జరిపే ఉద్యమం. ఇది కన్స్యూమరిజానికి విస్తృతమైన నిర్వచనం.

## కన్స్యూమరిజం పరిధి

కన్స్యూమరిజం మూడు విధాలైన అసంతృప్తి నివారణకు పరిమితమై ఉన్నదని చెప్పవచ్చు. మొదటిది—ఇంతకుముందే చెప్పినట్లు వినియోగదార్లకు వ్యాపార సంస్థలతోగల వినిమయ సంబంధాలవల్ల కలిగే అసంతృప్తి; రెండవది—వినియోగదార్లకు వ్యాపారేతర సంస్థలతో గల వినిమయ సంబంధాలవల్ల కలిగే అసంతృప్తి, ఉదాహరణకు—విద్యా సంస్థలు, ఆసుపత్రులు, ప్రభుత్వ ఏజన్సీలు (పోలీసు, పన్నులశాఖ, వగైరా) మొదలైన ప్రజోపయోగ సంస్థలు; మూడవది—పైరెండు రకాల సంబంధాలవలన ఇతరులకు కలిగే అసంతృప్తి. ఉదాహరణకు వాతావరణ కలుషిత సమస్య.[5] అభివృద్ధి చెందిన దేశాలలో పై మూడు విషయాలకు వినియోగదార్ల ఉద్యమం పరిమితమైనప్పటికి వర్ధమానదేశాల్లోమాత్రం వినియోగదార్లు మొదటి విషయానికి చెందిన సమస్యలనే పూర్తిగా అవగాహన చేసుకొని ఎదుర్కొనే స్థితికి ఇంకా రాలేదు.

## కన్స్యూమరిజం పుట్టుపూర్వోత్తరాలు

''అమ్మబోతే అడవి, కొనబోతే కొరివి'' అన్న ఆర్యోక్తి, ''కొనుగోలుదారు తన జాగ్రత్తలో తానుండవలె'' (కావియెట్ ఎంప్టర్) అన్న సాంప్రదాయసూక్తి వినియోగదార్లు ఏనాటినుండో ఎదుర్కొంటున్న సమస్యలకు సాక్ష్యాలు. ఈ సమస్యలు వినిమయ సంబంధాలు (ఎక్ఛేంజి రిలేషన్‌షిప్స్) ప్రారంభమైనప్పటినుండి అంటే మానవుడు వస్తువులకు వస్తువులను మార్చుకొనటం (barter system) మొదలైనప్పటినుండి ఉన్నప్పటికీ పారిశ్రామిక విప్లవంతో ఇవి బహుళమై జటిలరూపం దాల్చాయి. వినియోగదార్ల సమస్యల్ని వారు సంఘటితంగా ఎదుర్కొనడానికి చేసిన మొదటి ప్రయత్నమే సహకారోద్యమానికి నాంది అయింది. వినియోగదార్ల అసంతృప్తి కారణంగానే 1844లో ఇంగ్లండులో రాక్‌డేల్ సహకార సంఘాన్ని స్థాపించడం, ఆ తరువాత సహకార సంఘాలు ఖండాంతరవ్యాప్తి నొందటం జరిగింది. సహకార సంఘాలు ఆశించినంతగా ఫలితాలను సాధించలేదు. వినియోగదార్ల అసంతృప్తి అలజడుల రూపం ధరించటం, అట్టి అలజడులు ప్రభుత్వపు గుర్తింపును పొందటం ఈ శతాబ్దారంభంలోనే మొదలైంది. ఉదాహరణకు, అమెరికాలో ప్రమాద భూయిష్టమైన వస్తువులు, మభ్యపరిచే వ్యాపార ప్రకటనలకు వ్యతిరేకంగా వినియోగదార్లు 1910, 1930 దశాబ్దాల్లో గొడవ పెట్టిన సందర్భంగా అక్కడి ప్రభుత్వం కొన్ని కొత్త శాసనాలను తీసుకు రావటం జరిగింది. అప్పట్లో ఇట్టి అలజడులు అభివృద్ధిచెందిన దేశాలకు మాత్రమే పరిమితమైనప్పటికి వినియోగదార్ల అసంతృప్తి నివారణ చర్యల అవసరాన్ని వర్ధమాన దేశాలుకూడా గుర్తించాయి. అక్కడకూడా కొన్ని శాసనాలు అమల్లోకి రావడానికి ఎక్కువకాలం పట్టలేదు. ఉదాహరణకు, భారతదేశంలో 1940లో ఔషధాల చట్టం (డ్రగ్స్ యాక్ట్)న్ని 1937లో వ్యవసాయోత్పత్తుల (గ్రేడింగు, మార్కెటింగు) చట్టాన్ని తీసుకు రావటం జరిగింది. ఈ అలజడులు, చట్టాలు వినియోగదార్ల సమస్యలను పరిష్కరించకపోగా, 1930 లో వచ్చిన గొప్ప ఆర్థిక మాంద్యం (గ్రేట్ డిప్రెషన్), 1939లో మొదలైన రెండవ ప్రపంచయుద్ధం వల్ల అసలు వస్తువులే దొరక్కుండా పోయాయి. యుద్ధానంతర సంవత్సరాల్లో తిరిగి ఉత్పత్తులు పెరిగి వాటితోబాటు ప్రజల జీవన ప్రమాణాలు పెరిగాయి. కావల్సినన్ని వస్తువులు లభించడంతో అమెరికా మొదలైన సంపన్న దేశాల్లో వినియోగదార్లదృష్టి వస్తులభ్యతనుండి వస్తునాణ్యతవైపుమళ్లింది. తిరిగి వాడకందార్ల అసంతృప్తి జ్వాలలు 1960 దశాబ్దంలో దట్టంగా అల్లుకోవటం మొదలైంది. ఈ జ్వాలలు ఉద్యమరూపం ధరించటం అమెరికాలోనే ప్రారంభమైందని చెప్పవచ్చు. అప్పట్లో 'రాల్ఫ్‌నాడర్' ఆదేశంలో తయారైన కార్ల లోపాలను, వాటివల్ల వచ్చే ప్రమాదాలను వేలెత్తిచూపటంతో ఇది మొదలైంది. దీనికి తోడు అదే సమయంలో అక్కడి గృహిణులు సూపర్ మార్కెట్లను బహిష్కరించడం జరిగింది. 1962లో అప్పటి అమెరికా ప్రెసిడెంటు కెన్నడీ వినియోగదార్ల నాలుగు హక్కుల్ని— 1. వస్తుభద్రతాహక్కు (ది రైట్ టు సేఫ్టీ) 2. వస్తు సమాచారపు హక్కు (ది రైట్ టు బి ఇన్‌ఫార్మ్‌డ్) 3. వస్తువుల్ని ఎంపిక చేసుకొనే హక్కు (ది రైట్ టు ఛూస్) 4. ఫిర్యాదులను పరిశీలింప జేసుకొనే హక్కు (ది రైట్ టు బి హర్డ్)[6] చాటిచెప్పటంతో ఈ ఉద్యమానికి ప్రభుత్వపు గుర్తింపు లభించినట్లయింది. కెన్నడీ ఇచ్చిన ఊతాన్నే ఆ తర్వాత వచ్చిన ప్రెసిడెంటులు జాన్సన్, నిక్సన్‌లు ఇచ్చారు. వీరు వినియోగదార్ల రక్షణార్థం చాలా సరికొత్త శాసనాలను అమల్లోకి తెచ్చారు. వైట్‌హౌస్‌లో విని

యోగదార్ల వ్యవహారాల ఆఫీసును స్థాపించటం కూడ జరిగింది. 1972లో వినియోగ వస్తు భద్రతా కమీషన్ ఏర్పాటయింది. ఇంతవరకు ఈ ఉద్యమం వినియోగదార్లకేగాక వ్యాపార సంస్థలకు కూడ శ్రేయస్కరమని వ్యాపార వర్గాలు గుర్తించక తప్పలేదు. ఈవిధంగా దీనికి అన్ని వర్గాలనుండి ప్రోత్సాహం లభించడంతో అమెరికాలో అనేకమైన వినియోగదార్ల సంఘాలు స్థాపించబడ్డాయి. వాటిలో ముఖ్యమైనవి: వినియోగదార్ల పరిశోధకసంస్థ: ఈ సంస్థ వందలాది వస్తువులపై పరిశోధనలు జరిపి, ఫలితాలను అందజేస్తుంది; వినియోగదార్ల యూనియన్—ఇది వినియోగదార్ల వివేచిక (కన్స్యూమర్స్ రిపోర్ట్)ను ప్రచురించి వారికి ఉపయోగపడు సమాచారాన్ని తెలియజేస్తుంది; అమెరికా విశ్వవిద్యాలయ మహిళా మండలి, జాతీయ స్త్రీ ఓటర్ల సమాఖ్య, మహిళా మండలుల సాధారణ సమాఖ్య.

ఇతర దేశాల్లో ఇంత ఉధృతంగా లేనప్పటికి ఇదే కాలంలో ఉద్యమ బీజాలు వ్యాపించాయి ఉదాహరణకు డెన్మార్కులో వనితా వినియోగదార్ల సంఘాలు, ఇండియాలో వినియోగదార్ల అసోసియేషన్ ఏర్పడ్డాయి. ఈ విధంగా దేశ దేశాల్లో వ్యాపిస్తున్న వినియోగదార్ల ఉద్యమాన్ని సాంఘిక సంచలనంగా వర్ణించటం పెద్ద పొరపాటే అవుతుంది గాని దీన్ని 1960, 70 దశాబ్దాల సాంఘిక ఉద్యమంగా పేర్కొనవచ్చు.[7] 1972 తర్వాత వచ్చిన చమురు కొరత, విపరీత ద్రవ్యోల్బణంవలన వినియోగదార్లపరిస్థితి మరింత దుర్భరమై ఈ ఉద్యమం త్వరితగతిని వర్ధమాన దేశాలకు కూడ వ్యాపించడం మొదలైంది. రానున్న సంవత్సరాల్లో ఈ ఉద్యమం చల్లారకపోగా మరింత బలపడవచ్చు.

## కన్స్యూమరిజం విజయాలు

వర్ధమాన దేశాల్లో ఈ ఉద్యమం అసలింకా వేళ్లే తన్నుకోలేదు. సంపన్న దేశాల్లో సైతం ఇది బాల్యావస్థలోనే ఉంది. ఇట్టి స్థితిలో అధిక ఫలితాల్ని ఆశించలేం గదా. అయినప్పటికి ఈ ఉద్యమం కొన్ని ఘన విజయాలను (ముఖ్యంగా సంపన్న దేశాల్లో) సాధించిందనే చెప్పాలి. వినియోగదార్లను సంఘటితపరచే కొత్త చైతన్యాన్ని కలిగించటం మొదటి విజయం. అసలు వినియోగదార్లకు సమస్యలున్నాయనీ, ఆ సమస్యలను వారి కృషివలన పరిష్కరించుకొనే అవకాశం ఉందనే భావనకు అవకాశం ఇచ్చింది కన్స్యూమరిజం. వినియోగదార్లను సంతృప్తి పరచవలెనన్న సామాజిక స్పృహను వ్యాపార సంస్థలకు ప్రభుత్వానికి కలగజేయటం ఈ ఉద్యమం సాధించిన రెండో విజయం. ఇందువలన వ్యాపారసంస్థలు, ప్రభుత్వం వినియోగదార్ల సమస్యలను గుర్తించాయి. వారి హక్కులను అంగీకరించటం జరిగింది. బహుశా వినియోగదార్ల రక్షణార్థం శాసనాలు చేయని ప్రభుత్వమే లేదేమో. అమెరికా కాంగ్రెస్ అర్ధ సంవత్సర సమావేశాల్లో వాడకందార్లకు సంబంధించిన బిల్లులు

500కు మించి పరిశీలనకు వచ్చిన ఉదంతాలు ఉన్నాయి. ప్రెసిడెంటు కెన్నడి ప్రకటించిన నాలుగు వినియోగదార్ల హక్కులను గురించి ఇంతకుముందే ప్రస్తావించటం జరిగింది. వీటికితోడు ప్రెసిడెంటు ఫోర్డు వినియోగ విద్య (కన్స్యూమర్ ఎడ్యుకేషన్)ను ఐదవ హక్కుగా ప్రకటించటంతో ఈ ఉద్యమం మరో ముఖ్యమైన మలుపు తిరిగింది.[8] ఉద్యమం యెడల వ్యాపార సంస్థల మారే దృక్పథాన్ని పరిశీలించుదాం. ఈ సందర్భంగా స్టీఫెన్ ఎ. గ్రేజర్, స్టీవెన్ ఎల్. డైమండ్ చేసిన పరిశోధనా ఫలితాలను ప్రస్తావించవలసి ఉంది. అవి : ''ఈ ఉద్యమం వ్యాపార సంస్థలకు హాని కలిగించదు. పోటీని పెంచి అవకాశాల్ని పెంచుతుంది. కొనుగోలుదార్లే జాగ్రత్తపడవలసిన రోజులు గతిస్తున్నాయి. అమ్మకందార్లే తన జాగ్రత్తలో తానుండవలసిన రోజులు వస్తున్నాయి. వ్యాపార ప్రకటనలు యదార్థము, అర్థవంతము, ఉపయోగకరమైనవిగా ఉండవలె. వినియోగదార్ల ఉద్యమం ఎంత మాత్రం ఉపేక్షించదగినది, తాత్కాలికమైనది కాదు. ఇది శాశ్వత పరిణామం. తత్ఫలితాలను వ్యాపార సంస్థలు ఎదుర్కొనవలె. వస్తు నాణ్యతను పెంచి, వినియోగదారుని అవసరాలను తీర్చగల నిర్మాణాత్మకమైన వైఖరిని వ్యాపార సంస్థలు అవలంభించవలె. ప్రభుత్వపు జోక్యమునకు అవకాశమిచ్చే బదులు వ్యాపార సంస్థలు స్వయం శిక్షణను అలవర్చుకొనడం ఉత్తమం''—ఒక సర్వేలో 3,418 మంది అమెరికన్ మేనేజర్లు వెలిబుచ్చిన మెజారిటీ అభిప్రాయాల సారాంశమిది.[9] వినియోగదార్ల సమస్యలపట్ల అన్నివర్గాల్లోను సామాజిక స్పృహను వ్యాపింపజేయుటలో విద్యా సంస్థలు, పత్రికలు ముందుకురావటం మిక్కిలి ముదావహమైన విషయం. దీనిని ఉద్యమపు మూడవ విజయంగా పేర్కొనవచ్చు. ఈనాడు అమెరికాలో 20 శాతం ఉన్నత పాఠశాలల్లో వినియోగదార్ల ఉద్యమం ఒక కోర్సుగా బోధింపబడుతోంది. మరో 50 శాతం పాఠశాలల్లో, ఇతర కోర్సుల్లో ఒక భాగంగా ఇది బోధింపబడుతోంది. చాలా దేశాల్లో చాల పత్రికలు కొంతచోటును వినియోగదార్లసమస్యలకు కేటాయించటం ప్రశంసనీయమైన విషయం. ఈ విజయాలకుతోడు ప్రజా జీవితంలో నైతిక ప్రమాణాలను పెంచేశక్తి కన్స్యూమరిజానికి వుంది. సంఘంపట్ల బాధ్యతల నెరిగి ప్రవర్తించమని ఇతరులను శాసించగలిగిన వినియోగదార్లు అదే సంఘంపట్ల తమ బాధ్యతలను విస్మరించలేరు గదా. కాబట్టి కన్స్యూమరిజం విజయం మానవజాతి నైతిక, ఆర్థిక, సాంఘిక పునరుజ్జీవనానికి సాధనం కాగలదు.

## భారతదేశంలో కన్స్యూమరిజం

వినియోగదార్ల అసంతృప్తి, అలజడులు సంపన్నదేశాల్లో ఉద్యమరూపం ధరించిన 1960, 70 దశాబ్దాల కాలంలోనే మన దేశంలోకూడ అనేకమైన వినియోగదార్ల సంఘాలు స్థాపించబడటం గమనార్హం. ఈ సంఘాల్లో కొన్ని ముఖ్యమైనవి: భారత వినియోగదార్ల సంఘం, భారత వినియోగదార్ల యూనియన్, జాతీయ వినియోగదార్ల సేవాసంఘం, కేంద్ర వినియోగదార్ల కౌన్సిల్, భారత వినియోగదార్ల కౌన్సిల్, జాతీయ వినియోగదార్ల రక్షణ కౌన్సిల్, వినియోగదార్ల వ్యవహారవేదిక, ధరల పెరుగుదల నిరోధక మహిళా సంఘం. ఇవన్నీ ఢిల్లీ, బొంబాయి, కలకత్తా నగరాల్లోనే ఉన్నాయి. ఇప్పుడిప్పుడే ఇతర ముఖ్యమైన నగరాలు, పట్టణాల్లో వినియోగదార్ల సంఘాలు స్థాపించబడుతున్నాయి. ఇంకా ఈ సంఘాలు పెద్ద ఎత్తున సభ్యుల్ని సమీకరించటంగాని, శక్తివంతంగా రూపొందటం గాని జరగనేలేదు. అంటే మనదేశంలో వినియోగదార్ల అలజడులు, అసంతృప్తి ఇంకా ఉద్యమరూపం ధరించనే లేదన్నమాట. సంపన్న దేశాల్లోని సమస్యలతో పోల్చి చూచినట్లయిన మన దేశంలోని సమస్యలు ఎన్నో రెట్లు తీవ్రమైనవైనప్పటికి ఇక్కడ వినియోగదార్లు ఇంత ఉదాసీనంగా ఉండడానికి గల కొన్ని కారణాలు : మన దేశంలోని వినియోగదార్లు వారికిగల హక్కులు, అధికారాలు గురించి తమకు తాముగా అర్థం చేసుకొనే స్థితికి ఇంకా రాలేదు. వారి నిరుపేదరికం, నిరక్షరాస్యత, అక్షరాస్యుల అలసత్వం ఇందుకు కారణాలు. దీనికితోడు సమస్యల స్వరూప స్వభావాలని కుణ్ణంగా వినియోగదార్లకు విడమర్చి ఉద్బోధించే ప్రయత్నాలను ప్రభుత్వం, మేధావివర్గం, విద్యా సంస్థలు, పత్రికలు, రాజకీయ పార్టీలు, స్వచ్ఛంద సాంఘికసేవా సంస్థలు ఏవీ కూడ చేపట్టనేలేదు. కన్స్యూమరిజం ఒక బోధనా విషయంగా ఇంకా విద్యాలయాల్లో ప్రవేశం పొందలేదు. కొంత స్థలాన్ని వినియోగదార్ల వ్యవహారాలకు కేటాయించే పత్రికలు బహుతక్కువ. అదైనా ఇటీవలి పరిణామమే. విద్యాధికతకు—సామాజిక స్పృహకు ఎక్కడా పొంతన ఉన్నట్లు కనబడదు. ఇందుచేతనే మేధావివర్గం వినియోగదార్లకు సంబంధించినంతవరకు ఇంకా ఆకాశ హర్మ్యాల్లోనే ఉన్నారు. వ్యాపార వర్గాలకు ప్రాబల్యం ఎక్కువగా ఉన్న లయన్స్, రోటరీ మొదలైన స్వచ్ఛంద సాంఘిక సేవా సంస్థల నుండి పాఠకందార్లు ఆశించగలిగింది ఏముంటుంది. అసంఖ్యాకంగా ఉన్న మహిళా మండలులకు వినియోగదార్ల సమస్యలున్నట్లు ఇంకా తోచక పోవటం ఆశ్చర్యపడవలసిన విషయం. ఎన్నికల్లో గెలవటానికి కావలసిన నిధులకు వ్యాపారవర్గాల దయాదాక్షిణ్యాలపై ఆధారపడిన రాజకీయ పార్టీలుమాత్రం ఏం చేయగలవు. ఏదో ఒక రాజకీయ పార్టీకి అనుబంధమైన విద్యార్థి సంఘాలు, కార్మిక సంఘాలు మాత్రం చేసేదేముంది. న్యాయమైన వర్తకపు పద్ధతుల సంఘా (ఫెయిర్ ట్రేడ్ ప్రాక్టీసెస్ ఎసోసియేషన్)న్ని స్థాపించడం మినహా వ్యాపార సంస్థలు వినియోగదార్లకు ఇంతవరకు వరగబెట్టింది ఏమీలేదు. ఈ విధంగా అందరూ వినియోగదార్లే అయినప్పటికీ ''ఎవరికివారే యమునాతీరే'' అన్న తత్త్వం అందరిలోనూ జీర్ణించుకుపోవడంవల్ల వినియోగదార్ల సమస్యలను గురించి ఎవరూ అతీగతీ పట్టించుకోవటంలేదు. కాని ఇది చాల ప్రమాదకరమైన ధోరణి. ఇలా ఉపేక్షించడంవలన ప్రజల జీవన ప్రమాణాలు పడిపోయి, ఆర్థికాభివృద్ధి కుంటుపడి, అశాంతి, అరాచకాలు చోటు చేసుకొని ప్రజాస్వామిక శక్తులు, సంస్థలు బలహీనపడే అవకాశం ఉంది. దీన్ని నివారించటం ప్రభుత్వపు తక్షణ కర్తవ్యం.

ఇంతవరకు ప్రభుత్వం తన బాధ్యతను ఎంతవరకు నిర్వర్తించిందో పరిశీలించుదాం. అమెరికా, కెనడా, బ్రిటన్‌లో మాదిరి భారత ప్రభుత్వం వినియోగదార్ల వ్యవహారాలను ఒక కంట కని

(మిగతా 92వ పేజీలో)



శ్రీ ఉమాలక్ష్మీ కంబైన్స్
విచిత్ర జీవితం
దర్శకత్వం
వి.మధుసూదనరావు
నిర్మాతలు
యన్.పద్మాక్షి, పుష్పాభట్

పెట్టుటకు ప్రత్యేక శాఖను ఇంకా ఏర్పాటు చేయనప్పటికి ప్రభుత్వ వైఖరి బొత్తిగా నిర్లక్ష్యంగా ఉందనలేము. ఈ శతాబ్దం మొదటి నుండి వినియోగదార్ల సమస్యల యెడల మన ప్రభుత్వానికి సామాజిక స్పృహ కలగడం ప్రారంభమయిందని చెప్పవచ్చు. 1904–12 సంవత్సరాలమధ్య ప్రభుత్వం తన దృష్టిని సహకార రంగంవైపు మరల్చటం ఇందుకు నిదర్శనం. సహకార రంగాన్ని ప్రభుత్వం ప్రోత్సహించడానికి కారణం తమంతట తామే సమస్యలను పరిష్కరించుకొనే అవకాశాన్ని వినియోగదార్లకు కల్పించుటయే. 1904లో సహకార పరపతి సంఘాల చట్టా (కో–ఆపరేటివ్ క్రెడిట్ సొసయిటీస్ ఆక్ట్)న్ని, 1912 లో సమగ్ర ప్రాతిపదికపై సహకార సంఘాల చట్టా (కో–ఆపరేటివ్ సొసయిటీస్ ఆక్ట్)న్ని తీసుకురావటం. ఆనాటినుండి ప్రభుత్వపు తోడ్పాటుతో వివిధ రకాలైన సహకారసంఘాల (పరపతి, వినియోగ, మార్కెటింగ్ మొ॥)ను స్థాపించటం జరిగింది. ఇట్లు ఏర్పడిన సహకారసంఘాలు సమాజంలోని వివిధ వర్గాల (వ్యవసాయదార్లు, వాడకందార్లు, చేతిపనివారలు, మున్నగువారు) సమస్యలను కొంతవరకు పరిష్కరించటంచేత స్వాతంత్ర్యం వచ్చిన నాటికి వీటి సంఖ్య దాదాపు 1.4 లక్షలకు పెరిగింది. ఇప్పుడివి సుమారు ఇంతకు నాలుగురెట్లున్నవి. (ప్రభుత్వపు చౌకా దుకాణాలతో సహా) వినియోగదార్ల రక్షణార్థం ప్రభుత్వం చేసిన కొన్ని ముఖ్యమైన చట్టాలు: 1952 సంవత్సరపు వస్తు ప్రమాణాల సంస్థా చట్టం (స్టాండర్డ్స్ ఇన్‌స్టిట్యూషన్ సర్టిఫికేషన్ మార్కన్ ఆక్ట్), 1954 సం॥పు ఔషధాల క్రమబద్ధపు చట్టం, (డ్రగ్స్ కంట్రోల్ ఆక్ట్) 1954 సం॥పు ఆహార పదార్థాల కల్తీనివారణ చట్టం (ప్రివెంషన్ ఆఫ్ ఫుడ్ ఎడల్‌టరేషన్ ఆక్ట్), 1955 సం॥పు నిత్యావసర వస్తువుల చట్టం (ఎసెన్షియల్ కమోడిటీస్ ఆక్ట్), 1956 సం॥పు ప్రమాణ తూకాలు కొలతల చట్టం (స్టాండర్డ్ వెయిట్స్ ఎండ్ మెషర్స్ ఆక్ట్) 1963 సం॥పు ధరల వివరాల ప్రదర్శనాదేశం (డిస్‌ప్లే ఆఫ్ ప్రయిసెస్ ఆర్డర్) 1969 సం॥పు గుత్త వ్యాపార వర్తక నిరోధక చట్టం, 1975 సం॥పు పాక్ చేయబడిన వస్తువుల క్రమబద్ధపు ఆదేశం (పేకేజిడ్ కమోడిటీస్ రెగ్యులేషన్ ఆర్డర్) ఇంత హడావుడి చేసినప్పటికి వినియోగదార్ల సమస్యలు మాత్రం సమస్యలుగానే మిగిలిపోయాయి. వినియోగదార్లు ప్రముఖ పాత్రవహించవలసిన సహకారోద్యమం వారి నిరాశక్తి, నిరాదరణవల్ల నిర్వీర్యమై ఆశించిన ఫలితాలను సాధించలేదు. వినియోగదార్ల రక్షణార్థం చేసిన చట్టాలు లోపరహితాలని అనలేం. కానీ ఇవి కూడ పటిష్ఠంగా అమలు జరగనేలేదు. ప్రభుత్వ యంత్రాంగపు అలసత్వం, అవినీతి, వినియోదార్ల నిస్పృహాయస్థితి, వారిలో పేరుకు పోయిన నిరాశ నిస్పృహలు ఇందుకు కారణంగా చెప్పవచ్చు.

## జరగవలసినది

ప్రభుత్వపు ప్రేరణ, మార్గ దర్శకత్వం సహాయం లేకుండా మన దేశంలో వాడ వాడల వినియోగదార్ల సంఘాలను స్థాపించడం కష్టసాధ్యమైన పని. ఈ విషయాన్ని ప్రభుత్వం గుర్తించినప్పటికి (అత్యవసర పరిస్థితి కాలంలో) ఈ మేరకు తగిన చర్యలు తీసుకోవటం ఇంతవరకుజరగనేలేదు. అవసరమైతే ఇందుగ్గాను ప్రత్యేక శాసనాలు చేయుటకు వెనుకాడరాదు. ఇతర దేశాల్లో మాదిరి వినియోగదార్ల వ్యవహారాలను చూచుటకు ప్రభుత్వంలో ఒక ప్రత్యేక శాఖను ఏర్పాటు చేయటమేగాక ప్రజోపయోగ సంస్థల్లోను, ప్రభుత్వరంగ సంస్థల్లోను, వినియోగదార్ల విభాగాలను (కన్స్యూమర్స్ సెలెన్) తెరచి ప్రయివేటు రంగ సంస్థలకు ఆదర్శప్రాయం కావలె. ఈ విధంగా చేయటంవలన వినియోగదార్ల అభీష్టాలను, ఫిర్యాదులనుతెలుసుకొనివారినిసంతృప్తిపరచుటకుప్రయత్నించవచ్చు.

విద్యావేత్తలు; ప్రభుత్వం వినియోగ విద్య ప్రాధాన్యతను గుర్తించి ఈ విద్యను బోధించుటకు సత్వరమే పథకాలను చేపట్టవలె. హైస్కూలు, కాలేజీలలో వినియోగ విద్యా బోధనను ప్రారంభించి పత్రికలు, రేడియో, దూరదర్శిని మొదలైన సాధనాలను కూడ ఇందుకు విరివిగా ఉపయోగించవలె. వినియోగ విద్యను వ్యాప్తి చేయటం ఒక్క ప్రభుత్వంవల్ల అయ్యేపనికాదు. మేథావులు, విద్యార్థి సంఘాలు, మహిళా మండలులు, స్వఛ్ఛంద సాంఘిక సేవా సంస్థలు ఇందుకు నడుంకట్టవలసి ఉంది. వినియోగదార్ల సంఘాలను రాజకీయపార్టీలు, ఇతరులు స్వప్రయోజనాలకు వేదికలుగా ఉపయోగించుకొనక నిగ్రహాన్ని చూపితే తప్ప ఈ ఉద్యమం బలపడదు.

వినియోగ వస్తువుల్ని పరీక్షించుటకు, పరిశోధించుటకు విద్యాలయాల్లోని ప్రయోగశాలల్ని ఉపయోగించవలె. అందుకు అవసరమైన సాధన సంపత్తిని సమకూర్చి ఈ ప్రయోగశాలల్ని అధునాతన పర్చవలసి ఉంది.

వ్యాపార సంస్థలు ధర్మకర్తృత్వ సూత్రాన్ని ఆమోదించి గాంధేయ మార్గాన్ని అవలంభించిననాడు సర్వోదయ సమాజానికి పునాదులు ఏర్పడతాయి.

## రెఫరెన్సులు (REFERENCES)


1. "Checking Adulteration", Editorial, Navabharat Times, 30th Jan., 1976 (Quoted from : U. I. Gupta and S. S. Lodha, "Consumer Protection–Need for Stringent Measures", Indian Journal of Marketing, August, 1976 P. 7).
2. P. S. Lokanadhan, "The Consumer at Sea", Marketing Management and the Indian Economy, (Ed.) S. Neelamegham (Vikas Publications : Delhi, 1970), P. 179.
3. Stephen A. Greyser and Steven L. Diamond, "Business is adapting to Consumerism", Harvard Business Review, Sep. – Oct., 1974. P. 38.
4. William J. Stanton Fundamentals of Marketing, (McGraw–Hill Kogakusha: Tokyo, 1975). P. 671.
5. Ibid P 671–2.
6. Quoted from : William J, Stanton, op. cit., P. 671.
7. William J. Stanton, op. cit., 671.
8. Quoted From : Paul N. Bloom and Mark J. Silver, "Consumer Education : Marketers take Heed", Harvard Business Review, Jan. – Feb., 1976. P. 40.
9. Stephen A. Greyser and Steven, L. Diamond, op. cit., P. 39.

# బ్రౌను ఉత్తరాలు - విశేషాలు

బ్రౌను పోర ఆశ్రిత మందారమే కాకుండా ఆర్తత్రాణ పరాయణుడు, శరణాగతవత్సలుడు. నౌకరీకో, శ్రీరంగయాత్రకో, ఉపనయనానికో, పెళ్ళికో, దారి ఖర్చులకో, తిండీ తిప్పలకో ఆయన్ని యాచించని వాళ్ళులేరనే చెప్పొచ్చు. కాని పుస్తకానికో, విద్య నేర్చుకోడానికే ఆయన్ని అభ్యర్థించిన వాళ్ళూ లేకపోలేదు.

## ఆనందాయి - బ్రౌన్

ఈ కింది ఉత్తరం ఆనందాయి అనే ద్రవిడ స్త్రీది. ఆమెది తిరుచునాపల్లి. తమిళంలో శాస్త్రాధ్యయనం కూడా చేసిందట. తెలుగు నేర్చుకోవాలనే యావతో బ్రౌనుకి దరఖాస్తు పెట్టుకొని ఆయన దర్శనం కోసం గేటువద్ద నిలుచుండేదట !

నా తండ్రి అయినటువంటి
మహారాజశ్రీ సి. పి. బ్రౌన్ దొరవారి సముఖానకు

ముల్లా వీధిలో పడమటశ్రేణిలో కందప్ప మొదలారి ఇంటిలో దిగి వుండే ఆనందాయి మిక్కిలి వినయ విధేయముతోటి సలాంచేసి వ్రాసుకొన్న మనవి యేమంటే–యిప్పుడున్ను నేను వుండడము తిరుచునాపల్లి. నాకు బాల్యమందు మనసుకు కొంచం వికల్పం కల్గి ఐయ్యలు వెళ్లాలని తర్వాత కొంతమట్టుకు అరవం చదివి అందులో శాస్త్రమున్ను చూచివున్నాను. యిదిగాక యిప్పట్లో తెనుగున్ను గ్రంథమున్ను చదవవలెనని ఆపేక్ష కలిగివున్నాను గనుక యెవరి తావునపోతే నాకు చదువు చెప్పిస్తారని విచారించగా వేపేరిలో బ్రౌన్ దొర వారి తావునపోతే వారు చెప్పియిస్తురని కొందరు చెప్పగా విని వచ్చినాను గనుక తాము నా యందు దయవుంచి అన్న వస్త్రములున్ను యిప్పించి విద్యాదానం చేయవలెనని తమ ఘనాన్ని మిక్కిలి ప్రార్థిస్తున్నాను. మాబోంట్లవాండ్లకు తల్లి దండ్రాదులు మీరేగాని వేరే యెవరు లేరు. గనుక యింత వుపకారం తాము చేసే విషయమందు తమకు సేవకా వృత్తి చేసుకొని తమ ఆదరువులోనే వుండిపోతాను. నేను యేమన్ని తెలియనిదానను గనుక మిమ్ములనే నమ్మియున్నాను. ఇదిగాక రేపటి దినం గేటువద్ద కనిపెట్టి వుంటున్నాను. క్షమించవలసినది. ౧౮౪౦ సంవత్సరం ఆని నెల ౨౦ తేది.

# II

## దుర్గం లక్ష్మీనరిసింహులు - మేఘసందేశం

కాళిదాసు కుమారసంభవం ముగించి, మేఘసందేశం చదవాలని సత్సంకల్పం గల్గిన ఒక బుద్ధిమంతుడైన విద్యార్థి బ్రౌనువద్దకు వెళ్ళడానికి గేటు బంట్రోతులు ఆపేస్తారనే భయంచేత అక్కడే అర్జీపట్టుకొని నిలబడిపోయాడట.

మహారాజరాజశ్రీయులయిన సి. పి. బ్రౌన్‌దొరవారి సముఖమునకు –

రాజమహేంద్రవరం కాపురస్థుడు దుర్గం లక్ష్మీనృసింహులు అనేక సలాములుచేసి వ్రాసుకొనే మనవి యేమనగా నేను మా దేశమందు తలిదండ్రులను విడిచిపోయి దక్షిణ దేశమందు ప్రవేశించి కొన్నాళ్ళు కంచిలో చదువుకొని, పిమ్మట యిచ్చట ప్రవేశించి తిరువల్లిక్కేణిలో శ్రీరామానుజ మతమందు కుమార సంభవమనే కావ్యం చదివి యిప్పుడు మేఘసందేశమనే కావ్యము చదవవలెనని బుద్ధిపుట్టి నేను పద్నాలుగు యేండ్ల వయసు కలిగినవాడున్ను, బ్రహ్మచారియున్ను మధూకర వృత్తిచే జీవిస్తూవున్నవాడౌట చేతనున్ను నాకెక్కడా సదరు పుస్తకం దొరకక, కొందామంటే దుడ్డులేక మీ కీర్తిని విని నా యావత్సంగతులు మీకు తెలియజేసుకొంటిని గనుక నా మొరాలకించి మేఘసందేశమొక ప్రతి యిప్పించవలెను.

నేను పశివాణ్ని గనుకనున్ను మీ తావుకు మీ నౌకర్లు రానివ్వకుండా చేతురని తలచి తమ ద్వారము కాచివున్న నన్ను పిలిపించి నే కోరిన పుస్తకము నాకు యిప్పించవలెనని తమ ఘనాన్ని మిక్కిలి కోరుతున్నాను. యిదే అనేక సలాములు. (M. 431)

# III

## బ్రౌనుకి విగ్రహాలపై మోజు

తాళపత్ర గ్రంథాలు ఒక్కటే బ్రౌనుకి ఇష్టం అని అనుకోనక్కరలేదు. అందరి విదేశీ దొరలలాగే బ్రౌనుకికూడా విగ్రహాల సేకరణమీద కూడా మక్కువ ఉండేది. ఈ క్రింది పోలిసెద్ది మల్లయ వ్రాసిన ఉత్తరం చదవండి.

మహారాజశ్రీ సి. పి. బ్రౌన్ యస్క్వాయరు అష్టింగ్ కల్కటరు జిల్లా గుంటూరు సర్కారు వృత్తిన్ జాన్నగారుడ తాలూకే పల్నాడు వగైరా గారి సముఖానకు—

పోలిసెద్ది మల్లయదారోగా డివిజన్ కొండవీడు వ్రాసుకొన్న అర్జీ. యీ నెల ది ౧౦ తారీఖున నెం ౭౮ మన దయ చేయించిన హుకుములో పురాతనమయిన కొన్ని శిలావిగ్రహాలు స్త్రీ పురుష విగ్రహాలలో యేవి అయినాసరే వేగజం యెత్తుకులోగా వుండేవిగా కావలశి వున్నవన్ని కొండవీటి వగైరా గ్రామాదులలో యెన్ని దొరికే విన్ని అవి భిన్నమయినవో, సమగ్రంగా వున్నవో విచారించి యత్తిల్లా చేశేదనిన్నీ భిన్నమయినటువంటి తామ్ర లోహ కంచువిగ్రహాలు దొరికే పక్షముకు విచారించి యెత్తిల్లా చాయమన్నిన్ని మయశిల్ప మనే శిల్పి శాస్త్రమున్ను వాస్తుశాస్త్రమున్ను గీర్వాణపు గ్రంథాలు దొరికిన పక్షమందు తెప్పించి పంపిస్తే వాటికి ప్రతులు వ్రాయించ తిర్గి పంపించడమవుతూ వున్నదనిన్ని యిత్యాది సంగతులు ఆజ్ఞాపించినారు గనుక మనవి వ్రాసుకొనేది యేమంటే—

యీ డివిజన్ యిలాకాలో కొండవీడు అమీనాబాదులో శిధిలమయిన దేవస్తలాలలో విగ్రహాలు పూర్వమే యెవరెవరు తీసుకొని పోయినారని తెలిసినది.

యిప్పుడున్ను కొండవీడు ఖిల్లా వగైరాలలోవుండే శిధిలమయిన దేవాలయములలో యేమి, యింకా యితర జాగాలను యేమి నేను వెళ్లి విచారిస్తే యిప్పట్లో విగ్రహాలు యెక్కడా వున్నట్టు జాడ కనుబడలేదు. యింకా యిలాకా గ్రామాదులలో విచారిస్తున్నాను. వున్న పక్షమందు ఆ విగ్రహాలయొక్క తరహాదారీ వగైరాలు జాహిరు చేస్కుంటూ వున్నాను. భిన్నమైన తామ్రలోహ కంచు విగ్రహాలను గురించి విచారిస్తే యెవరి వద్దనున్ను వున్నట్టు కనుపడలేదు. యీ యిలాకాలోకి ఫిరంగిపురం అనే గ్రామంలో తామ్ర లోహ కంచు విగ్రహాలు పోతపోశే కంచర భద్రప్ప అనేవారు వుండి కాటకం వున్నందున యిక్కడ జరుగుబాటు లేక యీనామధ్యను బందరు ఆ ప్రాంతములుక్కు వెళ్లినాడని తెలిశినది.

(మిగతా 96 వ పేజీలో)

# నేను

### శ్రీ వసంతరావు వేంకటరావు

పుట్టకే గిట్టుటయు సాధ్యమె ?
 గిట్టకే పుట్టుటయు సాధ్యమె ?
పుట్టుటయు గిట్టుటయు జీవుని
పట్టి వదలని పరంపరలట !

''నేను నే'' నను అహంకారమె
కాని నిజముగ ''ఎవరునే ?'' నని
మాన సాంతరమందు సంశో
ధన మొనర్చిన ఏమి తేలును ?

''నా మనోజ్ఞ శరీర'' మందురు,
''నా మహోజ్జ్వల మేధ'' యందురు,
''నా వినిర్మల హృదయ'' మందురు,
''నా విశిష్ట ప్రజ్ఞ'' యందురు.

కావివేవియు ''నేను''; కావున
''చావు చా'' వని భయందేనికి ?
అంత మందలి మిగిలిపోగా
హంసవలె ''నే'' నెగిరిపోవును.

మయశిల్పం అనే శిల్ప శాస్త్రమున్నూ, వాస్తు శాస్త్రమును గురించి విచారించినంతల్లో యీవైపుల ఆ గ్రంథములు సంపాదన చేశినవారు యవరూ లేనట్లు తెలిశినది. మయశిల్పం అనే శిల్ప శాస్త్రము వాస్తు శాస్త్రముయొక్క సంగతులు బాగా తెలిశినవాండ్లు తెనాలి తాణా యిలాకా కూచిపూడి అనే గ్రామంలో మాగులూరు సుబ్బాబత్తుడు అనే కంసాలిన్ని, చేబ్రోలు తాణా యిలాకా అమరావతి ఆ ప్రాంతముల రామయోగి అనే కంసాలిన్నీ వున్నట్టు తెలిశినది. యీ యిద్దరున్ను యోగశాస్త్రముల సంగతి యేమి, సదరు శాస్త్రముల సంగతి యేమి తెలిశినవాండ్లు గన్క వాండ్లవద్దను ఆ గ్రంథములు వుండవచ్చును. మరిన్ని పోత విగ్రహాలు పోశేవాండ్లున్ను గన్క భిన్నమైన విగ్రహాలున్ను వాళ్లపరంగానే వుండవచ్చును గన్క నాకు తెలిశిన సంగతి విశద పర్చుకొన్నాను. దివ్యచిత్తానకు తేవలెను. ది ౧౮ జనవరి ౧౮33 సం. మొకాం కొండవీడు. ద. పోతే పెద్ది మల్లయదారోగా.

డి కొండవీడు

# IV

భట్టిపోలు రామయ బ్రౌనును కవుసుకొని ఒక పెద్ద వచనం రాశాడు. అది చిత్రమైన వచన రచన. 'సత్యము' అనే మకుటంలో ఆ వచనం సాగుతూంది. బ్రౌను దర్శనం చేసుకొన్న వారు ఏ విధమైన అనుభూతి పొందుతారో తెలియజేస్తుంది ఈ చిన్న వచనం. ఆ బ్రవును దొరవారు యిటు వెనక మనో సంకటము చేత డాక్టరు సర్టిఫికేట్ మీాద నీలగిరి ప్రవేశించి అచ్చట నున్న కాల మందు బందరు జిల్లాలో నా మీాద వచ్చిన ఫిర్యాదును గురించిన్ని మేము కాచియున్న శ్రీరంగ యాత్రను గురించిన్ని మనవి వ్రాసి కొన్నిందల్లా తాము యింగ్లీషు దొరలమై యుండి ఆడితప్పేది లేదును అట్లా తప్పినామని వాదించడం తమరిని వుూదాసించుట కాదాయని వారి బొట్లేరు వుత్తరములో వ్రాసి పంపించిన మాట సత్యము.

బ్రౌను దొరవారు నీలగిరి నుంచి తిరిగి యీ రాజధానికి ప్రవేశించిన వెనక యధానిధిగా వారి దర్శనం చేసుకోవడములోను ఆన ౧౮౫౮ సం. ది 3౦ మార్చి తారీఖున పగులు నాలుగు గంటల వేళ లాయర్ వారన్ దొరవారి మేడ క్రిందను వరండాలో కూర్చుని వుండగా నేను ఆ దొరవారి దర్శనం చేసుకొని నామీాద వచ్చిన ఫిర్యాది నివారణ చేయించి నన్ను రుణవిముక్తుణ్నిగా కటాక్షించి శ్రీరంగ యాత్రకు శలవు యిప్పించి పంపించవలయునని నేను ఖద్దున మనవి చేసుకొన్నంతలో ఆ దొరవారు 'మంచిది మంచింది' అని శలవు యివ్వడం మాత్రమే కాకుండా కుర్చీమీద నుంచి లేచి పస్తుతం నా విషయమై తమవల్ల కొన్ని కార్యములు జరగబడుతవి కాని మరి కొన్ని కార్యముల జరగబడవని శెలవుయిచ్చి లోపలికి వెళ్ళిన మాట సత్యము. M. 430

పై జాబుల్లో కొన్ని విశేషాలు తెలుస్తాయి. బ్రౌను మద్రాసులో వేపేరీలోని లాయర్ వారన్ దొరగారి మేడలో ఉండేవాడట. ఆ మేడ యిప్పుడు ఉందో లేదో పరిశీలించాలి.

గొప్పవారి దర్శనానికి నోచుకోలేని వాళ్ళు వాళ్ళ భవనాల గేటు వద్ద పడిగాపులు పడుతూ వేచి ఉంటూ ఉంటారు. బ్రౌను దర్శన కోసం కూడా ఎంతో మంది అలా నిలిచి ఉండేవారట.

ఇవిగాక డిక్షనరీ రామస్వామి, కంపోజిటరు చిన్నయ, గుర్రపురాజు చెల్లకుట్టు, దర్జీమేస్త్రి బెల్లంకొండ పుల్లయ, బొట్లేరు సూదాబత్తుల ఆదినారాయణ వ్రాసిన ఉత్తరాలు ఉన్నాయి. అవికూడా త్వరలో ప్రచురించడం జరుగగలదు.

— ఒక విలేఖరి.

Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.

శ్రీరస్తు - శ్రీ త్రిపురసుందరీ పరశివాభ్యాం నమః

# శ్రీ కాలయుక్తనామ సంవత్సర పూర్ణశాస్త్రీయ (ఆంధ్రపత్రికా) పంచాంగమ్

## బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రిణః పుత్రాభ్యాం

## "దైవజ్ఞచిన్తామణి" శ్రీ చినకృష్ణమూర్తిశాస్త్రి, "భాషాప్రవీణ" శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిభ్యాం ప్రణీతమ్

విఘ్నేశ విధిమార్తాండ చంద్రేంద్రోపేంద్ర వందిత నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే.
వేదమయీం నాదమయీం బిందుమయీం పరపదోద్య దిందుమయీం
మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం.

### సంవత్సర ఫలము

ఈ సంవత్సరమున రాజు ధాన్యాధిపతి శని. మంత్రి శుక్రుడు. సేనానాయకుడు, అర్ఘాధిపతి, మేఘాధిపతిగురుడు. సస్యాధిపతి, రసాధిపతి, నీరసాధిపతి కుజుడు. ఇట్లు 9 నాయకులలోను 4 ఆధిపత్యములు శుభుల కయినవి. కావున సర్వ సస్య సముదాయమగు 16 వీసములలో 9 వీసములు [2/3] పంట ఫలించును. పశుపాలకుడు, గోష్ఠ ప్రవేశకుడు, బలరాముడు గోష్ఠ బహిష్కర్త శ్రీకృష్ణుడు. సంవత్సరాది లగాయతు శ్రావణ బ౭ గురు వ॥ బాల్య వయో విశిష్ట గణికా హస్తమందు తదాది మార్గశిర శు ౫ సో॥వ॥ యౌవన వయో విశిష్ట గణికాహస్తమందు తదాది పౌష శు౧ఆది వ॥ వార్ధక్య వయో విశిష్ట గణికా హస్తమందు తదాద్యావత్సరం తిర్గి యౌవన వయో విశిష్ట గణికా హస్తమందు కుంచముండును. నదీ మాతృకలు. దేవ మాతృకలు సమానముగ పండును. భాద్రపద శు. ౧౫ శ॥ వ॥ ఖచ్ఛన్న చంద్రగ్రహణం 2 ఫాల్గు శు ౧౫ మం॥ మంగళ వారమున త్రిపాదాధికగ్రాస చంద్రగ్రహణము సంభవించును. శ్రావణ ౧ శనివారమున యమునా పుష్కరం ప్రారంభమగును.

రాబోవు సిద్ధార్థి సం. లో గోదావరీ పుష్కరం రాగలదు.



### మౌఢ్యములు

జ్యేష్ఠ బ ౭ సోమ ప్ర॥ ఆషాఢ బ౫ సోమ వ॥ గురుమౌఢ్యం
ఆశ్వ బ ౧౪ సోమ ప్ర॥ కార్తిక శు ౧౩ ఆది వ॥ శుక్రమౌఢ్యం

### శకములు

కల్యాద్యబ్దాః ౫౦౭౯ శాలివాహన శకః ౧౯౦౦
ఫసలీ సన్ ౧౩౮౭, ౮౮ హిజరీసన్ ౧౩౯౮,౯౯
క్రీస్తు శకః 1978, 79 భారత స్వాతంత్ర్య శకః 31, 32

## ఆంధ్రపత్రికా కార్యాలయము, గాంధీనగరం, విజయవాడ - 3

### పంచాంగ పద్ధతి వివరణము

ఇందు కాలమానము యథాప్రకారముగా విజయవాడ, గుంటూరు, ఏలూరు మొదలగు ఆంధ్ర ప్రదేశ్ మధ్యభాగమునకు చూపబడినది. తిథి, నక్షత్రములు ఘటికలలోను, గంటలలోను కూడ చూపబడినవి. శుభ ముహూర్తములు—దుర్ముహూర్తములు—వర్జ్యములు—మహాపాతలు గంటలలో మాత్రం చూపబడినవి. యోగకరణ, అమృత, గ్రహ ప్రవేశములు ఘటికలలో మాత్రం చూపబడినవి. భారత ప్రభుత్వముచే నియమింపబడిన కాలెండరు రిఫార్మ్ కమిటీవారి నిర్ణయము ననుసరించి ప్రకటింపబడిన ఇండియన్ ఎఫెమెరీసు అండ్ నాటికల్ అల్మనాక్కునకు సరిపడునట్లు చూపబడినవి. నూతన వేధశాలల యందు కనుగొనబడిన భూకేంద్రమునకు సరిపడు వాస్తవిక రవి చంద్రులచే సాధింపబడిన తిథ్యాధికము, గ్రహసంచారము ఇందు ప్రాధాన్యముగ చూపబడినవి. ఈ తిథ్యాధి గ్రహ సంచారములే పంచాంగమున వ్రాసినట్లు ఆకసమున సరిపడుచున్నవి. న్యాయమును లోకము తెలిసికొనుటకొరకు బేధమును గుర్తింప గలందులకు పూర్వ పద్ధతి పంచాంగము కూడా ఇందు సంగ్రహముగ చూపబడినది. ఇందు చూపబడిన పూర్ణ శాస్త్రీయ పద్ధతియే శాస్త్రీయమని గ్రహింపనగునని మా నిశ్చితాభిప్రాయము. ఇందు తిథ్యాది, ఘటికలు, ఉదయాస్తమయములు, శుభ ముహూర్తములు, దుర్ముహూర్తములు, లగ్నాంతకాలములు, నిరయణ గ్రహస్ఫుటములును విజయవాడ, గుంటూరు, ఏలూరు ప్రాంతములకు చూపబడినవి. దేశాంతర చక్రములును చూపబడినవి. ఇందు వేదాంగ జ్యోతిషమున సూచింపబడిన అశ్విన్యాదిని గ్రహించి ఈ పంచాంగ రచన చేసియున్నాము గావున వైదికము సనాతనము గూడ యగుచున్నది. 10 అక్షాంశ లగాయతు 30 అక్షాంశ వరకు లగ్న ప్రమాణములు యివ్వబడినవి. శాస్త్రమునకు ప్రత్యక్షమునకు సముచితమై యొప్పు ఈ పంచాంగమును గ్రహించి శ్రౌతస్మార్త కర్మల నాచరింప గోరుచున్నాము.

